మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే అందరి నోట ఒకే మాట...

ఇది తప్పక

# డెట్

డిటర్జెంట్ బిళ్ల వుతుకే



# చూపుకి
# అందం
# కంటికి
# చలువ
# అదే
# ఐటెక్స్
# కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలువ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033



'అభిప్రాయాలు' శీర్షికలో ప్రచురింపబడే ప్రతి లేఖకూ చిన్న పారితోషికం ఐదు రూపాయలు

### కన్యాత్వ పరీక్ష!

ఫిబ్రవరి ఒకటిన సభ్యమానవ ప్రపంచమంతా సిగ్గుతో తల వంచుకోవలసిన సంఘటన ఒకటి తెలియ వచ్చింది. మన దేశం నుంచి ఇంగ్లండులో స్థిరపడదామని వెళ్ళిన ఒక వనిత కన్యాత్వపరీక్షకు గురైంది. ఆమె అక్కడికి తనకు కాబోయే వరుడిని కలుసుకునేందుకు వెళ్ళింది. "నాకీ వ్యవహారాలన్నీ తెలియవు. మగ డాక్టరు నన్ను పరీక్షిస్తారని తెలిసినప్పుడు పైన ధరించేందుకు వస్త్రం యిస్తేనే పరీక్షకి వప్పుకుంటానన్నాను. కాని వారు అంగీకరించలేదు. నన్ను నాకు కాబోయే భర్తని కలుసుకోనివ్వకుండా ఢిల్లీకి తిరిగి పంపేస్తారేమోనని భయం వేసింది. దాంతో వారు చెప్పినట్లే పరీక్ష చేయించుకోవలసి వచ్చింది" అని చెప్పింది న్యూఢిల్లీకి చెందిన ఆ ఉపాధ్యాయిని. ఆమె వయసు ముప్పైఅయిదు. ఆ పరీక్షలో ఆమె 'కన్య' అని తేలింది. ఈ వివరాలన్నీ ఇంగ్లండులోని ప్రముఖ దిన పత్రిక 'ది గార్డియన్' ఘాటుగా విమర్శిస్తూ ప్రచురించింది. దాంతో మన దేశంలోనూ ప్రపంచ వ్యాప్తంగానూ దుమారం చెలరేగింది. ఇకపై వనితలపై యిటువంటి పరీక్షలు జరపబోమని బ్రిటిష్ మంత్రివర్గం తెలియజేయడం ఆనందదాయకమైన విషయమే. కాని అటువంటి అమానుషత్వానికి ఒడబడిన అధికారులపై ఎటువంటి చర్యలు తీసుకోమని బ్రిటిషు ప్రభుత్వం ప్రకటించడం శోచనీయం.

దాంతో బ్రిటిషు ప్రభుత్వం 'వనితా లోకానికి క్షమార్పణ చెప్పుకోవాలని కోరింది మద్రాసులోని 'పెణ్ణురిమై ఇయక్కం' అనే స్త్రీ జనాభివృద్ధి కోసం పాటుబడే సంస్థ. ఆ అధికారులపై తగిన చర్య తీసుకోవాలనీ కోరింది. ఈ సంస్థ సభ్యులు అవసరమైతే ఈ విషయంపై ఉద్యమం లేవదీయడానికి సన్నిహాలు ప్రారంభిస్తామన్నారు. కాని మన రాష్ట్రంలోని మహిళామండలులుగానీ, లయన్ లేడీ క్లబ్‌లుగానీ స్త్రీలోకానికి యింతటి అవమానకరమైన సంఘటన జరుగుతూ వుంటే కనీసం నోరు కూడా మెదపలేదెందుచేత ?

మహిళామండలులు స్థాపించడం అంటే వంటల పోటీలు, కుట్లు అల్లికల ప్రదర్శనలు నిర్వహించడం, ఫొటోలు తీయించుకుని పత్రికలలో చూసి మురిసిపోవడం మాత్రమే కాదు. స్త్రీ జనోద్ధరణ కోసం పాటుబడటానికి అన్నది గ్రహించాలి వీరు. ఆఁ.... ఎక్కడో...ఎవరికో....ఏదో జరిగితే అందుకు మనం ఏం చేస్తాం ?....అని ఉదాసీనంగా ఊరుకో కూడదు. అదే రేపు తమకి జరగవచ్చు. తమవాళ్ళకి జరగవచ్చు. అందువల్ల, సాటిస్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను, అవమానాలను అరికట్టడానికి కూడా ప్రయత్నిస్తూ, అభివృద్ధి పథకాలలో పాల్గొంటూ సాంఘిక జీవనంలో నవచైతన్యానికి ఈ సంఘాలు నాందిపలకాలి. అప్పుడే ఈ మహిళామండలులు 'ఆంధ్ర వనిత'కి గర్వకారణమవుతాయి.

రాధానాయుడు — కోయంబత్తూరు


# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 4 సంచిక : 9

మార్చి : 1979

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవై నాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


వచ్చే సంచికలో

'ఉగాది కథల పోటీ'లో

గెలుపొందిన మూడు కథలు!!

### బాలనేరస్థుల దయనీయస్థితి

ఇటీవల తమిళనాడులోని ఒక ముఖ్యనగరానికి తిరుచ్చికి వెళ్ళినప్పుడు అక్కడ చిల్డ్రన్స్ ఎయిడ్ సొసైటీ తరపున నడుపబడే బాలనేరస్థుల విడిదిని (Juvenile Reception Home) చూసే అవకాశం లభించింది. ఆ పట్టణంలోని కొందరి ప్రముఖుల అజమాయిషీ క్రింద వుంటున్న ఆ విడిది బాలల విడిదిలా లేదు; పశువుల పాకలా వుంది! ఆ పిల్లలందరూ తినడం, నిద్ర పోవడం అంతా ఒకే హాల్లో. ఆ హాలుకు ఒక మూలలో నీళ్ళకు నోచుకోని లేవటరీ! ఆ విడిదికి పట్టణ మునిసిపాలిటీవారి నీటి సరఫరా వుంది. అయితే నీళ్ళు మాత్రం రావు. ఎందుకు ? అని అడిగితే — దాని నిర్వాహకులు మునిసిపాలిటీకి చెల్లించవలసిన వాటర్ బిల్ చెల్లించలేదుట. ఈ కారణంగానే విద్యుత్ సరఫరా కూడా ఆపు చేయబడిందట. వాళ్ళు త్రాగడానికి ఉపయోగించే బావి నీటిలో సర్వ రోగాలకు మూల కారణాలయిన అన్నిరకాల క్రిములూ వున్నాయి. ఆ వసతి గృహంలో నలభై మంది పిల్లలు వుండడానికే సౌకర్యంగా వుంటుంది. అయితే అందులో ఎప్పుడూ డెబ్భైఅయిదుమందికి తగ్గకుండా వుంటారట. అక్కడ ఒక ఆరేళ్ళ పిల్లవాణ్ణి కూడా చూసి ఆశ్చర్యపోయాను. కడుపునిండా గంజి త్రాగి ఎన్నో రోజులయినట్టుంది వాళ్ళ ముఖాలు చూస్తే. ఉదయం నాలుగు గుక్కెళ్ళ గంజి, మధ్యాహ్నం చాలీచాలని ఓ గిన్నెడు అన్నం పెడతారుట. అయితే ప్రభుత్వం మంజూరు చేసేది మాత్రం రోజుకు ఓ పిల్లవాడికి రూపాయి ముప్పావలా. ఆ విడిదిలోని వారిలో చాలామంది సినిమా హాల్లో టీ, సోడా, తినుబండారాలు అమ్మేవాళ్ళుగా-హోటల్‌లో టేబిల్స్ తుడిచే వాళ్ళుగా పని చేసిన వాళ్ళే. మరికొందరు చిన్న చిన్న పరిశ్రమలలో కూలీలుగా పని చేసినవాళ్ళు. (బాలల శ్రమ నిషిద్ధం అన్నది వేరే విషయం) ఇంకో విషయం ఏమిటంటే కొందరిని ఖైదు చేసినట్టు వాళ్ళ తల్లిదండ్రులకు కూడా తెలియ చేయలేదట. ఇంతకూ ఈ బాలనేరస్థులు చేసిన నేరం ఏమిటి ? కన్నవారి ఆలన పాలనకు దూరమై, కాలేకడుపులు నింపుకోడానికి రోడ్డు పక్క, బస్‌స్టాండ్ వద్ద, రైల్వే స్టేషన్లలో భిక్ష మెత్తుకుంటూ పోలీసుల కంట పడటం వారు చేసిన మహాపరాధం! అభం శుభం తెలియని పాపల్ని పట్టుకుని, నిజంగానే తప్పు చేసిన వారితో బంధించడంవల్ల - స్వతహాగా మంచి వారుగా వున్న వారు కూడా సామాజిక విరోధులుగా మారడానికి దోహదం చేస్తాయి ఈ వసతి

గృహాలు! ఇక బాల నేరస్థుల్ని సక్రమమైన పౌరులుగా ఎలా తీర్చిదిద్దడం? వారిని మంచి మార్గంలోకి మళ్ళించడం ఎలా? - అన్న సమస్యలను సమగ్రంగా ఆలోచించి పరిష్కారాలను ఆచరణలో సాధించి చూపడం ఈ 'అంతర్జాతీయ బాలల సంవత్సర' ఆశయాలలో ముఖ్యమైన అంశం కావాలి. అప్పుడే ఆ పేరుకో అర్థం అంటూ వుంటుంది!

కె. సుభాషిణి — మద్రాసు



'ఓ స్త్రీ! మోసపోకు!' (13 వ పేజీ) వ్యాసం రాసిన కుమారి తెన్నేటి రామలక్ష్మి (యమ్. యస్‌సి) పది సంవత్సరాలుగా విశాఖపట్నం మిసెస్ ఎ.వి.యన్ కళాశాలలో బోటనీ శాఖలో అధ్యాపకురాలిగా వుంటున్నారు. కథలు రాయడంలో కంటే, వ్యాసాలు రాయడంలోనే తనకు ఉత్సాహమనీ, తన మొదటి రచన 'వినియోగదారులుగా వనితల బాధ్యతలు' 'వనిత'లోనే వచ్చిందనీ, ఆ సమయంలోనే 'మహిళ'లో కూడా ఒక వ్యాసం వచ్చిందనీ ఆమె తెలియజేస్తున్నారు. 'కాలం మారుతోంది. దానితోపాటు మనం మారుతున్నాం; మారాలి. అది సహజమైనా, కొన్ని మౌలికలు మాత్రం మారవు' అన్నది తన అభిప్రాయంగా చెప్పారామె.

ఒరిస్సా రాష్ట్రంలోని గ్రామీణ స్త్రీల జీవితం ఎలా వుంటుంది? వారి పని పాటలు ఏమిటి? ఆచార వ్యవహారాలు ఏమిటి?—అన్న విషయాలను ప్రస్తావించే—

''ఒరిస్సా గ్రామీణ జీవితం—స్త్రీలు''

అన్న సశేష వ్యాసం వచ్చే సంచికలో ఆరంభించబడుతున్నది. ప్రసిద్ధ రచయిత్రి పెదపూడి రాజ్యలక్ష్మీదేవి ప్రత్యేకంగా 'వనిత' కోసం విషయ సేకరణ చేసి, వ్యాస పరంపరను అందజేస్తున్నారు.

వచ్చే సంచికలో



ఈ సంచికలోని 'అన్యోన్య దాంపత్యం' (70వ పేజీ) కథ రాసిన శ్రీమతి జ్యోతీ నాథ్ - భర్త (ఇంజనీరు) ఉద్యోగరీత్యా బెంగళూరులో వుంటున్నారు. సొంత వూరు హైద్రాబాదు. అక్కడే బి.ఎ వరకు చదువుకున్నారు. "చదవడం, రాయడం అంటే ఉత్సాహం ఎక్కువ. నిత్య జీవితంలో ఎదురయ్యే సమస్యల్ని ఆధారంగా చేసుకుని కథలు రాయాలని ప్రయత్నిస్తూ వుంటాను" అంటున్నారామె.

సూపర్ బజార్లకు సూచనలు

సూపర్ బజార్లలో అధికభాగం చాలా నష్టంతో నడుస్తున్నాయనీ, కనుక కారణాలు కనుక్కునేందుకై ఓ 'కమిటీ'ని నియమించనున్నామనీ మన ముఖ్యమంత్రిగారు ఇటీవల ప్రకటించడం అందరికీ తెలిసినదే!

ఈ విషయమై ఏర్పడబోయే కమిటీ ఏ కారణాలను విచారిస్తుందో, ఎన్నాళ్ళు విచారణ జరుపుతుందో నాకు తెలీదు గానీ, ఈ వార్త చదివిన తర్వాత, ఆలోచిస్తే ఓ సామాన్య వనితగా నాలో మెదిలిన సూచనలు కొన్ని :

1. ప్రభుత్వ ఉద్యోగులు, బ్యాంకు ఉద్యోగులు, తదితర స్థానిక పబ్లిక్, ప్రయివేట్ సంస్థలలోని ఉద్యోగులకు 'పాస్ బుక్స్' వంటి 'క్రెడిట్ బుక్స్'ను సప్లయి చేసి, వాయిదాల పద్ధతిపై అరువు సౌకర్యంతో నిత్యావసర వస్తువులు, తదితర వస్తువులు సప్లయి చేయాలి. ఉద్యోగ అధికారులనుండి 'గ్యారంటీ' కూడా తీసుకొనడం జరుగుతుంది. కాబట్టి, నిర్ణీత వాయిదాలలో చెల్లించని యెడల జీతం నుండి రాబట్టుకోవచ్చు. లేదా నామమాత్రపు వడ్డీతో మరికొన్ని అదనపు వాయిదాలను వ్యవధిగా ఈయవచ్చు.

సూపర్ బజార్‌లలో ధరలు స్థిరమైనవనీ, సరసమైనవనీ, వస్తువులు నాణ్యమైనవనీ, కొలతలలో మోసం వుండదనీ తెలిసినా వినియోగదారుడు సూపర్ బజార్లలో కొనక ఓ పావలా ఎక్కువైనా బయటి కొట్టులోనే కొనేందుకు కారణం : డబ్బు వుంటే సూపర్ బజార్‌లలో వస్తువు ఇస్తారు గానీ నెలాఖరులోనూ, డబ్బు కొరత సమయంలోనూ అరువు పెట్టరుగా – అందుకేమరి! (కొన్ని సూపర్ బజార్లు తమ ఉద్యోగులకు సైతం అరువు పెట్టవట! మరీ శోచనీయం!)

2. నిరుద్యోగులైన యువతీ యువకుల ద్వారా గానీ, సమర్ధవంతమైన సిబ్బంది ద్వారా గానీ (కమీషన్ పద్ధతిపై గానీ లేక జీతం పద్ధతిపై గానీ) నిర్ణీత సమయాలలో సరుకులు ఇంటింటికి సప్లయి చేసే (హోమ్‌డెలివరీ) పద్ధతి వల్ల అమ్మకాలు మరింత పెరగగలవని నా గట్టి నమ్మకం.

3. ఇతర వ్యాపారస్థులవలె సులభ వాయిదాలపైననూ, ఆకర్షణీయమైన స్కీముల ద్వారాను వివిధ రకాల గృహోపకరణాలు అందజేయడం అమ్మకాభివృద్ధికి మరింత దోహదం కాగలదు!

4. అన్నిటికంటె ముఖ్యమైనది కౌంటర్ల దగ్గర ఉండే వ్యక్తులు సరళమైన ధోరణిలో కస్టమర్లను ఆకర్షించుకొనేలా మాట్లాడుతూ అమ్మకాన్ని అభివృద్ధి చేసేందుకై ప్రయత్నించాలి. సూపర్ బజారులలో సేల్స్‌మెన్, ఉమెన్ – కస్టమర్లను గౌరవించరనీ, చాలా దురుసుగా 'తన వ్యాపారం కాదు కదా' అన్న ధోరణిలో ప్రవర్తిస్తారనీ తరచుగా వచ్చే కంప్లయింట్. ఇది రాకుండా ఉండాలంటే మేనేజ్‌మెంట్ సేల్స్ ప్రమోషన్‌లో తగిన శిక్షణ, ఇవ్వాలి. తగు సమయంలో 'సూపర్‌వైజర్స్', తనిఖీలు చేస్తుండాలి.

నండూరి వసంత — విజయవాడ

ఫిబ్రవరి 'వనిత'లో ఇరాన్ మహారాణి పారాపహ్లెవి పరిచయం మాకెంతో ఆనందాన్ని కలిగించింది!

మూఢ నమ్మకాలతో మొండిగా ప్రవర్తించేవారికి విస్సారమాదేవిగారి 'నమ్మకం' కథానిక కనువిప్పును కలుగజేసేదిగా వుంది.

—శ్రీమతి నజీర్‌హుసేన్, కావలి

గత వనితలో ప్రచురింపబడిన వ్యాసం 'అసూయ'ను ఎ. వి. శేషారత్నంగారు చాలా బాగా వ్రాశారు. దయ్యాలతో రెండేళ్ళు' అన్న వ్యాసంను పుష్పా అశోక్‌కుమార్‌గారు చాలా బాగా వ్రాశారు.

—కుమారి కె. మంజుల, ఆదోని

నమ్మకం కథ, దెయ్యాలతో రెండేళ్ళు వ్యాసం చక్కగా ఉన్నాయి. మన దేవాలయాల గురించి కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తున్నారు.

—ఆర్. రజనీరెడ్డి, కోరగుంటపల్లె

జనవరి సంచికలో వేసిన 'వి నెక్' బ్లౌజ్ చదివాము. కానీ అది అల్లే పద్ధతి కొంతమందికి తెలియదుగదా, కాబట్టి మంగళా కందూర్‌గారికి ఈ విషయం తెలిపి




ఉల్లు అల్లే పద్ధతి వివరంగా తెలుపగోరుతున్నాము. అందులో ముఖ్యంగా రింగులు తగ్గించే పద్ధతి హెచ్చించే పద్ధతి వివరంగా తెలియజేయమని చెప్పవలసినది.

—సి హెచ్ ప్రభావతి, సుధ, నెల్లూరు

గత నెల 'వనిత'లో మీరు ప్రచురించిన 'అసూయ' వ్యాసం చాలా చక్కగా, స్త్రీలను ఆకర్షించేలా వుంది. రచయిత్రి కుమారి శేషారత్నంగారు, వివిధ రంగాల లోని అసూయ అనే నిజాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించారు.

'నిజం చెప్పనా' భార్గవిగారి కవిత, ప్రేమంటే ఏమిటీ అనే మీమాంసంలో వున్నవారికి అర్థం అయేలావుంది.

—కె. సరోజ, సికింద్రాబాద్

మొత్తానికి గత సంచిక మాకెంతో నచ్చింది.

—యమ్. విజయ, కె. జి. సరళకుమారి, బెల్లంపల్లి

గత సంచికలో ఐడాసు గూర్చిన పరిచయం చదువుతుంటే మేను పులకరించింది. ఒక్కొక్కసారి ఎదురయ్యే సంఘటనలు తమాషాగా జీవిత-గతినే మార్చివేస్తాయి. ఆ మార్పు పదిమందికి ప్రయోజనాన్ని కూరిస్తే వాళ్ళు పూజనీయులే అవుతారు.

పుష్పా అశోక్‌కుమార్‌గారి 'దెయ్యాలతో రెండేళ్ళు అన్న వ్యాసం ఆసక్తికరంగానూ, చర్చనీయాంశముగానూ ఉన్నది.

—భవాని, బాపట్ల

'అసూయ' వ్యాసం బాగుంది. అసూయ ముందు పుట్టి ఆడది తరువాత పుట్టింది అంటారు. అసూయ ఆడదాని సొత్తులా వుంది. రాసిన ఎ. వి. శేషారత్నంగారి గొంతు విశాఖపట్టణం కేంద్రంనుండి వింటూనే వుంటాము. ఆమె వనిత ద్వారా పరిచయమైనందుకు, చాలా సంతోషించాము.

—యమ్. అనూరాధ, రాజమండ్రి

## వనిత మాటల కొలువు - 43

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 గ్రా | ధు | 15 త్రి | | | 2 బ్రి | 16 యా | రి |
| లి | | 3 పు | 17 త్త | డి | | మా | |
| | 4 స్రు | ట | న | | 5 మా | వి | 18 డి |
| 6 ఓ | డ | | 7 క్ష | 19 మ | | | ర |
| | త | | 8 త్ర | పా | | 9 ర | గా |
| 20 పి | | 10 లి | మా | | 11 కొ | మ్మ | |
| ద | | 12 ము | ల | ర్జా | మా | | 21 భా |
| 13 ప | న | స | | | 14 రి | ధు | మ |

పై సమాధానంతో సరిపోయే సమాధానాలు పంపిన వారు ఏభైమంది. వారు :

1. డి. లక్ష్మీనారాయణమ్మ, బోడసుకుర్రు 2. ఆర్. సీత, బొంబాయి 3. ఆర్. లక్ష్మీప్రభ, అనంతపూర్ 4. కె. క్రిష్ణవేణి, గుంటూరు 5. ఉమాదేవి, కావలి 6. పి. ఉషారాణి, నెల్లూరు 7. బి. రమాదేవి, హన్మకొండ 8. ఎస్. రమాదేవి, వరంగల్ 9. కె. సరస్వతి సికింద్రాబాద్ 10. ఎ. అన్నపూర్ణ, వేములవాడ 11. వి. నిర్మల, ఇబ్రహింపట్నం 12. బి. విజయలక్ష్మి, మచిలీపట్నం 13. ఎస్. రజనీదేవి, వరంగల్ 14. వి. జగదాంబ, నర్సీపట్నం 15. వి. నళినీ జగదీష్, గుంటూరు 16. కె. వసంతవల్లి, కనిగిరి 17. వి. కమలమ్మ, బాగలమ్రి 18. కె. స్వప్న, మద్దికెర 19. ఎం. సీతారామమ్మ, సూళ్లూరుపేట 20. జి. కమల, నెల్లూరు 21. ఎస్. కామేశ్వరి, దుర్గాపూర్ 22. ఎం. వెంకటమణి, సాల్కాల క్వార్టర్స్ 23. ఎం. అనసూయ, నందిగామ 24. ఎ. సీతామహాలక్ష్మి, హిల్‌కాలనీ 25. ఎం. హైమవతి, గుంటూరు 26. టి. సుహాసినీ రావు, హైద్రాబాదు 27. ఎస్. శేషమ్మ, మొక్కల తివ్వ 28. ఎల్. సూర్యకుమారి, తణుకు 29. డి. విశ్వమోహినీదేవి, సికింద్రాబాద్ 30. జె. బాలా త్రిపురసుంధరి, కూచిపూడి 31. జె. వి. రామలక్ష్మి, తణుకు 32. ఇ. రాజరాజేశ్వరి, సూళ్లూరుపేట 33. ఎం. మంగళ, గద్వాల్ 34. పి. ఇందిర, విజయపురి నార్త్ 35. వి. లక్ష్మీనరసమ్మ, హైద్రాబాదు 36. బి. సీతామహాలక్ష్మి, విశాఖపట్నం 37. పి. రాధమ్మ, నెల్లూరు 38. కె. గీతాకుమారి, విశాఖపట్నం 39. ఎం. ప్రమీల, వరంగల్ 40. ఎస్. రాజేశ్వరి, నెల్లూరు 41. ఎస్. జయంతి, అనంతపురం 42. కె. గిరిజ, మినగల్లు 43. కె. కమల, తణుకు 44. ఇ. లక్ష్మీ కాంతమ్మ, సూళ్ళూరుపేట 45. టి. హేమ నళిని, హన్మకొండ 46. వి. గంగాభవాని, కరీంనగర్ 47. విజయలక్ష్మి, కరీంనగర్ 48. ఎస్. విజయలక్ష్మి, మదమనూరు 49. కె. శ్యామలాకుమారి, సామర్లకోట 50. వి. కె. వసంత, వరంగల్.

బహుమతి మొత్తం రూ. 150లను వారికి అందజేస్తున్నాము.

## లోపల

# ప్రపంచం

'ప్రపంచం' మారుతోంది. జరిగిన చరిత్రని ఒకసారి గుర్తుచేసుకుంటే జరుగుతున్న చరిత్రని సులభంగా అర్థంచేసుకోవచ్చు. జనవరి 14 నుంచి ఫిబ్రవరి 6 వరకూ ప్రపంచం ఎలా వుందో చూస్తే దేశదేశాలలో వస్తున్న మార్పులు, అర్థమవుతాయి.

**జనవరి 14 :** 'సిరియా', 'ఇరాక్' ఒక దేశంగా విలీనమవడానికి నిర్ణయించుకుంటున్నాయనే వార్త వెలువడింది. అతి ప్రాచీనమయిన దేశాలలో ఒకటయిన 'ఇరాక్'ని ఒకప్పుడు 'మెసపటోమియా' అని పిల్చేవారు. మధ్య ప్రాచ్యంలో వున్న ఈ రెండు దేశాల మధ్య ఒక రోజున పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేది!

**జనవరి 14 :** బ్రిటన్‌లో మరో టెస్ట్‌ట్యూబ్ బేబీ జన్మించింది. మొట్టమొదటి టెస్ట్‌ట్యూబ్‌బేబీ 'జన్మించడానికి' అనుసరించిన పద్ధతులే ఇక్కడా అనుసరించారు. 'గ్లాస్'లో జన్మించిన ఈ మగ శిశువు తల్లి 32 సంవత్సరాల గ్రేస్ మాంటగమరీ. పాఠశాలలో పాకకళని గ్రేస్ బోధిస్తూ వుంటారు.

**జనవరి 15 :** అణుశక్తికి సంబంధించిన పరిశోధనలు సంయుక్తంగా జరపాలని ఫ్రాన్సు, చైనాలు ఒక ఒడంబడిక చేసుకున్నాయి.

**జనవరి 15 :** ప్రజల ఆందోళన వెల్లువలాగా ప్రవహించడంతో ఇరాన్ 'షా' స్వదేశాన్ని విడిచిపెట్టి ఈజిప్ట్ చేరుకున్నాడు. ఈజిప్ట్ అధ్యక్షుడు అన్వర్ సాదత్ ఇరాన్ 'షా'కి స్వాగతం చెప్పాడు.

**జనవరి 16 :** కంబోడియాపై వియత్నాం దాడిని నిరసిస్తూ అలీన దేశాలు ప్రతిపాదించిన తీర్మానాన్ని రష్యా వీటో చేసింది. భద్రతా సంఘంలో ఈ తీర్మానంపై జరిగిన ఓటింగ్‌లో 13 దేశాలు తీర్మానానికి అనుకూలంగా ఓటుచేయగా, రష్యాతో సహా చెకోస్లవేకియా వ్యతిరేకంగా ఓటు చేసింది.

**జనవరి 17 :** ఉత్తర ధృవ ప్రాంతంలో జపాన్‌కి చెందిన అంటార్కిటిక్ పరిశోధనా బృందం కృత్రిమంగా భూకంపం పుట్టించింది.

**జనవరి 18 :** తూర్పు ఆఫ్రికాలోని ఉగండాలో నేరాలు విపరీతంగా పెరిగిపోయి, నేరస్థులు స్వేచ్ఛగా విహరించడంతో దేశంలో శాంతిభద్రతలు కాపాడడానికి కర్ఫ్యూ విధించారు.

**జనవరి 19 :** అంతర్జాతీయ అవగాహనను పెంపొందించిన వారికి ఇచ్చే జవహర్‌లాల్ నెహ్రూ అవార్డ్‌ని రాష్ట్రపతి సంజీవరెడ్డి జపాన్ మతాచార్యుడు నిషిడాట్సు ఫ్యుజికి బహుకరించారు. ఈ అవార్డుని పదమూడు సంవత్సరాల క్రితం ప్రారంభించారు. తొంభయినాలుగు సంవత్సరాల ఫ్యుజి ప్రశంసా పత్రంతోపాటు లక్షరూపాయల నగదు బహుమతినీ అందుకున్నారు.

**జనవరి 20 :** ఇరాన్ అంతరంగిక వ్యవహారాలలో అమెరికా పరోక్షంగా జోక్యం చేసుకుంటోందని పారిస్‌లో ప్రవాసంలో వున్న ఇరాన్ మత నాయకుడు అయతుల్లా ఖొమైనీ ఆరోపించాడు.

**జనవరి 20 :** చైనాకి బ్రిటన్ ఆయుధాలు విక్రయించడం వలన బ్రిటన్‌కి సోవియట్ రష్యాకి మధ్య వున్న సంబంధాలు చెడిపోతాయని రష్యా అధ్యక్షుడు బ్రెజ్నేవ్ బ్రిటిష్ ప్రధానిని హెచ్చరించాడు. అయితే సోవియట్ రష్యా అభిప్రాయాన్ని బ్రిటిష్ ప్రధాని తిరస్కరించాడు.

**జనవరి 21 :** మానవ హక్కులని పరిరక్షించాలని చైనాలో కొన్ని వర్గాలవారు ఆందోళన జరిపారు. అలా ఆందోళన జరిపిన కొందరు కర్షకులకి నలభై సంవత్సరాల వనిత ఓయావిన్ నాయకత్వం వహించింది.

**జనవరి 21 :** 1952 నుంచి 1971 వరకూ భారతీయ భాషలలో వెలువడిన గ్రంథాలలో ఉత్తమమయినదిగా 'కిత్ని నావోమే కిత్నీబార్' గ్రంథాన్ని నిర్ణయిస్తూ ఆ హిందీ గ్రంథ రచయిత 'వాత్సాయన్'కి 1978 సంవత్సరపు భారతీయ జ్ఞానపీఠ్ అవార్డ్‌ని నిర్ణయించారు. ఈ బహుమతిని పధ్నాలుగు సంవత్సరాలుగా ఇస్తున్నారు.

**జనవరి 22 :** బ్రిటన్‌లో రైల్వే కార్మికుల సమ్మెవల్ల పౌర జీవితంలో స్తంభన ఏర్పడింది. మంచుని చీల్చుకుంటూ ప్రయాణం చేయవలసిన పరిస్థితిలో ప్రజలు ఎంతో అవసరమైన పనులు కూడా చేసుకోలేకపోయారు.

**జనవరి 23 :** లెబనాన్, ఇస్రాయిల్‌ల సరిహద్దులో కాల్పుల విరమణ జరిగింది.

**జనవరి 25 :** బంగ్లాదేశ్‌లో జరిగిన ఒక రైలు ప్రమాదంలో నూరుమంది మరణించారు. మూడువందల మంది గాయపడ్డారు.

**జనవరి 26 :** ఇరవై అరు సంవత్సరాలుగా బద్ధ శత్రువులుగా వున్న ఉత్తర కొరియా, దక్షిణ కొరియాలు విలీనానికి చర్చలు జరిపే ఆశ కనిపించింది.

**జనవరి 27 :** అధికారంలో వున్న క్రిష్టియన్ డెమోక్రాటిక్ పార్టీ ప్రభుత్వానికి కమ్యూనిస్టు పార్టీ మద్దతు ఉపసంహరించుకోవడంతో ఇటలీలో రాజకీయ సంక్షోభం ఏర్పడింది.

**జనవరి 29 :** చైనా ఉప ప్రధాని టెంగ్ సియావోపింగ్, అమెరికా అధ్యక్షుడు జిమ్మి కార్టర్‌ల మధ్య వాషింగ్‌టన్‌లో చర్చలు ప్రారంభమయ్యాయి. రష్యాకి వ్యతిరేకంగా అమెరికా చైనాలు ఒకటవాలని చైనా ఉప ప్రధాని అమెరికా అధ్యక్షుణ్ణి కోరారు.

**ఫిబ్రవరి 1 :** పదిహేను సంవత్సరాల ప్రవాసం తర్వాత స్వదేశం తిరిగివచ్చిన అయతుల్లా ఖొమైనీకి ఇరాన్‌లో ఘనస్వాగతం లభించింది.

**ఫిబ్రవరి 3 :** భారతప్రధాని శ్రీ మొరార్జీదేశాయ్ నాలుగు రోజుల శ్రీలంక పర్యటన ప్రారంభించారు. కొలంబో విమానాశ్రయంలో శ్రీ దేశాయ్‌కి శ్రీ లంక అధ్యక్షుడు జయవర్ధనే, ప్రధాని ప్రేమదాస స్వాగతం చెప్పారు.

**ఫిబ్రవరి 3 :** బ్రిటన్‌లో స్థిరపడిన తమ కాబోయే వరులను కలసుకోడానికి ఆసియాదేశాల నుంచి వస్తున్న వనితలపై బ్రిటిష్ వలసశాఖ అధికారులు జరుపుతున్న కన్యాత్వ పరీక్షలను రద్దు చేయాలని బ్రిటిష్ ప్రభుత్వం ఉత్తర్వుచేసింది.

**ఫిబ్రవరి 6 :** పాకిస్తాన్ మాజీ ప్రధాని భుట్టోకి గత మార్చిలో లాహోర్ హైకోర్టు విధించిన ఉరిశిక్షని సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి అన్వర్ ఉల్‌హక్ ఖాయం చేశారు. భుట్టో చేసుకున్న అప్పీలు 4–3 తేడాతో వీగిపోయింది. వారం రోజుల లోపల ఆయన గానీ, ఆయన కుటుంబ సభ్యులు గానీ క్షమాభిక్ష అర్థించకపోతే శిక్ష అమలు పరచబడుతుందని జనరల్ జియా-ఉల్-హక్ తెలియజేశాడు.

# అట్టమీది అమ్మాయి



అట్టమీద అందంగా, ఆకర్షణీయంగా చక్కగా, నాజూగ్గా వున్న ఒక అమ్మాయి కనిపిస్తోంది. ఆ అమ్మాయిని చూడగానే ఎవరికైనా ఏమని పిస్తుంది? కిలకిలా నవ్వుతూ, కమ్మగా తియ్యగా ఎన్నో కబుర్లు చెప్పేలా వుంది - అనిపిస్తుంది కదూ! కాని....

ఆ అదృష్టం ఆమ్మాయికి లేదు - ఆమె మాట్లాడలేదు; ఒకరు చెప్పింది విననూలేదు! 'ఇంత నాజూకైన అమ్మాయికి విధి అలాంటి శిక్ష విధించడం న్యాయమా?' అని ఎవరైనా అనుకుంటారు, బాధపడతారు. అయితే ఆ విషాద రేఖల చిరునవ్వు వెనక - ఒక శక్తి వుంది; ఒక సాధనవుంది. తనకు వాటిల్లిన దురవస్థకి, ఏర్పడిన అంగవైకల్యానికి ఆమె దిగులు పడలేదు. నిత్యమూ చింతలతో కాలం గడపలేదు. తనను వెక్కిరించిన విధిని ఎదిరించింది. తన అంగవైకల్యం మాటే మరచిపోయి అందరిలాగే తనూ తన జీవితాన్నిగడుపుతున్నది. చదువుకుంటోంది; టేబిల్ టెన్నిస్ ఆడుతుంది; 'స్విమ్' చేస్తుంది. మంచి మంచి 'చేతి పనులు' చేస్తుంది! తనది మూగ ప్రపంచమే కావచ్చు-కాని, అందులో 'మూగ బాధ' మాత్రం లేదు!

పద్దెనిమిదేళ్ళ ఆ అమ్మాయి పేరు అముద. మద్రాసులో వుంటోంది. తండ్రి శ్రీనివాసన్; తల్లి కమల.

అముద జీవితం అంగవైకల్యంతో దిగులు పడేవారికి 'గొప్ప పాఠం' నేర్పగల జీవితం; గొప్ప ధైర్యం చెప్పగల జీవితం. ఎలా? ఆ విషయమై అముద తల్లిగారు ఇలా చెప్పారు:

"ఇద్దరు అబ్బాయిల తర్వాత మాకు అముద పుట్టింది. అబ్బాయి తర్వాత, అందమైన అమ్మాయి పుట్టిందని మేము నిజంగా ఎంతో సంతోషించాము. అయితే, అముదకి ఏడాది వచ్చేవరకూ ఆమెలో ఏదో 'వెలితి' వున్న సంగతి మాకు తెలియలేదు!

అప్పట్లో మేము మద్రాసులోనే వుండేవాళ్ళం. తర్వాత మా వారికి కోయంబత్తూరు బదిలీ అయితే అక్కడికి వెళ్ళాం. ఏణ్ణార్థం దాటిపోయేవరకూ మాకు ఏ అనుమానమూ రాలేదు. పాపాయి కాబట్టి, ఏదో ధ్యాసలో వుంటోందేమో అనుకున్నాం. మరీ అనుమానం ఎక్కువైన తర్వాత అక్కడవున్న ఒక స్పెషలిస్ట్‌కు చూపిస్తే 'ఆమె పుట్టుకతోనే చెవుడు' అన్నారు; అందువల్ల ఏమీ చెయ్యలేం అని కూడా చెప్పారు. మా బాధ ఏమని చెప్పమంటారు? అప్పట్నుంచి మా జీవితాలు విషాదకరమైపోయాయి!

అముదకి మూడున్నర ఏళ్ళు రాగానే నర్సరీ క్లాస్‌లో వేశాము. మామూలు పిల్లలతోపాటు ఆమె కూడా అక్కడ బాగానే వుండేది. కాని ఏమీ నేర్చుకోలేకపోయేది. అలాంటి వాళ్ళకి నేర్పడం సామాన్యమైన విషయం కాదు. మరి కాస్త వయసు రాగానే అముద, ఆ యింటికీ ఈ యింటికీ తిరిగేది. మేము ఎంత జాగ్రత్తగా కనిపెట్టుకుని వున్నా, ఎలాగో వెళ్ళిపోయేది. ఆ క్షణాల్లో మేము ఎంత కంగారు పడిపోయేవాళ్ళమో! ఆమెకి వినిపించదు; ఏదీ చెప్పలేదు. బాత్‌రూమ్‌లోకి వెళ్ళి గడియ వేసుకుంటే, మళ్ళీ అది రాకపోతే, తను ఎవర్నీ పిలవలేదు; మనం చెప్పినది వినలేదు! అబ్బ! ఆరోజులు తలచుకుంటూంటే, ఎంత బాధకరంగా వుండేవో! ఎప్పుడూ నేను నా ప్రారబ్ధానికి ఏడుస్తూనే ఉండేదాన్ని!

ఎలాగైనా ఆమెకి మాట, వినికిడి రావాలన్న కోరికతో ఎవరేం చెబితే చేసేవాళ్ళం! మేము చూడని డాక్టర్లు లేరు; కొలవని దేవుళ్ళు లేరు!

వర్ణచిత్రం : సత్యకుమార్

చివరిసారిగా అముదను నెల్లూరు సి. ఎమ్. సి. ఆసుపత్రికి తీసుకెళ్ళాం. ఆమెను చాలాసేపు పరీక్షించిన డాక్టర్ కపూర్, వైద్య సలహా ఏమీ ఇవ్వకపోయినా, నాకు ధైర్యం చెప్పి - కర్తవ్యం బోధపరిచారు. "చూడమ్మా! భగవంతుడు ఇవ్వని దాన్ని గురించి తలచుకుని బాధపడడంవల్ల ఏమీ లాభంలేదు. భగవంతుడు ఇచ్చిన తక్కిన వాటిని ఉపయోగించుకుని, జీవితం సార్థకం చేసుకోవాలి!" ఆయన మాటలు వేదవాక్కులయినాయి నాకు.

మద్రాసులోని 'స్కూల్ ఫర్ ది డెఫ్'లో చేర్పించాలని నిశ్చయించుకుని, మద్రాసు తీసుకొచ్చాము. అయితే అముద ఏడవడం ఆరంభించింది. తనకేదో బాధ - తనను అక్కడ వదిలేస్తున్నామనో, లేక వద్దనుకుంటున్నామనో. ఎన్నోసార్లు నేను కోయంబత్తూరునుంచి తీసుకురావడం. ఆమె ఏడుపు చూసి తిరిగి వెనక్కి తీసుకెళ్ళిపోవడం జరిగింది. అయితే, మద్రాసులోనే ఉద్యోగంలో వున్న మా అక్క కొడుకు నా బాధంతా చూశాడు. "నాకు పిల్లలు లేరు. అందేత అముదను జాగ్రత్తగా చూసుకోడానికి నాకు అవకాశం వుంటుంది. నేను చూసుకుంటాను. నువ్వు అముదను విడిచిపెట్టివెళ్ళు" అన్నాడు. లిటిల్ ఫ్లవర్ కాన్వెంట్‌లో చేర్పించాము. మొదట్లో అముదను దార్లో పెట్టడం స్కూలువాళ్ళకీ మాకూ కష్టమైపోయినా, తర్వాత తర్వాత సర్దుకుంది. అప్పుడు అముదకు ఆరేళ్ళు.

అలా అలా అముదకు ఉత్సాహం కలిగింది. నెమ్మదిగా పెదవులతో చదవడం నేర్చుకుంది. పదేళ్ళపాటు అముద అక్కడ వాళ్ళతో కలిసి వుంటూ, శ్రద్ధగా చదువుకుంది. అంతేకాదు - క్లాస్‌లో 'ఫస్ట్' వచ్చేది. తక్కిన ఆటపాటల్లో కూడా ఉత్సాహం చూపేది!

సంవత్సరంలో రెండుసార్లు స్కూలుకు సెలవులు వచ్చేవి. సెలవు రోజుల్లో నా దగ్గరకి తీసుకొచ్చేదాన్ని. ఒక్క నిమిషం కూడా ఆమెను వూరికే కూచోనివ్వకుండా, ఏదో ఒకటి చేయిస్తూ వుండేదాన్ని. అలా సెలవుల్లో కూడా ఆమె క్లాసులకి వెళ్తూ కుట్టుపని, అల్లికలు, బొమ్మలు చెయ్యడం - అన్నీ నేర్చుకుంది!

మా వారు రిటైర్ కావడంతో మేము మద్రాసులో స్థిరపడ్డాము. మా అబ్బాయిలిద్దరూ పెద్ద చదువులు చదువుకున్నారు; మంచి ఉద్యోగాల్లో వున్నారు. నాకు తక్కిన 'బాదరబందీలు,

బాధ్యతలూ తగ్గాయి. కాబట్టి అముదను బాగా చూసుకోగలుగుతున్నాను. ఆమె స్కూలుకు దగ్గర్లోనే ఇల్లు తీసుకున్నాము. స్కూలునుంచి రాగానే ఎన్నో నేర్పిస్తున్నాము. యోగ, బాతిక్, స్విమ్మింగ్, టైప్‌రైటింగ్, టేబిల్ టెన్నిస్, పుష్పాలంకరణ - ఇలాంటి వెన్నో అముద నేర్చుకున్నది. కొన్నింటిలో 'ప్రావీణ్యత' కూడా చూపిస్తున్నది.

ఇవాళ—మా అముద పద్దెనిమిదేళ్ళ అందమైన యువతి! యస్. యస్. యల్. సి పరీక్ష రాయబోతోంది. పెయింటింగ్స్‌లో బహుమతులు కూడా సంపాయించింది. హైద్రాబాదులో జరిగిన 'ఆల్ ఇండియా డెఫ్ గర్ల్స్ టోర్నమెంట్'లో పాల్గొని, 'మెడల్' సంపాయించింది! త్వరలోనే బెంగళూర్లో కూడా పాల్గొనబోతోంది. అంతేకాదు - టి. వి. కార్యక్రమాల్లో పాల్గొంది; తను చేసిన చేతి వస్తువులు అనేక ప్రదర్శనల్లో ప్రదర్శింప జేసింది; మహిళా సంఘాల్లో పుష్పాలంకరణ ప్రదర్శనలు కూడా ఇచ్చింది.

అముదవన్నీ మంచి అలవాట్లు. తన అలవాట్లను కచ్చితంగా పాటిస్తుంది. వేకువనే లేవడం, యోగాభ్యాసం చెయ్యడం, చదువు, ఆటలు, తక్కిన అభ్యాసాలూ అన్నీ కచ్చితంగా, వేళ ప్రకారం చేసుకుంటూపోతుంది.

తనకేదో 'అంగవైకల్యం' వున్న లోపం ఇప్పుడు అముదలోనూ లేదు; మాలోనూ లేదు. చెప్పుకోడానికి, ఆ 'లోపం' తప్పితే - అముద తక్కిన అన్ని విషయాల్లోనూ మామూలు పిల్లల కంటె కూడా ఎంతో మెరుగ్గా వుందని చెప్పడానికి నేను గర్విస్తూ వుంటాను.

తనకు మంచి 'పేరు' రావాలని అముద అభిలాష. ఆమెకు ఎందరో స్నేహితులు. అందరితోనూ ఎంతో కలివిడిగా, చక్కగా మెలుగుతుంది.

అముదకు ఎంతో మంచి భవిష్యత్తు వుందని నేను విశ్వసిస్తూ వుంటాను. ఆమె విషయంలో ఎంతో ధైర్యం వచ్చింది. ఎందరో ఆమెను తీర్చారు; దిద్దారు. నాకొక్కటే అనిపిస్తుంది— ఈ ప్రపంచంలో అసాధ్యమైనదంటూ ఏదీలేదు"

ఇది కథ కాదు - జీవితం! మామూలు జీవితం కాదు - ధైర్యంతో విధిని ఎదుర్కొన్న జీవితం! అంగవైకల్యంగల పిల్లలు గల తల్లులకేకాదు—ఏతల్లికైనా ఇది గొప్ప పాఠమే! □

"వంట అనేది బ్రహ్మ విద్య కాదు. ఉత్సాహమూ, అభిరుచి వుండి వాటికి కొంత శ్రద్ధ, అభ్యాసం తోడైతే ఎవరైనా ఈ కళలో ఆరితేరవచ్చును." అంటారు కర్ణాటక ప్రాంతానికి చెందిన గృహిణి శ్రీమతి జ్యోతి. 'వనిత' పాఠకుల కోసం ఆమె ఘుమఘుమలాడే 'బిసి బేళె హుళియన్న' కన్నులకింపైన మైసూర్‌పాక్ తయారు చేసే విధానాన్ని తెలియజేస్తున్నారు. ఈ రెండూ కూడా 'మా అమ్మమ్మ'ల కాలం నుంచి చేస్తున్నవే కదావీటిలో 'ఏం కొత్తదనం వుంది' అని ఎవరికైనా అనిపించవచ్చును. "కాని 'బిసి బేళెహుళియన్న'లో పోషకాహార పదార్థాలు చాలా వున్నాయి. 'వనిత' స్త్రీల కోసం—ముఖ్యంగా నా వంటి పిల్లల తల్లుల కోసం నిర్దేశించబడిన పత్రిక అని నాకు అనిపించింది. అందుకే నేను ఈ వంటకాన్ని ఎంచుకున్నాను. అలాగే 'మైసూర్‌పాక్' సర్వజనాదరణ పొందిన తీపివంటకం. ఇవి రెండూ బాగా తెలిసినట్లే అనిపించినా ఒక్కోసారి మనం చేసుకుంటే బాగా రావు. ఒక. పద్ధతి ప్రకారం వీటిని చేసుకుంటేనే బాగా కుదురుతాయి; చక్కగా వస్తాయి." అంటాడు జ్యోతి.



మైసూర్‌పాక్ :

కావలసిన పదార్థాలు : 150 గ్రా॥ శెనగపిండి, 300 గ్రా॥ మంచి నెయ్యి, 300 గ్రా॥ పంచదార, 4 ఏలక్కాయలు, కాస్త పచ్చకర్పూరం.

తయారుచేసే విధానం : ముందుగా శెనగపిండిని జల్లించి వుంచుకోవాలి. తర్వాత ఒక పాత్రలోకి తీసుకుని ఒక స్పూను నెతితో వేయించాలి. తరువాత వెడల్పాటి మూతి గల ఒక పెద్ద గిన్నెలో పంచదార వేసి తగినంత నీరు పోసి స్టవ్ మీద పెట్టి ఉడికించాలి. పంచదార కరిగి పాకం అవుతున్నప్పుడు అందులో శెనగపిండి కలిపి, సగం నెయ్యి వేసి సన్నటి సెగమీద పెట్టి వుంచాలి. మిగిలిన సగం నెయ్యి కొంచెం కొంచెంగా గిన్నెలో పోస్తూ నెమ్మదిగా కలియబెట్టాలి. పాకం బాగా పొంగిన తరువాత అందులో పచ్చకర్పూరం వేసి కలియబెట్టి ఈ పాకాన్ని నెయ్యి రాసిన ఒక పళ్ళెంలో పొయ్యాలి. ఇది కాస్త ఆరుతూ వుండగానే ముక్కలుగా కోసుకోవాలి.

బిసి బేళె హుళి యన్న :

కావలసిన పదార్థాలు : 300 గ్రాముల కంది పప్పు, 300 గ్రా॥ బియ్యం, ఒక్కొక్కటి 100 గ్రాముల చొప్పున క్యారట్, బీన్స్, బంగాళ దుంపలు, వంకాయలు, ఒక నూల్‌కోల్ దుంప, పిడికెడు వేరుశెనగపప్పు, నిమ్మకాయంత చింత పండు, 50 గ్రా॥ బెల్లం, 100 గ్రా॥ నువ్వుల నూనె, కావలసినన్ని ఎండు మిరపకాయలు, తగినంత ఉప్పు, తాళింపుకి తగినంత శెనగపప్పు, మినపప్పు, ధనియాలు (ఇవన్నీ కూడా మామూలుగా పెట్టే తాళింపుకన్న కాస్త ఎక్కువ మోతాదులో తీసుకోవాలి). ½ టేబుల్‌స్పూను ఆవాలు.

ఇవికాక – 4 లవంగాలు, 1 ఏలక్కాయ, దాల్చినచెక్క, ½ టేబుల్ స్పూను జీలకర్ర, ½ టేబుల్ స్పూను మెంతులు, తగినంత ఇంగువ తీసుకుని వీటన్నిటినీ కలిపి నూనెలో వేయించాలి. ఆ తరువాత ఒక కొబ్బరికాయ పూర్తిగా కోరుకుని ఈ మిశ్రమాన్ని ఆ కొబ్బరి కోరుతో కలిపి బాగా పొడిచేసి దంచి విడిగా తీసి వుంచుకోవాలి.

తయారుచేసే విధానం: ఒక గిన్నెలో

# రెండు కర్ణాటక వంటకాలు

(కుక్కర్‌లో అయితే మంచిది) చిటికెడు పసుపు వేసి కందిపప్పు కలిపి బాగా ఉడికించాలి. ఆ తరువాత కూరలన్నిటినీ సన్నగా పొడుగ్గా తరుక్కుని వీటిని కూడా బాగా ఉడకబెట్టి కందిపప్పుతో కలపాలి.

బిసి బేళే తయారు చేయడం ప్రారంభించడానికి పావుగంట ముందు బియ్యం కడిగి నీళ్ళన్నీ తీసేసి సిద్ధంగా వుంచుకోవాలి. కూరలు, పప్పు బాగా వుడికిన తరువాత ఆ మిశ్రమానికి ఈ బియ్యం కలిపి వుడకబెట్టాలి. బియ్యంతోపాటే బెల్లం చింతపండు కూడా కలపాలి. ఒక్క విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. ఇవన్నీ కూడా సన్నటి సెగమీదే వుడికించాలి. లేకపోతే మాడిపోయే ప్రమాదముంది! బియ్యం కూడా కలిపిన తరువాత బిసిబేళె సగం వుడుకుతూ వుండగానే నూనె కలపాలి. అన్నం వుడకడం అయిన తరువాత ముందుగా దంచి వుంచుకున్న కొబ్బరి మసాలా పొడి, రుచికి కొంత ఉప్పు కలిపి గిన్నెలో పోసి సన్నటి సెగమీద కలియబెట్టాలి. ఇక గిన్నెని కిందకి దింపుకున్న తరువాత అందులో సెనగపప్పు, మిరపకాయలు, ఆవాలు, కరివేపాకు యివన్నీ వేసితాళింపు పెట్టాలి. ఘుమఘుమలాడే బిసిబేళె హుళియన్న నోరూరిస్తూ తయారయిందన్న మాట! □

వర్ణచిత్రం : శ్రీనివాసమూర్తి






Vision **CONTEST NO. 12**

మీకు యివ్వబడిన డిజైన్ ట్రేస్ తీసి, చుట్టూ చక్కగా కుట్టబడి, నలుచదరంగా (35 సెం.మీ. x 35 సెం.మీ) వున్న గుడ్డపై కేమెల్ క్రైలిన్ రంగులతో ఆ డిజైన్‌కు రంగులు వేయండి. మీరు వేసే రంగులు వీలయినంత లేతగా వుండాలి. అందుకు కేమెల్ క్రైలిన్ మీడియమ్‌తో రంగులను పలుచన చేసుకోవచ్చు. పోటీ చేసే ప్రతి ఒక్కరూ 3 ఎంట్రీలకన్న ఎక్కువ పంపరాదు.

**బహుమతులు : రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- ఇవే గాకుండా 10 మెరిట్ సర్టిఫికెట్‌లు**

మీరు రంగులు వేసిన ఎంట్రీలను ఈ క్రింది ఎడ్రసుకు పంపండి :

పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్,

**కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,** ఆర్ట్ మెటీరియల్ డివిజన్, జె.బి. నగర్, బొంబాయి 400 059

పేరు, ఎడ్రసు వ్రాసిన కవర్‌ను పోస్టేజితోసహా ఎంట్రీతోపాటు పంపితే పోటీ చేసే ప్రతి ఒక్కరికీ ఒక ట్రాన్స్‌ఫర్ పంపబడుతుంది.

మీ ఎంట్రీతో జతపరిచే 'ట్యాగ్'పై మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాయండి. మీ ఎంట్రీ తిరిగి పంపబడదు.

**ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేది : 30-4-1979**

---

Join Camel School of Art Correspondence Course.
Contact the above mentioned address for details.

# ఓ స్త్రీ! మోసపోకు

—— తెన్నేటి రమలక్ష్మి

స్త్రీ స్వాతంత్ర్యం అనే గాలి విస్తృతంగా వీస్తున్న రోజులివి. స్త్రీని మగవాడికి బానిసగా చిత్రించి, ప్రతి మగవాడు స్త్రీ పురోగతికి ఆటంకంగా నిలబడ్డట్టు, ప్రతి స్త్రీ చెరసాలలో బందీయై క్రుంగి పోతున్నారనేంతటి చైతన్యం పొందారు కొందరు స్త్రీలు.

ఇటువంటి పరిస్థితిని అభివృద్ధికి సూచకంగా, స్త్రీ జనోద్ధరణకు నాందిగా వ్యాఖ్యానిస్తున్న వారూ లేకపోలేదు.

ఆధునిక పరికరాల యుగం ఆవిష్కారమయిన తర్వాత, అన్ని విషయాలలోపాటు పాశ్చాత్య పద్ధతి మంచిదనే మోజు ప్రబలిపోతోంది. తత్కారణంగా భారత నారీలోకంలో కొందరు హటాత్తుగా కళ్ళు తెరచి 'అయ్యో మన మహిళల గతి ఇలా దిగజారి పోతోందా!' అని స్త్రీ జీవన విధానంపట్ల తమ సంక్షోభాన్ని వ్యక్తపరచడం జరుగుతోంది. స్త్రీ స్వాతంత్ర్యం పేరుతో ఒక ఉద్యమాన్ని లేవదీయడం జరుగుతోంది.

పందొమ్మిది వందల అరవైమూడు ప్రాంతాలలో బెట్టీఫ్రీడాన్ అనే గృహిణి కాకతాళీయంగా వ్రాసిన 'ఫెమినైన్ మిస్టిక్' అనే పుస్తకం అమెరికాలో ఒక విచిత్రమయిన చైతన్యాన్ని కల్గించింది. అప్పటి కప్పుడే అక్కడ విడాకుల చట్టం విచ్చలవిడిగా నడయాడుతోంది. ఛిద్ర గృహాల సంఖ్య పెరిగి పోతూ వుంది. సాంఘిక పరంగా చూసినా, ఆర్థిక పరంగా చూసినా అక్కడి సామాన్య గృహిణికి ఎటువంటి రక్షణా లేకపోయింది. స్త్రీల అభిరుచికి గాని, యోగ్యతలకుగాని సరిపోయే ఉద్యోగాలు కరువయాయి. 'అబలలు-అంచేత వారికి ప్రాముఖ్యత నియ్యాలి' అనే నానుడి చింతకాయ పచ్చడయి కూర్చుంది.

అటువంటి దీన పరిస్థితి నుండి అక్కడి స్త్రీని కాపాడడానికిగాను నడుం కట్టి ముందుకు నడిచింది ఒక చిన్న ఉద్యమం. ఆ ఉద్యమానికి ఊపిరి-బెట్టీ ఫ్రీడాన్ వ్రాసిన పుస్తకం. అలా ప్రారంభమయిన ఉద్యమానికి 'విమెన్స్ లిబ్' అన్న నామకరణం జరిగింది.

ఈ సంస్థకు ఎటువంటి ఆర్థిక సహాయమూ లేక పోయింది. మీదుమిక్కిలి ఆ సంస్థ ఎదుర్కొన్న అవాంతరాలు కోకొల్లలు. అయినా ఆ 'లిబ్' సభ్యులు నిస్వార్థంగా కృషి చేసారు.

స్త్రీకి ఉన్న స్థానాన్ని మెరుగుపరచడమే వారి ఆశయం. ఇంటింటికి తిరిగి తమ ఆశయాలను సాటి స్త్రీల ముందుంచి, వారిలో చైతన్యం తేవడం మొదలెట్టారు. ఆ విధంగా ప్రారంభమయిన 'విమెన్స్ లిబ్' అమెరికా దేశపు సాంఘిక వ్యవస్థను పునాదులతోసహా గడగడ లాడించింది.

ప్రయోజన లక్ష్యంతో, నిస్వార్థంగా ప్రారంభమయిన ప్రతి ఉద్యమం రాను రాను వ్యాపార సంస్థగానో, స్వార్థఫలాపేక్షను సాధించే పరికరంగానో మారడం - ఈనాటి నాగరికత వలన మనం పొందుతున్న సౌకర్యం.

ఈ 'విమెన్స్ లిబ్' విషయంలోనూ అంతే జరిగింది. ఆధునిక మహిళలు కొందరు, కొంగ్రొత్త అభిరుచులతో, అభిప్రాయాలతో 'విమెన్స్ లిబ్'ను తమ హస్తగతం చేసుకోవడం జరిగింది. వీరి సంకుచిత దృక్పథాలతో, స్వార్థంతో ఈ ఉద్యమం తన విశిష్టతను పోగొట్టుకుంది.

'బ్రా'లను నడివీధిలో తగలేయడం, లెస్బియనిజాన్ని విశృంఖలం చేయడంలాటి భావాలు ఆశయాలుగా మారి - స్త్రీ విమోచనం గురించి పాటుపడవలసిన ఈ 'లిబ్' కొందరు స్వార్థపరుల స్వప్రయోజనాలకు ఆలవాలమై కూర్చుంది. రాజకీయం చోటు చేసుకుంది. అరాజకత్వం ప్రబలింది. తత్ఫలితంగా 'విమెన్స్ లిబ్' అంటేనే అసహ్యం అన్నారు కాస్త పరువు మర్యాదలు కల స్త్రీలు. సంఘసేవలో అత్యంత ఉన్నత స్థాయినందుకుని, మహిళల మహోన్నత అభ్యుదయానికై కంకణం కట్టుకుని, నిరాఘాటంగా ముందుకు పోవలసిన ఈ చైతన్య స్రవంతిని తమ స్వార్థం కోసం తప్పు త్రోవలు త్రొక్కించడంలో కృతకృత్యులయారు. ఈ ప్రజావాహిని తమకంటె 'పాపులర్' అయిపోయి, ప్రజాదరణను పొందినట్టయితే - తమకు పుట్టగతులుండవన్న సత్యాన్ని గ్రహించిన రాజనీతిజ్ఞులు కొందరు, దూరాలోచన లేని స్త్రీలను కొందరిని చేరదీసి 'విమెన్స్ లిబ్'ను అత్యంత హీనస్థితికి దిగజార్చారు. తమకళ్ళను తామే పొడుచుకుంది అక్కడి మహిళా ప్రపంచం.

నాగరికత పరాకాష్ఠనందుకుంటున్న భ్రమ కలిగించే అమెరికాలో ఇంతవరకూ స్త్రీది రెండవ స్థానమే! ఎన్ని సంవత్సరాల అనుభవమున్నా, ఎన్ని అర్హతలున్నా - అక్కడి స్త్రీకి పురుషుని తర్వాత స్థానమే!

ఒక సీనియర్ ఆఫీసరు (పురుషుడు) రిటైరు అయిననాడు, ఆ స్థానాన్ని నింపేందుకు మరొక పురుషుడే అర్హుడవుతాడు. ఎన్ని అర్హతలున్నా ఒక డిపార్టుమెంటుకు హెడ్డుగా స్త్రీని నియమించడం అమెరికా సాంఘిక వ్యవస్థ అంగీకరించదు. ఉద్యోగరీత్యా ఇద్దరు వ్యక్తులు పనిచేస్తున్నప్పుడు, వారి అర్హతనుబట్టి, అనుభవాన్నిబట్టి వారికి గుర్తింపు వుండాలి. ఈ గుర్తింపుకు ఆ వ్యక్తి యొక్క 'సెక్సు' (పురుషుడా, స్త్రీయా అన్న మీమాంస) ఏ విధంగానూ అడ్డు రాకూడదు. అలా అడ్డు వచ్చిన నాడు, ఆ సంఘం ఎన్ని విధాల, ఎన్ని రంగాలలో ముందడుగు వేసినా, ఆ సంఘంలో స్త్రీకి స్వాతంత్ర్యం లేదనే చెప్పాలి.

స్త్రీ స్వాతంత్ర్యానికి ప్రమాణంగా ఈ పరిస్థితులను తీసుకుంటే, భారతదేశంలో స్త్రీ స్వాతంత్ర్యం చాలా వుందనే చెప్పాలి.

పాశ్చాత్య సాంఘిక వ్యవస్థకు మన సాంఘిక వ్యవస్థకు—వారి ఆర్థిక సూత్రాలకు మన ఆర్థిక సూత్రాలకు, వారి ఆచార వ్యవహారాలకు మన ఆచార వ్యవహారాలకూ — వారి నైతిక విలువలకూ మన నైతిక విలువలకూ చాల వ్యత్యాసం వుంది.

అర్హతలు కలిగి, సమర్థురాలైన భారత స్త్రీ ఏ రంగంలోనయినా అత్యున్నత స్థాయినందుకో గలిగే అవకాశాలున్నాయి. ఒక డిపార్టుమెంటుకు అధికారిణిగా, ఒక జిల్లాకు కలెక్టరుగా, ఒక వ్యవస్థకు డైరెక్టరుగా, ఒక రాష్ట్రానికి గవర్నరుగా, దేశానికి ప్రధాన మంత్రిగా — ఇలా ఎన్ని విధాల చూసినా పురుషునితో పోటీచేసి - అర్హతలనుబట్టి -

పురుషునికంటె పై మెట్టును భారత స్త్రీ అందుకోవడానికి ప్రోత్సాహాన్నిస్తుంది-భారతదేశపు నాగరికత.

మనం ప్రస్తుతం సంధి యుగంలో ఉన్నాం. గతాన్ని పూర్తిగా విడనాడ లేకపోతున్నాము. అలా అని పూర్తిగా క్రొత్త పంథాను అనుసరించనూ లేకపోతున్నాము. సంఘానికి మార్పు అవసరం. కాలవేగంతో పరుగు లిడనినాడు, పెరుగుదల ఆగిపోయిన సంఘం కుళ్ళుకంపు కొడుతుంది. దేశానికీ మరొక దేశానికీ దూరం తరిగిపోవడంతో-ఒకరి నాగరికతా ప్రభావం ఇంకొకరిపై ప్రసరించడం సహజం. ఆలోచనా రీతిలో మార్పులు వస్తాయి. అభిరుచులలో, అనుభూతులలో మార్పులు వస్తాయి. వ్యవస్థలు మారుతాయి. సంప్రదాయాలూ, ఆచార వ్యవహారాలూ-శాస్త్ర జ్ఞానమూ, ధర్మాలూ ఆఖరుకు నైతిక విలువలు కూడ మార్పు చెందుతాయి.

ఇలా అనుక్షణం మారిపోతున్న సమాజంలో మనిషి తబ్బిబ్బైపోతున్నాడు. అందరి మనస్తత్వం ఒక్కలా ఉండదు. మారిపోతున్న ఈ సమాజంతో మనిషి 'ఎడ్జస్ట్' అవడం అంత సులభం కాదు. అయినా ఎడ్జస్ట్ అవుతూ ముందుకు సాగిపోవాలి.

"యుగ యుగాలకు కొత్త చరిత్ర తయారవుతుంది. యుగయుగాల ఈ చరిత్ర కొత్త సంప్రదాయాన్ని నెలకొల్పుతుంది. ఈ సంప్రదాయాన్ని ఒక్కసారిగా త్రోసి పారేయలేం."—సర్వేపల్లి రాధాకృష్ణ వంటి వారే ఇలా అభిప్రాయపడ్డప్పుడు, దానిని తోసి రాజనడం సామాన్యుడి అహంకారానికి గుర్తు.

చదవడం వ్రాయడమే విద్యకు కొలత బద్ద అయితే భారతదేశంలోని స్త్రీలలో నూటికి సుమారు ఇరవైమంది - అక్షరాస్యులు వున్నారు. మిగతా ఎనభై మందీ నిరక్షరాస్యులు. ఈ ఎనభై మందిలో చాలమటుకు కొండచరియలలోనూ, అడవులలోనూ, 'నాగరికతకు' దూరంగా బ్రతికేస్తున్నారు. వారి జీవితాలకు సరిపడే వారిని 'ఆదిమవాసులని' 'గిరిజనులని' 'హరిజనులని' అంటున్నాం.

అయితే విద్యావంతులైన స్త్రీలు తమ తోటి స్త్రీల గురించి చేస్తున్నదేమిటి? ఇందులో ఎంతమందికి తమ సంఘం గురించిగాని, దేశం గురించిగాని తెలుసు? ఎందరికి పిల్లలను ఎలా పెంచితే మంచి పౌరులుగా తయారవుతారన్నది తెలుసు? ఎంతమందికి తమ సాటి స్త్రీలను నిర్లక్ష్యం చేయకుండా ఆదరించే అమృత హృదయం ఉంది? మురికిలో కూరుకుపోతున్న ఎందరికి ఈ విద్యావంతులు ఆదరణ - కాదు కనీసం సానుభూతి చూపించగలరు? ఈసడించకుండా ఎంతమంది ఆదరణ చూపించగలరు?

ఆడవాళ్ళు చదువుకున్నంత మాత్రాన ఇంటి పనులు చేయకూడదన్నది శాస్త్రమా? విద్యను అహంకారానికి అస్త్రంలా ఉపయోగించడం వివేకమా! విద్యవల్ల నేర్చుకున్న సిద్ధాంతాలను ఆచరణలో పెట్టి విద్యకు పరిపూర్ణత చేకూర్చిన నాడు, విద్యావంతుల విద్యకు ఒక విలువ ఏర్పడుతుంది.

"మమ్మల్ని ఇన్నిరోజులూ వంటింటి చీకటిలో బంధించారు. పిల్లల్ని కనడం, వారిని పెంచడమే మా జీవన పరమావధిగా మార్చారు. భర్త చెప్పు చేతల్లో వ్యక్తిత్వం కోల్పోయి కీలుబొమ్మగా, మానాభిమానాలు లేని యంత్రంగా మార్చి-భర్తకు ఊడిగం చేయిస్తూ వచ్చారు." ఇటువంటి నినాదాలు విద్యావంతులైన భారతస్త్రీలు కొందరు లేవదీస్తున్నారు. సంఘాన్ని సవాలు చేస్తున్నారు.

ఒక పురుషుడు పరస్త్రీతో సంబంధాలు (అక్రమ) పెట్టుకున్నప్పుడు - పెళ్లయిన స్త్రీ పరపురుషుడితో

### ప్రకటన

వారపత్రిక చేతిలోకి తీసుకున్న లత దృష్టి ఒక పేజీపై నిలిచిపోయింది — "సన్నబడాలంటే 'లతారిష్ట' తీసుకోండి. నెల రోజుల్లో సన్నగా, నాజుగ్గా తయారవండి. ధర నలభై రూపాయలు మాత్రమే" దాని ప్రక్కగా లలితాంగులైన రమణుల చిత్రాలు. వారి స్థానాల్లో తన నూహించుకుని, తృప్తి చెంది వెల ఎక్కువైనా నెల రోజుల్లో పేరుకు తగ్గట్టు 'లత లాగా అవుతాను కదా'-అని మనసులో అనుకుని, పట్టుచీర కొరకు దాచుకున్న డబ్బులో నుండి, నలభై రూపాయలు మనియార్డర్ చేసింది. పాపం! లత లావుగా ఉంటుంది. ఒళ్ళు తగ్గించుకోవాలని తాపత్రయం. శ్రమపడకుండా, నోరు కట్టకుండా లావు తగ్గే మార్గం ఏదైనా దొరుకుతుందేమోనని కనిపించిన పత్రికల్లా తిరగేస్తుంది. లత భర్తకు ఇలాంటివి ఇష్టముండవు. "నీకేమోయ్! కాస్త లావైనా రంభలాగుంటావు. ఇక నీ నడుము. ఉన్నట్టా అది లేనట్టా" అంటూ పాట మొదలెత్తాడు. అందుకొరకే అతనితో చెప్పకుండానే డబ్బు పంపింది.

ఎమ్. ఒ. పంపిన మూడవరోజు పార్సెల్ అందుకుంది లత. సీసాతోపాటు నాలుగు పేజీల బుక్ కూడా వుంది. ఆత్రుతగా తెరిచింది. మందుతో పాటించవలసిన విధులు: "ఇంటి పై భాగానికి మెట్లు వుంటే రోజూ నాలుగైదుసార్లు ఎక్కి దిగాలి. ఉదయం మైలు దూరం నడచి రావాలి. ఇంట్లో పని మనిషిని తీసివేసి సొంతంగా పని చేసుకోవాలి. చాకలిని తొలగించి బట్టలు స్వయంగా ఉతకాలి. గ్రైండర్‌లాంటి మిషన్స్ వాడకుండా పప్పు రుబ్బుకోవాలి. వొళ్ళు దంచుకోవాలి.

ఐస్‌క్రీమ్, బాదంగీర్‌లాంటివి అసలే వాడకూడదు. పంచదార లేని టీ, కాఫీలు, పాలకూర, తోటకూర లాంటివి ఉడకపెట్టుకుని తింటే మంచిది. నూనె, నెయ్యి" ఇక ముందుకు చదవలేకపోయింది లత. పీడ దుంపతెగ, ఇవన్నీ పాటిస్తే పీడ మందెందుకు, బూడిదలో పొయ్యనా! పీనుగులాగైపోను పెక్కుతే ఎవరు చేస్తారు పని? అని మనసారా తిట్టుకుంది. లెంప లేసుకుంది. ఇప్పుడు పతిగారు వేంచేస్తే గతి ఏమిటి? అని ఆలోచిస్తూ సీసాను షెల్ఫ్‌లో దాచేసింది!



—దేవులపల్లి శిరీష

సంబంధాలు పెట్టుకుంటే తప్పా? వివాహత్పూర్వం పురుషుడు లైంగిక సుఖాన్ని పొందడానికి అర్హుడయితే స్త్రీకి ఆ అర్హత ఎందుకు ఉండకూడదు అన్న 'విప్లవాత్మక' స్త్రీలు కూడా తయారవుతున్నారు.

ప్రతిదీ వ్యాపార సరళిలో నడుస్తున్న ఈ ఆధునిక యుగంలో సంక్షేమ ఉద్యమాలూ, ప్రగతిశాల సంఘాలు కూడా సాధారణంగా పరిశ్రమలుగా మారిపోతున్నాయి. సాంఘికాభివృద్ధిని లక్ష్యంగా కాక, ఒక ప్రత్యేక వ్యక్తిగత లక్ష్య సాధనకు ఈ సంఘాలను, ఉద్యమాలను పరిమితం చేయడం జరుగుతోంది. నాగరిక జీవనంలోని సంఘర్షణల సంఖ్య ఎక్కువ అవుతోంది. శీఘ్రగమనలక్షణం వల్ల నిలకడపాటు తక్కువైంది. అందినంతవరకు స్వాహా అన్న సూత్రం మీద నడుస్తున్న ప్రస్తుత జీవన సరళిలో, స్వార్థానికి కాక, సంఘ క్షేమానికై పాటుపడేవారి సంఖ్య తక్కువవుతోంది.

ఆదినుండి అంతంవరకు ప్రతి క్షణం మనిషి సమాజ జీవి కావడంవల్ల, సమాజం రకరకాల మనుషుల సమూహ ప్రవృత్తికి నిలయం కావడం వలన–అనుక్షణం మారిపోతున్న అభిప్రాయాలూ అభిరుచులవలన – నూతనత్వానికి నివాళి పలకడం అలవాటు అవడంవలన – కావలసిందేదో తెలియక తెలిసి కావలసినది నిష్కల్మషంగా సంపాదించుకోవడానికి అవకాశం లేకపోవడం వలన – భిన్నాభిప్రాయాలవారు తమ తమ వాదాల్ని నెగ్గించుకునే తాపత్రయం ఎక్కువ కావడంవల్ల – నాగరికతకూ, సంస్కారానికి తేడా గమనించక పోవడం వలన– ధరల ధోరణిలో పడిపోయిన సగటు మనిషి, విలువలను విస్మరించడం వలన ప్రతి ఉద్యమం రాజకీయమయమైపోతోంది.

ఆచరణ యోగ్యం కాని నాగరికతను అనుకరించడంతో భావ స్వాతంత్ర్యం రాదు. నినాదాలు చేయడంతో ఆర్థిక స్వాతంత్ర్యం రాదు. నారీ సమాజ స్వభావాన్ని ప్రతిస్త్రీ అర్థం చేసుకునే తీరు ఏర్పడాలి మొదట. ప్రతి మహిళ సమస్యను తమ సమస్యగా భావించిన నాడే మహిళా ప్రపంచం ప్రగతిని సాధించగలుగుతుంది. పురుషులను కించపరచినంత మాత్రాన స్త్రీ స్థానం మెరుగుపడిపోతుందనే అపోహను విడనాడాలి. యవ్వనంలో అడుగిడే ప్రతి యువతిపై తమ నినాదాల, ప్రచారాల ప్రభావం ఎంతవరకూ పడుతుందో దృష్టిలో ఉంచుకుని ప్రవర్తించాలి.

ఈ యువతుల దృష్టిలో పురుషుడు అంటే ఎలా చిత్రీకరించబడుతున్నాడో, తద్వారా భావి జీవితంలో వారు తమ భర్తలకు ఇచ్చే విలువ, తద్వారా తాము పొందే విలువ, అనుభవజ్ఞులైన స్త్రీలు అర్థం చేసుకోవాలి. మనం ఇచ్చే విలువలు పసివారి హృదయాలపై సాధారణంగా శాశ్వత ముద్రలు వేసుకుంటాయి. ఆవేశంతో, అర్థం లేని అహంకారంతో అర్థవిహీనమైన పాశ్చాత్య అనుకరణలో మన మౌలిక విలువలను విడిచిపెడితే– మనకు మనం అన్యాయం చేసుకున్నవారమే కాక, భావి నారీలోకానికి కూడా అన్యాయం చేసిన వారమవుతాము. నిష్పక్షపాతంగా నిజాన్ని యువతుల ముందుంచి వారి భావి సంక్షేమానికి పాటుపడే ప్రయత్నం చేయాలి. మనిషిగా బ్రతికేందుకు మంచి చెడుల్ని విడివిడిగా చూడగలిగే వివేకం అవసరం. సృష్టి తనకు ఇచ్చిన జ్ఞానాన్ని వినియోగించుకుని, మంచితనాన్ని పెంచుకోవాలి. సత్సంప్రదాయం వ్యక్తి ఆలోచనలకు ఆయువుపట్టు. అదృష్టవంతురాలైన స్త్రీ, తనకు అవకాశం ఇచ్చిన చదువును అర్థం చేసుకుని, ఆ విజ్ఞానాన్ని సాటి స్త్రీతో పంచుకుని, తనలోని సంస్కారాన్ని మెరుగుపరచుకుంటూ, స్త్రీకి మరొకస్త్రీ శత్రువు కాకుండా సాటిమనిషిగా చూడగలిగిన నాడు – ప్రతిస్త్రీ తనకు తానుగా జీవితానికి కొత్త వ్యాఖ్యానం చేసుకోగలుగుతుంది. ఇందుకు కావలసింది తాము మంచి చేస్తున్నామన్న ఆత్మవిశ్వాసం. ఆచరణలో పెడుతున్న ఆశయాలు సాటిస్త్రీకి ఎంతవరకు మంచిని చేకూరుస్తున్నాయన్న ఆత్మ విమర్శన — చెడును ఎదుర్కొని నిలబడగలిగే ఆత్మస్థైర్యం – అనుకున్న పనిని ఆసాంతమూ సాధించగలిగే పట్టుదల— ఇవన్నీ కలిగిన నాడు పురుషుని కంటె స్త్రీ తక్కువ అనే అభిప్రాయం (ఈ అభిప్రాయం చాలామంది స్త్రీలలో వుండడమే విచారకరం) తొలగిపోయి, పురుషునితో సమాన హక్కులను పొందగలుగుతుంది.

మగవారిని ద్వేషిస్తూ, దూషిస్తూ నినాదాలు చేస్తే ఏ లక్ష్యాన్నీ సాధించలేము. ఎంచేతనూ అంటే పురుషునికి స్త్రీ ఎంత అవసరమో, స్త్రీకి పురుషుడు కూడా అంతే అవసరం.

వీరి సామరస్య కలయికే మానవ మనుగడకు మూలం.



1. ప్రపంచంలో ఏడు వింతలు వున్నాయని మీకందరికీ తెలుసు. కాని వాటిల్లో ఏడవ వింత ఏదో చెప్పగలరా?
2. స్వచ్ఛమైన వజ్రం ఏ రంగులో వుంటుంది?
3. అమెరికా, సోవియట్ రష్యా, ఈజిప్టు దేశాలలో ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన మూడు నదులు ప్రవహిస్తున్నాయి. అవి ఏవి?
4. భూటాన్, బెల్జియం, పాకిస్తాన్, టర్కీ, తాయ్‌లాండ్ దేశాల రాజధాని నగరాలు ఏవో చెప్పగలరా?
5. అబ్రహాం లింకన్–అంటే ఎవరు?
6. మొదటి ప్రపంచ యుద్ధం ఎప్పుడు ప్రారంభమైంది? ఎప్పుడు అంతమైంది?
7. మనదేశం అంతరిక్షంలోకి 'ఆర్యభటా' అనే ఉపగ్రహాన్ని పంపింది. అయితే ఆసియా ఖండంలో మొట్ట మొదట ఉపగ్రహాన్ని పంపిన దేశం ఏది?
8. మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మొట్టమొదటి ఎన్నికలు ఎప్పుడు జరిగాయి?
9. ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీకి అధ్యక్ష స్థానం అలంకరించిన ప్రథమ వనిత ఎవరు?
10. పిన్న వయసులోనే నోబెల్ బహుమతి పొందిన వ్యక్తి ఎవరో చెప్పగలరా?

**[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]**

కాలింగ్‌బెల్ మోగడంతో పేపరులోంచి తలెత్తి గుమ్మం వైపు చూసింది రాజ్యలక్ష్మి. గుమ్మంలో కునికిపాట్లుపడుతున్న వెంకటమ్మ గబుక్కున లేచి తలుపు తీసింది.

ఓ పధ్నాలుగేళ్ళ కుర్రాడు, చేతిలో రెండు పుస్తకాలతో ముఖాన్నపడుతున్న జుట్టు పక్కకు తోసుకుంటూ—

"నమస్కారమండీ" అన్నాడు. 'వీడూ ఇదే బాపతు' అనుకుంది రాజ్యలక్ష్మి కుర్రాడికేసి చూస్తూ.

"టెన్త్‌క్లాసు చదువుతున్నానండి."

"ఊ"

"భోజనానికి .......' నసిగాడు కుర్రాడు.

"ఊ" అంది రాజ్యలక్ష్మి అతనికేసి చూస్తూ. సమాధానం లేదు. ఓ క్షణం ఆగి,

"ఏం చేయమంటావ్–భోజనం పెట్టాలి నీకు–అంతేనా" – రాజ్యలక్ష్మి మాటలకి వంచినతల ఎత్తి "అబ్బే కాదండి–ఈ రోజు కాదు–ఈ రోజు ఎదిరింటి మేడవాళ్ళ దగ్గర కుదుర్చుకున్నానండి–కానీ"–కుర్రాడు గొణిగాడు.

"ఒక్క మాటలో చెప్పేయ్–నీకేం కావాలో" కుర్చీలోంచి లేచి, రాజ్యలక్ష్మి కిటికీ దగ్గరకెళ్ళి నిలబడింది.

కుర్రాడి మనసు బాధగానే వుంది. కానీ, ప్రస్తుత పరిస్థితులలో తప్పదు. ఒక్క నిముషం అలాగే నిలబడ్డాడు మాట్లాడకుండా. రాజ్యలక్ష్మి ఒక్కసారిగా—

"ఊ, చెప్పు" కసిరింది కుర్చీలో కూర్చుంటూ.

"నేను వారాలు చేసుకుని చదువుకుంటున్నాను. నాకు రెండు రోజులకి ఇళ్ళు కుదరలేదు. ఆ మేడ మీద వాళ్ళు మీరెంతో మంచివారని, ఎందరికో ఇలా సహాయం చేస్తుంటారని చెప్పారు. ఈ పదో క్లాసు పాసయి చిన్న నౌకరీ సంపాదించుకుని నా బతుకు నేను బతకాలని...."కుర్రాడు ఆగాడు. తలొంచుకున్నాడు.

"చూడు బాబూ! నువ్వు చెప్పినట్టుగా నేను చాలా మంచిదాన్నే. నా మనసు ఇంకా చాలా మంచిదే. కానీ, ఎందుకీ మంచితనం? కాల్చనా" కుర్రాడు బెదిరిపోయి చూస్తున్నాడు రాజ్యలక్ష్మి వైపు.

"నీకు ఈ రోజు కడుపునిండా అన్నం పెడతాను. తింటావు. అంతేనా?" రాజ్యలక్ష్మి కుర్రాడి కళ్ళలోకి చూసింది.

"కాదండి. బతికున్నంతకాలం మీ పేరు చెప్పుకుంటాను."

రాజ్యలక్ష్మి కళ్ళు ఎర్రబడ్డాయి.

"అందుక్కాదు నీకు పెట్టేది." రాజ్యలక్ష్మి మాటలు ఆపి కుర్చీలోంచి లేచింది.

"నీకు ఒక్క రోజు కాదు రోజూ అన్నం పెట్టగలను, పెద్ద చదువు చెప్పించగలను. నీకు ఉద్యోగం ఇప్పించగలను." కుర్రాడి కళ్ళలో చిన్న వెలుగు. కానీ మరో క్షణంలో—

"కానీ నేనేమీ చేయను. వెళ్ళు, బయటకెళ్ళు" రాజ్యలక్ష్మి మాటలకి నిర్ఘాంతపోయాడు కుర్రాడు.

"నేను మీరనుకొనేటటువంటి వాణ్ణి కానండి. మీరు చేసే సహాయం మరిచిపోయే విశ్వాస ఘాతకుణ్ణి కానండి." కుర్రాడు ఏదో అంటున్నాడు.

ఇలాగే పదేళ్ళనాడు తన దగ్గరకొచ్చిన ప్రకాష్ కళ్ళముందు కదలాడాడు. తనే చదువు చెప్పించి, బట్టలిచ్చి, తిండి పెట్టి ఆరేళ్ళు పోషించింది. ఆ తర్వాత ఒక ఆఫీసులో చిన్న ఉద్యోగం వేయించింది. అంతే, ఈ రోజు తనెలా వుందో బతికిందో, చచ్చిందో కనుక్కోవాల్సిన అవసరం కూడా లేదు. అతనెక్కడున్నాడో తెలియజేయాల్సిన అవసరం కూడా లేదు. రాస్కెల్స్. మంచితనం. మంచితనం. రాజ్యలక్ష్మి కళ్ళు నిప్పులు కురుస్తుంటే, ఎదురుగా నిలబడ్డ కుర్రాడు పరమ దుర్మార్గుడిలా అనిపించాడు.

"ఐసే యు గెట్ అవుట్" రాజ్యలక్ష్మి గొంతు ఒక్కసారి దద్దరిల్లింది.

"వెళ్ళు బాబూ వెళ్ళు." కుర్రాడిని బయటకి పంపి తలుపువేసింది వెంకటమ్మ.

*

రాజ్యలక్ష్మి సహజంగా చాలా మంచిది. ఎవరి కష్టాల్ని చూడలేదు. చాలా చిన్నతనంలో తండ్రి మరణిస్తే ఇద్దరి చెల్లెళ్ళని, తమ్ముణ్ణి ఓదారికి తెచ్చి, చదువులు చెప్పించి, పెళ్ళిళ్ళు చేసింది. రాజ్యలక్ష్మికి పిల్లలంటే చాలా ఇష్టం. పిల్లలు పరమాత్మ స్వరూపాలని, పాపం పుణ్యం తెలియని పసివాళ్ళని గట్టి నమ్మకం రాజ్యలక్ష్మికి.

రాజ్యలక్ష్మిని ఎందరో అడుగుతుంటారు "మీ రెందుకు పెళ్ళి చేసుకోలేదు? పోనీ ఇప్పుడెందుకు చేసుకోకూడదూ" అని. రాజ్యలక్ష్మి నవ్వుతుంది. "ఏం. నేను పెళ్ళి చేసుకోకపోతే ఏం? ఎందుకు మళ్ళా కొత్త అనుబంధాలు? నాది అనేవి ఎందుకూ?" అంటుంది.

రాజ్యలక్ష్మి ఉద్యోగంలో స్థిరపడిపోయిన తర్వాత ఎందరెందరో తెలిసినవాళ్ళు తెలియనివాళ్ళు ఆమెకు ఆత్మీయులయ్యారు. తను సంపాదించిన డబ్బు ఎవరి మీద ఎలా ఖర్చు చేసినా అడిగేవాళ్ళు లేరు. అయినా పైసాపైసా కూడబెట్టి ఏం చెయ్యాలి? అందుకే రాజ్యలక్ష్మి ఎక్కడ ఎవరు ఇబ్బంది పడుతున్నారన్నా డబ్బు సహాయం చేస్తుంది. మనిషి సహాయం కావాల్సివచ్చినప్పుడు తనే స్వయంగా చేస్తుంది. అలాగే కదూ పక్కవాటాలో వున్న ఇందిరతో స్నేహం పెరిగింది!

ఇందిరకి ముగ్గురాడపిల్లలు. మూడో పిల్ల పురిటికి ఇందిరకి చాలా సుస్తీ చేసింది. రాజ్యలక్ష్మి హాస్పిటలుకి వెళ్ళడం, కారియర్ తనే సిద్ధం చేయడం, పిల్లలికి అన్నాలు పెట్టడం ఇలాటి వెన్నెన్నో చేసింది. అంతేకాదు, ఇందిర అన్న కూతురు చిట్టితల్లి అంటే మరీ చనువు ఎక్కువయింది. ఆ పిల్ల రాజ్యలక్ష్మిని వదిలేదికాదు. రాజ్యలక్ష్మి ఆఫీసునించి వచ్చి తలుపుతీయటం ఆలస్యం—చిట్టితల్లి గబగబా లోపలకొచ్చేది. తను తెచ్చిన బిస్కట్లు, చాక్లట్లు తింటూ కబుర్లు చెప్తూ కూచునేది చిట్టితల్లి.

ముక్తేవి భారతి

రాజ్యలక్ష్మి దొడ్లో ఎన్నో పూలమొక్కలున్నాయి. ఎన్నోసార్లు చిట్టితల్లికి పూల జడలు కుట్టుకుంది. ఓ రోజు "ఈ పూలు మీ అమ్మకిచ్చి పూల జడ కుట్టించుకో–నాకు ఒంట్లో బాగాలేదు" అంది రాజ్యలక్ష్మి, చిట్టితల్లి ఇంట్లోకెళ్ళి మళ్ళావచ్చింది.

'మా అమ్మకి రాదంట – నిన్నే అల్లమంది.'

'ఏమిటీ – పూలజడ అల్లటం రాదూ' అంది రాజ్యలక్ష్మి కాస్త విసుగ్గా.

'వచ్చునుకో – అయినా అమ్మకి ఇలాటి పనులు బోరంట - అమ్మ చెప్పింది–'

'అహా' – రాజ్యలక్ష్మికి ఓపిక లేకపోయినా చిట్టితల్లికి జడకుట్టి పంపింది!

రాజ్యలక్ష్మికి చిట్టితల్లి బాగా అలవాటయింది. ఆ పిల్ల ఓపూట కనిపించకపోతే తోచేది కాదు.

ఆ పిల్ల కోసం పండక్కి గౌన్లు కొనేది. బజారు నుంచి ఎన్నెన్నో తెచ్చిపెట్టేది.

ఓ రోజు 'ఆంటీ' అంటూ చిట్టితల్లి గుమ్మంలో కొస్తూ 'అమ్మ వచ్చింది' అంది నెమ్మదిగా.




సాధారణంగా ఇందిర లోపలికిరాదు. చాలా ముభావంగా వుంటుంది.

'మా పాప ఆంటీ ఇంటికి రమ్మని ఒకటే గోల. నాకు ఎవరింటికి రావాలనిపించదు.' అంది ఇందిర హాలంతా కలయచూస్తూ. పదినిముషాలు కూచుని ఇందిర వెళ్ళిపోయింది. ఆ తర్వాత వారం రోజులకి ఇందిర తండ్రి ఊరినించి వచ్చాడు.

"మా తాతయ్య ఆంటీ" అంది చిట్టితల్లి తాతయ్యని లోపలకి తెస్తూ.

తాతయ్య ఆ కబుర్లు ఈ కబుర్లు అడుగుతూ, "మా అమ్మాయి రాసింది - చిట్టి తల్లంటే మహా ప్రాణమని మీకు - మీరు చాలా మంచివారని అమ్మాయి చెప్తూ వుంటుంది - లేకపోతే మీరూ ఒక్కరే అయిపోయారు - అదే—ఈ పిల్లదాన్ని మీ దగ్గరే వుంచుకుంటే - ఇంకా ఇద్దరాడపిల్లలు ఉన్నారు కదా దానికి....అని" - తాతయ్య నసుగుతున్నా మాటలు సగం అర్థం అయి, సగం అర్థం కాక నివ్వెరబోయింది రాజ్యలక్ష్మి.

"అంటే_మీ ఉద్దేశం?"

"ఆ ఏముంది - ఆ తండ్రి చిన్న సంపాదనలో ముగ్గురాడపిల్లల్ని ఎలాగూ ఓ దారికి తేలేడు - మీకూ ఓ కష్టం సుఖం చెప్పుకుందుకు, కాలికి చేతికి సాయంగా ఉంటుంది కదా అని మా అమ్మాయి, అల్లుడు అనుకుంటున్నారు" అన్నాడు. అభిప్రాయం అర్థమయిపోయిన రాజ్యలక్ష్మి మనసు భగ్గుమంది.

'తను పెళ్ళిచేసుకోదు - తను సంపాదించే ఈ డబ్బు, ఈ ఇల్లు - అన్నీ ఎవరికివ్వాలా అని తన తరఫున_వాళ్ళే ఆలోచిస్తున్నారన్నమాట - చిట్టితల్లిని ముద్దుచేయటం చిన్నపిల్లగానే కానీ రాజ్యలక్ష్మి తలతిరిగిపోయింది - మనిషికి స్వార్థమో వంచనో, ద్రోహమో ఏదో ఒకటి ఉండితీరాలన్నమాట - మొదటిసారిగా తను ఒంటరిది అనే విషయం వీళ్ళు జ్ఞాపకం చేసారే - అంటే చిట్టితల్లిని కూడా వాళ్ళే ప్రోత్సహించి పంపుతున్నారన్నమాట!

*

ఆదివారం పొద్దున్నే తాతయ్య ఊరెళ్ళిపోయాడు. చిట్టితల్లి, ఇందిర గదిలోంచి బయటికి రాలేదు.

"పిల్లను పంపమన్నారు అమ్మగారు-పూలజడ కుడ్తారంట" వెంకటమ్మ ఇందిర గుమ్మంలో నుంచుంది.

"జ్వరంగా ఉందని చెప్పు-దిక్కుమాలిన కళ్ళు ఎవరివి పడ్డాయో-"దభీమని తలుపేసింది ఇందిర.

ఆ తర్వాత చాలా రోజులు చిట్టితల్లి రాజ్యలక్ష్మిని తప్పించుకు తిరిగింది. రాజ్యలక్ష్మి మంచులాటి మనసు భగ భగ మండిపోతూంది. ఆ ఇంట్లో ఒంటరిగా తను అయిపోయినట్లు అనుకొంటూ నీళ్ళు నిండిన కళ్ళు రహస్యంగా తుడుచుకుంది పిలిచినా వినిపించనట్టు వెళ్ళిపోయిన చిట్టితల్లిని తల్చుకుంటూ.

*

ఆఫీసు నుంచి ఇంట్లో అడుగు పెడుతూనే గుమ్మంలో వున్న వుత్తరాలు చూసింది రాజ్యలక్ష్మి. ఒకటి తమ్ముడు రాసింది.

"పసివాడికి ఇప్పుడిప్పుడే మాటలొస్తున్నాయి. ముందు నిన్నే పిలుస్తున్నాడు. నీ మరదలు నిన్ను పండక్కి తప్పక రమ్మని మరీ మరీ చెప్తోంది. రెండురోజులుండేట్టు రా. ఇంకో విషయం – నీకు ఇవ్వాల్సిన డబ్బు ఈమాటు మా జీతాల్తో సి. ఓ. ఇస్తారుట – తప్పక పంపించేస్తాను" రాజ్యలక్ష్మి నవ్వుకుంది.

"నాకు అప్పు తీర్చడమేమిటి – చిన్నవాడివి నీ సంసారం చక్కగా చూసుకో. కావలసి వచ్చినప్పుడు నేనే అడుగుతాగా – ఎంత వాడయ్యావు. నాకు అప్పు తీర్చేంత—" రాజ్యలక్ష్మికి తమ్ముడు రాసిన ఉత్తరం చాలా ముచ్చటేసింది.

మరో ఉత్తరం విప్పి చదువుతుంటే రాజ్యలక్ష్మికి చాలా ఆశ్చర్యం కలుగుతోంది.

"మీ డబ్బు చాలా త్వరలో పంపేస్తాను. మీ చెల్లెలి గొలుసు అమ్మేస్తున్నాను. ఎంతో మంచిగా తియ్యగా మాట్లాడుతూ, మీకు ఆ డబ్బుతో ఇప్పుడేం పనిలేదని, వీలయితే ఎప్పుడో ఇయ్యండని మాకు ఇచ్చారు – ఆ రోజు మీరు డబ్బు ఇస్తానని ముందుకు రాకపోతే, మేము ఏ కాబూలీవాలా దగ్గరో తెచ్చుకుని, అప్పు తీర్చలేక సమస్తమూ అమ్ముకునే వాళ్ళం. కానీ మీరెంతో మంచిగా మాట్లాడినా, కాబూలీవాలాకన్నా...." ఇలా నిష్ఠూరంగా సాగిన ఉత్తరాన్ని చదివి బల్లమీద విసిరి కొట్టింది రాజ్యలక్ష్మి.

ఓ అవసరానికి చెల్లెలి భర్తకి డబ్బు సర్దింది తను. 'వడ్డీకి తెచ్చుకుని ఇబ్బందులు పడకండి – మీకు వీలున్నప్పుడు ఏ వడ్డీలు లేకుండా నాకివ్వరు గాని' అని తనే వాళ్ళకి డబ్బిచ్చింది. అంతే, తను అడగకుండానే ఏమిటీ పిడుగుపాటు —

రెపరెపలాడుతున్న కాగితం చివరి వాక్యాలు రాజ్యలక్ష్మిని కదిల్చివేసాయి.

'నా డబ్బు నాకిచ్చి నాతో చుట్టరికం తెంపేసుకుంటారట. కానీ, ఆ రోజు మంచితనానికి పోయి, జాలిపడి కదూ తను వాళ్ళని ఆదుకున్నది. కానీ తప్పు తనదే – మంచితనం దేనికి, బూడిదలో పొయ్యనా" రాజ్యలక్ష్మి ఆ ఉత్తరాన్ని చించి బుట్టలో పారేసింది.

వారం రోజుల తర్వాత చెల్లాయి రాస్తుంది ఉత్తరం – "అక్కా – ఇంతవరకు నువ్వెంతో మంచి దానివనుకున్నాను. ఈ మధ్య ఇందిర వాళ్ళ నాన్నగారు మా యింటికి వచ్చారు – అన్నీ చెప్పారు. నీకు డబ్బు కావాలంటే వడ్డీతోసహా నీ మొఖాన్న పారేస్తాము. అయినా నువ్వు ఒంటరిదానివి — బంగారు పళ్ళానికి కూడా గోడ చేరువ కావాలంటారు – నీకు చెప్పమంటున్నారు మా ఆయన" ఇలా సాగింది ఉత్తరం !

ఇందిర వాళ్ళ నాన్న – అవును ఆయన తనని ఇంటికి చుట్టూ గోడ కట్టుకోవాలి డబ్బు అప్పు ఇమ్మంటే, తన దగ్గర లేదని, ఉన్న డబ్బు చెల్లెలు వాళ్ళకి అవసరమని సర్దానని చెప్పింది కదూ – అదా ఈ గాలి దుమారం. రాజ్యలక్ష్మి మనసు ముక్కలు ముక్కలయింది. ఆ రాత్రంతా నిద్రపట్టలేదు రాజ్యలక్ష్మికి. ఎవరు తనవాళ్ళో, ఎవరు పరాయివాళ్ళో అర్థం కాలేదు రాజ్యలక్ష్మికి. ప్రతి వ్యక్తి ఇతరుల మంచితనాన్ని కొల్లగొట్టాలని చూసేవాళ్ళే – ఛ ఛ.

ఆఫీసుకి సెలవుపెట్టి ఇంట్లో ఉంది రాజ్యలక్ష్మి.

చిట్టితల్లి తలుపు తోసుకు నెమ్మదిగా అడుగు పెట్టింది. రాజ్యలక్ష్మికి కళ్ళల్లో నీళ్ళొచ్చాయి.

"రావటం లేదేం" అంది మంచం మీద చిట్టితల్లిని కూచోపెట్టుకుని.

"నెమ్మదిగా – అమ్మ వింటుంది" భయం భయంగా తలుపుకేసి చూస్తూంది చిట్టితల్లి.

"ఏమిటి కబుర్లు – అన్నం తిన్నావా?" అంది రాజ్యలక్ష్మి చిట్టితల్లి తల నిమురుతూ.

"రేపు మేము ఇల్లు ఖాళీ చేస్తున్నాము."

"ఏమిటీ"—

"అవును. అమ్మ అప్పుడే చెప్పద్దంది – రేపే అమ్మ చెప్తుందిట."

రాజ్యలక్ష్మి ఏమీ మాట్లాడలేదు. చిట్టితల్లి కొత్త యింట్లో కూచున్నట్లుగా గోడల్ని చూస్తోంది.

"ఇది తిను" ఫ్రిజ్‌లోంచి ఒక యాపిల్ తీసి యిచ్చింది.

"ఒద్దు."

"ఏం"

"అమ్మ మీ యింట్లో తినద్దంది."

"అంటే–అదివరకు తినేదానివిగా."

"అప్పుడు నువ్వు మంచిదానివిట. ఇప్పుడు ఏమో మరి – తింటే చంపేస్తానంది"

రాజ్యలక్ష్మి దీర్ఘంగా నిట్టూర్చింది. తన మంచితనం ఇలా జెడిసికొట్టిందా – సరే వీళ్లు ఖాళీ చేస్తే ఇంకోళ్ళొస్తారు. వాళ్ళతో మాత్రం ఖచ్చితమైన ఇంటిదానిలా నెల మొదటి రోజునే అద్దె వసూలు చేస్తాను. ఒక్కరోజు ఆలస్యం చేసినా గొంతు పిసికి చంపేస్తాను – ఇక నుంచి ఇలాగే ఉంటాను.

చిట్టితల్లి వెళ్ళగానే రాజ్యలక్ష్మి ఛప్పున తలుపు వేసుకుంది.

ఎర్రగా, చల్లగా మంచులా వున్న యాపిల్ పళ్ళెంలో ఎదురుగా కనిపిస్తోంది – రాజ్యలక్ష్మి దానివంకే చూస్తోంది. 'వెంకటమ్మా' గర్జించింది రాజ్యలక్ష్మి. పనిలోవున్న వెంకటమ్మ పరిగెత్తుకొచ్చింది.

"ఆ చాకుతే"

తెచ్చింది వెంకటమ్మ.

యాపిల్ ముక్క ముక్కలుగా కోసింది. పళ్ళెం నిండింది. ఎన్ని ముక్కలో. వెంకటమ్మకి కొన్ని పెడితే? ఆ, ఎందుకూ. దానికి ఇవి పనికిరావు. అయినా ఈ యాపిల్ నా కష్టార్జితం. నేనే తినాలి. ఎవరికో ఎందుకు పెట్టాలి? ఎర్రటి, చల్లటి యాపిల్ ముక్కలు రాజ్యలక్ష్మిని చూసి నవ్వుతున్నట్టే ఉన్నాయి పళ్ళెంలో ఎదురుగా.

ఒక్క ముక్క నోట్లో పెట్టుకుంది. రాజ్యలక్ష్మి దుఃఖం గొంతులో నిండి, ముక్క గొంతు దిగలేదు.

"వెంకటమ్మా" రాజ్యలక్ష్మి మళ్ళీ గర్జించింది.

"అమ్మా" చేతులు తుడుచుకుంటూ వెంకటమ్మ నిలబడింది.

"ఈ యాపిల్ ముక్కలు ఆ చెత్తబుట్టలో పారేయ్."

వెంకటమ్మకి అర్థం కాలేదు.

"అవును. పారేయ్. మొత్తం చెత్తబుట్టలో పారేయ్. మరీ చల్లనివి మరీ తియ్యనివి పనికిరావు. అంతే". మనసు భగభగ మండుతుంటే రాజ్యలక్ష్మి చల్లని యాపిల్ ముక్కల్ని చెత్తబుట్టలో పోయించింది. □



# రంగస్థల నటి — సీతాలత

"డ్రామా ఆర్టిస్టులకి ఎదురుగా వున్న ప్రేక్షకులే వుత్సాహం. ప్రేక్షకుల ప్రోత్సాహం లేకపోతే నాటకం రక్తి కట్టదు. మద్రాసులోని కళాసాగర్ సంస్థ నిర్వహించే నాటకాలలో పాల్గొన్నప్పుడల్లా నాకు వుత్సాహం కలుగుతూవుంటుంది. అంత పెద్ద హాలు కూడా నిండిపోయి జనంతో కిట కిట లాడుతూ వుంటుంది. నాటకం చూడడానికి వచ్చినవారు కూడా ఎంతో శ్రద్ధగా చూస్తారు. వారికి నచ్చిన సన్నివేశం ఏది కన్పించినా వెంటనే చప్పట్లతో ప్రోత్సాహపరుస్తారు. నాటకం అనేది సినిమావలె తెరపై బొమ్మల ప్రదర్శన కాదు. సజీవంగా ప్రేక్షకుల ఎదుట నిలబడి చేసే ప్రదర్శన. అటువంటప్పుడూ వెలితిగా వున్న హాలుగానీ, ప్రేక్షకుల వెర్రిచేష్టలుగానీ నిరుత్సాహం కలిగిస్తాయే తప్ప నాటకాన్ని రక్తి కట్టించడానికి తోడ్పడవు." అన్నారు ప్రముఖ రంగస్థల నటి శ్రీమతి సీతాలత.

కంకిపాడు సమీపంలోని కుందేరులో ఒక రైతు కుటుంబంలో జన్మించారు సీతాలత. చిన్నతనంలోనే ఆమె తన తండ్రిని కోల్పోయారు. తల్లి అరుంధతమ్మ గారికి ఆ రోజుల్లో రాజకీయ వుద్యమంతో సంబంధం వుండేది. చిన్న పిల్ల అనే వుద్దేశ్యంతో ఆవిడ పార్టీ చందాలకోసం, ప్రాపగండా కోసం తయారు చేసిన నాటకాలలో సీతాలత వేషాలు వేయడానికి ఒప్పుకున్నారు.

సీతాలత భర్త లక్ష్మినారాయణగారు వృత్తి రీత్యా వ్యవసాయదారులే అయినా కళా హృదయులు. వారికి ఇద్దరు పిల్లలు.

సీతాలత 1955 నుండి 57 దాకా పోరంకి లోని డా॥ రాజారావుగారి ప్రజా నాట్యమండలిలో శిక్షణ పొందారు. ఇప్పటికీ ఆమె ఆ మండలిలో కార్యవర్గ సభ్యురాలుగా వుంటున్నారు.

గత పందొమ్మిది సంవత్సరాలలో ఆమె దాదాపు వెయ్యి ప్రదర్శనలలో పాల్గొన్నారు. ఆమె పొందిన బహుమతులూ ఎక్కువే.

ఈ మధ్య కాలంలో ఆమెకు లభించిన మంచి పాత్ర 'అవినీతి! నీవెక్కడ?' అన్న నాటకం లోనిది. ఆ పాత్రకే ఆమెకు 'కళాసాగర్' వారి ఉత్తమ రంగస్థల నటి అవార్డు లభించింది.

నాటకాలలో కేవలం నటిగానేకాక దర్శకత్వ బాధ్యతను కూడా ఆమె చేపట్టారు. 'చిల్లరకొట్టు చిట్టెమ్మ', 'పరాజిత' నాటకాలకు ఆమె దర్శకత్వం కూడా వహించారు. 'పరాజిత' ఆమెకు ఉత్తమనటి, దర్శకురాలు, నిర్వహణ బహుమతులు సంపాయించి పెట్టింది!

ఆమెకు పలు బహుమతులు సంపాయించి పెట్టిన పాత్ర 'భోగిమంటలు' నాటకంలోని రజని పాత్ర.

''నటించడం కన్న దర్శకత్వం వహించడం కష్టం. అయినా నాకు అన్ని రంగాల గురించి తెలుసుకోవాలన్న కుతూహలం జాస్తి'' అంటారు సీతాలత.

సీతాలత తమ ప్రతిభను కేవలం నాటక రంగానికే కాక చలనచిత్ర రంగానికి కూడా విస్తరింపజేశారు.

'నీడలేని ఆడది' చిత్రం ద్వారా వెండి తెరకు పరిచయమైన సీతాలత యింతవరకు పన్నెండు చిత్రాలలో కూడా నటించారు. వాటిలో పేర్కొనదగినవి 'పదహారేళ్ళ వయసు', 'నాలాగ ఎందరో', 'చిలకమ్మ చెప్పింది' చిత్రాలు. ప్రస్తుతం ఆమె 'కంచికి చేరని కథ' చిత్రంలో నటిస్తున్నారు.

''సినిమాల్లో నటించాలని పెద్ద తారనై పోవాలని నేను ఎప్పుడూ అనుకోడంలేదు. అలాగని ఎవరైనా తమ చిత్రంలో నటించమని కోరితే కాదనడంలేదు. 'నీడలేని ఆడది' చిత్ర నిర్మాతలు అప్పట్లో ఆ చిత్రాన్ని నూతన తారలతో నిర్మిద్దామని అనుకున్నారు. వారు శ్రీ పూసల రచించిన 'మాతృశ్రీ' నాటకంలో నేను వేసిన తల్లి పాత్ర చూసి తమ చిత్రంలో అటువంటి పాత్రే యిచ్చారు.'' అన్నారు సీతాలత.

'సినిమా రంగంలో స్త్రీలు ప్రవేశించాలి అంటే కొన్ని త్యాగాలు చెయ్యాలి అని అంటూ వుంటారు. నాటకరంగంలో కూడా అటువంటి యిబ్బంది లేమైనా వున్నాయా?' అని అడిగితే—

''ఏమో .... మరి.... నేను అటువంటి ఇబ్బంది లేమీ ఎదుర్కోలేదు. అందులో ఈనాడు లేడీ ఆర్టిస్టుల కొరత అధికంగా వుంది. నాకు తెలిసినంతవరకూ లేడీ ఆర్టిస్టుకి గౌరవం నూటికి తొంభైనుంది ఇస్తున్నారు. ఆవిడలో ప్రతిభ అనేది ఏ మాత్రం వున్నా ఆ ప్రతిభను ఉపయోగించడానికి ప్రయత్నిస్తారే కాని మరో విధంగా ప్రయత్నించరు. వ్యక్తిగతంగా కొందరు 'చెడ్డవారు' వుండవచ్చును. అటువంటి వారు అన్ని రంగాలలో వుంటూనే వున్నారు కదా. అయినా 'త్యాగాలు' చేసి నాటకాలు వెయ్యాలన్న హీనస్థితి యింకా రాలేదు. అవన్నీ కల్పితపు మాటలు'' అని ఖండించారు సీతాలత.

ఇప్పటి నాటకరంగం పరిస్థితిని గురించి ముచ్చటిస్తూ—''ఆ రోజుల్లో మాకు ఒక ధ్యేయం అంటూ వుండేది. ఎంతో శ్రద్ధగా భయభక్తులతో చేసేవాళ్లం. అందుకే ఇవాళ కొంత కాకపోతే కొంతైనా పేరు నిలుపుకోగలిగాము. కాని ఇప్పటి నటులలో సిన్సియారిటీ కొరవడుతోంది. వారి దృష్టి ఎంతసేపూ వ్యాపార ధోరణిలోనే సాగుతోంది. ఎవరు ఎంత యిస్తే అక్కడ నటిస్తూ నాటకరంగాన్ని వ్యాపార పరం చేశారు.

అయినా మన రాష్ట్రంలో సాంఘిక నాటకాలకు ఆదరణ కూడా అంతంత మాత్రం. టిక్కెట్టుకొని చూసేవారూ అరుదే. అయితే అందుకు పూర్తిగా ప్రేక్షకులని నిందించి లాభం లేదు. ఆంధ్రదేశంలో నాటకం ఆడదామన్నా చక్కటి థియేటర్లు ఏవి? లైటింగ్, సెట్టింగ్ వసతులు ఏవి?

రాజధానిలో రవీంద్రభారతి ఎంతో బాగా కట్టారు. కాని అది ఎందరికి అందుబాటులో వుంది? తమిళనాడులో లాగా మన రాష్ట్రంలో కూడా— కనీసం పెద్ద నగరాలలోనైనా – అన్ని హంగులతో అందుబాటులో వుండేటట్లుగా థియేటర్లు వెలసిన నాడే మన నాటకరంగం బాగుపడుతుంది. మరి ఆ రోజు ఎప్పుడు వస్తుందో....ఏమో?'' అంటూ తన ఆవేదనను వ్యక్తం చేశారు శ్రీమతి సీతాలత. □

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠీ | గుజరాతీ | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| ఛ | | ಛ | ഛ | छ | છ | ଛ |
| ఛా | | ಛಾ | ഛാ | छा | છા | ଛା |
| ఛి | | ಛಿ | ഛി | छि | છિ | ଛି |
| ఛీ | | ಛೀ | ഛീ | छी | છી | ଛୀ |
| ఛు | | ಛು | — | छु | છુ | ଛୁ |
| ఛూ | | ಛೂ | — | छू | છૂ | ଛୂ |
| ఛృ | | ಛೃ | — | छृ | છૃ | ଛୃ |
| ఛౄ | | — | — | — | — | — |
| ఛె | | ಛೆ | ഛെ | — | — | — |
| ఛే | | ಛೇ | ഛേ | छे | છે | ଛେ |
| ఛై | | ಛೈ | ഛൈ | छै | છૈ | ଛୈ |
| ఛొ | | ಛೊ | ഛൊ | — | — | — |
| ఛో | | ಛೋ | ഛോ | छो | છો | ଛୋ |
| ఛౌ | | ಛೌ | ഛൗ | छौ | છૌ | ଛୌ |
| ఛం | | ಛಂ | ഛം | छं | છં | ଛଂ |
| ఛః | | ಛಃ | ഛഃ | छः | છઃ | ଛଃ |

* తమిళంలో మన చ, ఛ లకు-ఒకే అక్షరం (ச) వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

# మాటలేని వారికి మాట

రాజారావు దంపతులకు లేక లేక ఒక అమ్మాయి పుట్టింది. కళకళలాడుతూ దబ్బ పండులా వున్న తమ పాపని చూసి మురిసిపోయారు రాజారావు, పద్మ.

పాప మొదటి పుట్టిన రోజు వైభవోపేతంగా జరుపుకున్నారు ఆ దంపతులు. చుట్టుపక్కల వాళ్ళు, స్నేహితులు, సన్నిహితులు అందరూ వచ్చారు. ఆనంద సంరంభాన్ని తెచ్చారు. పాపచేత పుట్టినరోజు కేక్ కోయించింది పద్మ. అందరూ చప్పట్లు చరిచారు. చిన్నపిల్లలు రాగంతీస్తూ పాట రూపంలో పుట్టినరోజు శుభాకాంక్షలు తెలియజేశారు.

ఆ సంవత్సరం గడిచింది...మరో సంవత్సరం... దాంతోపాటే మరో పుట్టినరోజు వచ్చింది. ఈసారి పాపకి పుట్టినరోజు వేడుకలు మరింత వైభవంగా చేశారు రాజారావు దంపతులు. 'పాప పుట్టిన వేళా విశేషం....వాళ్ళ నాన్నగారికి వ్యాపారంలో బాగా కలిసొచ్చింది' అన్నారు సన్నిహితులు. అందరూ పాపను ఆశీర్వదించారు.

ఆ ఏడూ గడిచి పాప మూడో ఏట అడుగు పెడుతూ వుంటే దిగులుతో కుమిలిపోయింది పద్మ. రాజారావు పరిస్థితీ ఆ విధంగానే వుంది. వ్యాపారంలో నష్టమా అంటే అదేమీకాదు. పాప బొద్దుగా, ముద్దుగా పెరుగుతోంది. అయితే.... మరైతే....ఎందుకా విచారం?

తమ పిల్లల ముద్దు మాటలు వినాలని, వారి కొంటె చేష్టలు చూడాలని తహతహలాడని తలిదండ్రులు ఎవరుంటారు? పాప కొంటె చేష్టలైతే చూడగలిగారే కాని ముద్దుమాటలు మాత్రం వారు వినలేకపోయారు. 'పిల్లల ముద్దుమాటలే పెద్దలకు పెట్టని కర్ణాభరణాలని' అంటారు. కాని ఆ అదృష్టానికి వారు నోచుకోలేకపోయారు.

కారణం పాప పుట్టుకతోనే మూగది! ముద్దుగా, చూడ ముచ్చటగా వున్న ఆ పాప మాట్లాడ లేదంటే ఓ పట్టాన ఎవరూ నమ్మరు. కాని అది నిజం. భరింపరాని సత్యం.

డాక్టర్లు పాపని పరీక్ష చేసి ఆమె పుట్టుకతో చెవిటిదనీ, ఆ చెవిటిదనం వల్ల మనం చెప్పేది వినలేకపోవడంతో సంభాషణ లోపం ఏర్పడి మూగతనం కూడా సంప్రాప్తించిందనీ చెప్పారు.

"ఆ మాట నిజం. మన దేశంలో పుట్టుకతో మూగవారైన వారిలో నూటికి తొంభై మందికి చెవిటిదనం వల్లనే ఆ మూగతనం కలుగుతోంది. సాధారణంగా తలిదండ్రులు తమ పిల్లలు కేవలం మూగవారు మాత్రమేనని స్వరపేటికలో లోపం వల్ల ఆ విధంగా అయ్యారనీ అనుకుంటారు. కాని అటువంటివారిని చిన్నప్పుడే పరీక్షించి తగిన వైద్య సదుపాయం కల్పిస్తే కాస్త వయసు వచ్చేసరికి వారు కూడా తక్కిన వారిలాగే మాట్లాడగలుగుతారు" అంటారు ప్రముఖ స్పీచ్ పాథాలజిస్ట్ షానవాజ్.

ఆయన మద్రాసులో స్పీచ్ తెరపి ఇన్‌స్టిట్యూట్ నడుపుతున్నారు. శ్రీ మెహబూబ్ షానవాజ్ 1975లో ఈ సంస్థ ప్రారంభించారు.



రెండు సంవత్సరాల వయసుగల పిల్లలనుంచి పదేళ్ళ వయసు గల పిల్లలవరకూ ఇక్కడ చేర్చుకుంటారు. 'ఎంత చిన్న వయసులో ప్రారంభిస్తే అంత త్వరగా వారికి నయం చేయడానికి వీలవుతుంది' అంటారు షానవాజ్.

కేవలం బాలలకేకాక వికలాంగులైన పెద్దవారికి కూడా ఉన్నత విద్యలో యిక్కడ శిక్షణ తరగతులు నిర్వహింపబడుతున్నాయి.

వీరి చికిత్సకై ఈ ఇన్‌స్టిట్యూట్‌లో అత్యంతాధునిక పరికరాలు ఎన్నో వున్నాయి.

ఈ పిల్లలు భాషను ఎంతవరకు గ్రహించగలుగుతున్నారన్న అంశం దృష్టిలో వుంచుకుని, వారి మానసిక, ఆరోగ్య స్థితిగతుల ప్రభావాలను గురించి పరీక్షలు జరుపుతూ శిక్షణ యివ్వడం ప్రారంభిస్తారు. అదే ఇక్కడి ప్రత్యేకత.

ఇటువంటి వికలాంగులైన పిల్లలకి ముఖ్యంగా నేర్పవలసింది ఏమిటంటే - సాంఘిక జీవనంలో సంభాషించడానికి కావలసిన పరిజ్ఞానం. షానవాజ్ ఇన్‌స్టిట్యూట్‌లో ఈ పరిజ్ఞానాన్ని నాలుగు దశలలో నేర్పుతారు.







1. హియరింగ్ ఎయిడ్స్: మొదటి మెట్టుగా 'వినికిడి యంత్రం' తో పిల్లలు వినడం నేర్చుకుంటారు. ఈ శిక్షణ సంవత్సరంపాటు కొనసాగుతుంది. ప్రతిరోజూ ఈ పిల్లలకి వివిధ శబ్దాలను వినిపిస్తారు. పిల్లలు క్రమక్రమంగా ఆ శబ్దాలను అర్థం చేసుకుని శబ్దానికీ, శబ్దానికీ మధ్యగల భేదాన్ని గ్రహించగలుగుతారు.

2. లిప్ రీడింగ్ లేక స్పీచ్ రీడింగ్: పెదవుల కదలిక ద్వారా ఉచ్చరించిన పదాలు పిల్లలు అర్థం చేసుకునేటట్లు చేయడం. ఇందుకు ఏకాగ్రత, పరిశీలనా దృష్టి అవసరం. ఎదుటివారి పెదవుల కదలికను అతి సూక్ష్మంగా పరిశీలించడానికి నేత్రాల తోడ్పాటు ఎంతైనా వుంటుంది.

3. స్పీచ్ తెరపీ: కాస్త మాట్లాడగలిగిన శక్తి పిల్లలకు కలగగానే వారి ఉచ్చారణ, కంఠం, శబ్దాలను సరిదిద్దడం.

మరో ఎనిమిదిమంది — అందరు పిల్లలలాగానే హాయిగా మాట్లాడగలుగుతారు.

ప్రస్తుతం ఇక్కడ 32 మంది పిల్లలు వున్నారు. ఉపాధ్యాయినులు, ఉపాధ్యాయులు కలిసి 17 మంది వున్నారు. శ్రీమతి ప్రేమలత ఇక్కడ ముఖ్య ఉపాధ్యాయినిగానూ, వార్డెన్‌గానూ వుంటున్నారు.

దూర ప్రాంతాల నుండి యిక్కడికి చేరవచ్చే పిల్లల సౌకర్యార్థం హాస్టల్ వసతి కూడా వుంది. మగ, ఆడ పిల్లలకి విడివిడిగా హాస్టల్ సౌకర్యాలు వున్నాయి. శాకాహార, మాంసాహార భోజనాలు రెండూ కూడా ఇక్కడ సమకూరుస్తారు. ఇక్కడ చేరడానికి వచ్చేవారిలో చాలామంది ఆంధ్రదేశం నుంచి వచ్చినవారే.

"మా ఇన్‌స్టిట్యూట్‌లో చేరిన పిల్లలు కాస్త మాట్లాడటం నేర్చుకోగానే మాకు సన్నిహిత సంబంధం గల నర్సరీ పాఠశాలలకి ఈ పిల్లలని

# నేర్పడం

పుట్టుకతోనే మూగతనం అంటూ ప్రపంచంలో ఎక్కడా లేదు. పిల్లలు వినలేక పోవడం వల్లే మాట్లాడలేకపోతున్నారు. అటువంటి పిల్లలు వినగలిగినప్పుడు తప్పకుండా మాట్లాడగలరు; మామూలు మనుష్యులుగా జీవించగలరు.



4. లాంగ్వేజ్ ట్రైయినింగ్: పై మూడు అంశాలు అయిన తరువాత వారికి వారి వారి మాతృభాషలో సంభాషించడానికి అనువైన శిక్షణ యివ్వడుతుంది. ఆ విధంగా నేర్పించడంవల్ల శిక్షణ పూర్తయిన తరువాత ఆ పిల్లలు తమ తలిదండ్రులతో సంభాషించగలుగుతారు. అలా జరగనినాడు ఆ పిల్ల ఒంటరితనానికి గురికావడం, దాంతో వారిలో ఒక విధమైన నిస్పృహ ఆవరించడానికి అవకాశం వుంది.

అందుకే యిక్కడి పిల్లలకి వారి మాతృభాషను బట్టి ఏడు భాషలు-ఆంగ్ల, హిందీ, తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, ఉర్దూ భాషల్లో నేర్పిస్తారు.

ఈ ఇన్‌స్టిట్యూట్ ప్రత్యేకత ఏమిటంటే - ఇక్కడి పిల్లలకు 'నలుగురితో నారాయణ' అన్నట్లుగాకాక ప్రతి ఒక్కరికీ ప్రత్యేక శ్రద్ధతో నేర్పుతారు. ప్రతి ముగ్గురు పిల్లలకు ఒక ఉపాధ్యాయుని చొప్పున వుంటారు.

ఇంతవరకు పదిహేనుమంది పిల్లలు ఈ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొంది వినికిడి, సంభాషణ జ్ఞానాన్ని పొందారు. ఈ సంవత్సరం జూన్ నెలలో



పంపుతాము. అయితే సంవత్సరం పాటు ఆ విద్యార్థులను మేము పరిశీలిస్తూనే వుంటాము. వారు అక్కడ చదువుతో నెగ్గుకు రాగలుగుతున్నారా లేదా అన్నది గమనిస్తాము. వారికి వారానికి ఒకసారి అక్కడి పాఠాలలో ఇన్‌స్టిట్యూట్ ఉపాధ్యాయులు శిక్షణ యిస్తారు. మరీ అవసరమైతే రోజూ పాఠశాల విడిచిపెట్టిన తరువాత అరగంటసేపు వారికి ఆయా పాఠ్యాంశాలలో శిక్షణ యిస్తాము" అని చెప్పారు ప్రేమలత.

"మన వైపు మేనరికాలు చేసుకోవడం అనే ఆచారం వుంది. ఇలా మరీ దగ్గర రక్త సంబంధీకులను చేసుకోవడంవల్ల చాలామటుకు వికలాంగులైన పిల్లలు పుడుతూ వుంటారు. అయితే యిలా వివాహం చేసుకున్న వారిలో సాధారణంగా అందరి పిల్లలలాగే పుట్టిన పిల్లలు కూడా లేకపోలేదు. అయితే వారి సంఖ్య తక్కువే అని చెప్పాలి" అంటారు షానవాజ్.

ఆయన వివిధ ప్రాంతాలలో పధ్నాలుగు వేల మందిపై పరిశోధనలు జరిపారు. ఇలా మూగ, చెవుడు, బుద్ధిమాంద్యతగల పిల్లలలో చాలామంది దగ్గర రక్తసంబంధీకుల పిల్లలేనన్నది ఆయన పరిశోధనలలో తేలింది.

"పిల్లలకి కేవలం తరగతులలో విద్యాబోధనే కాకుండా ఆటపాటల ద్వారా కూడా శిక్షణ గరపుతాము. అందుకుతగ్గ ఆధునిక ఆటవస్తువులు మా వద్ద వున్నాయి. అట్లాగే కాస్త పెద్దయిన తర్వాత ఈ పిల్లలకి టైపు, కుట్టుపని, వడ్రంగి పని, సాంకేతిక పరికరాలలో, పనితనంలోనూ శిక్షణ యిస్తున్నాము" అన్నారు ప్రేమలత.

నత్తి వున్న పిల్లలనీ, కంఠం సరిగ్గా లేని వారినీ కూడా యిక్కడ చేర్చుకుంటారు. కొందరు మాట్లాడుతూ వుంటే రెండు గొంతులు కలిసినట్లుగా వినవస్తుంది. అటువంటివి వారం రోజుల్లో నయం చేయగలరు యిక్కడ. ఆ విధంగా చేరిన గంగాదేవి అనే యువతి ప్రస్తుతం టెలిఫోన్ శాఖలో పని చేస్తోంది!

"బొంగురు గొంతు కంఠనాళంలో వచ్చే క్యాన్సర్‌కి దారి తీసే ప్రమాదం వుంది" అన్నారు షానవాజ్.

మనదేశంలో ప్రతి మూడు వందల మందిలో ఒకరు చొప్పున ఈ విధంగా వికలాంగులుగా జన్మిస్తున్నారు. అయితే వీరిలో చాలామంది మారుమూల గ్రామాలలో నివసించడంవల్ల సరైన సదుపాయాలు లభించడం లేదు. ఆ విధంగా ఆ తలిదండ్రులు తమ పిల్లలను నిర్లక్ష్యం చేయడం జరుగుతోంది.

ఆ విధంగా మద్రాసు వచ్చి తమ పిల్లలను ఈ ఇన్‌స్టిట్యూట్‌లో చేర్పించలేని వారికి వీరు తపాలా ద్వారా కూడా పాఠాలు పంపుతారుట! అందుకు ఎటువంటి రుసుము చెల్లించవలసిన అవసరం లేదు. దీనికి వీరు 'గృహ శిక్షణ కార్యక్రమం' అని పేరు పెట్టారు. తెలుగులో కూడా ఈ పాఠాలు పంపబడతాయి.

"తలిదండ్రులు తమ పిల్లలు మూగ, చెవిటి అని తెలుసుకున్న వెంటనే తక్షణ చర్యలుగా ఈ పాఠంలోని అంశాలు ఉపయోగించడంవల్ల ఆ పిల్లలు ఎంతో మేలు పొందుతారు. ఈ పాఠ్యాంశాలు వారికి సహాయకారిగా వుండడానికి మాత్రమే పంపబడుతున్నాయి. ఆ తరువాత ఆ తలిదండ్రులు అంతగా అవసరం అనిపిస్తే మా ఇన్‌స్టిట్యూట్‌లో చేర్పించవచ్చును. కాస్త ఓర్పుతో, మరింత శ్రద్ధతోనూ తలిదండ్రులు ఈ పాఠాలలోని అంశాలను ఆచరించి పిల్లలకు నేర్పితే ఆ చిన్న సహాయమే వారి భావి జీవితాలలో ఆనందపు తొలకరిజల్లులను విరజిమ్మవచ్చును. ఈ అంతర్జాతీయ బాలల సంవత్సరంలో-ఈ చిన్నారి పాపల మోములు చిరునవ్వులు చిందిస్తూ వుంటే చూడడం కన్న కావలసిందేముంటుంది?" అంటారు షానవాజ్. □

సంప్రదించవలసిన చిరునామా :

**షానవాజ్ స్పీచ్ అండ్ హియరింగ్ ఇన్‌స్టిట్యూట్,**
**82, అయ్యావూ నాయుడు కాలనీ,**
**అమింజికరై, మద్రాసు - 600 029**

# బామ్మగారి పేజీ



## ప్రశ్నలకు జవాబులు

**పోలిశెట్టి రమణి, దంగేరు**

ఇంట్లోని వంటపొయ్యి–దక్షిణ ముఖంగా ఉండాలని కొందరు, తూర్పు ముఖంగా వుండాలని కొందరూ చెబుతున్నారు. శాస్త్రప్రకారంగా పొయ్యి ఏదిక్కున వుంటే మంచిదో మీరు చెబుతారా బామ్మగారూ?

శాస్త్రప్రకారం, అగ్ని - ఆగ్నేయ మూలలో వుండాలి. అంటే పొయ్యిని ఆ దిక్కులో ఏర్పాటు చేసుకోడం ఉత్తమం అన్నమాట.

---



**కాలిఫ్లవర్ వచ్చిగా వున్నప్పుడు తెల్లగా వుంటుంది. కాని, ఉడుకుతున్నప్పుడు ఆ తెల్ల దనం పోయి, అది నల్లగామా, గోధుమ రంగు గామా అయిపోతుంది. అలా కాకుండ, కూర కూడా తెల్లగా కనిపించ్డానికి ఓ చిట్కా వుంది. కాలిఫ్లవర్ ఉడుకుతున్నప్పుడు, ఆ నీళ్ళలో చిన్న నిమ్మకాయతొక్క ముక్క - వేసేయండి. తెలుపుదనం పోకుండా వుంటుంది.**

---

**కె. మాలతి, అమలాపురం**

ఆవులించిన వెంటనే చిటికెలు వేస్తారు; తుమ్మిన వెంటనే 'చిరంజీవ' అంటారు. ఎందుకనండీ?

ఆవులించినప్పుడు గాలిని నోటి ద్వారా లోప లికి పీలుస్తాము. అలా నోటి ద్వారా గాలిని పీల్చినప్పుడు – దగ్గర్లో వున్న ఎగిరే క్రిమి కీటకాదులు నోట ప్రవేశించే ప్రమాదం వుంది. అంచేత, అవి వెళ్ళకుండా అడ్డు తగలడం అన్నమాట. అలాగే కొందరు ఆవులించినపుడు, చెయ్యి అడ్డం పెట్టు కుంటారు కనిపెట్టారో లేదో!

'తుమ్మడం' అనారోగ్యలక్షణం గనక, ఆ క్షణంలో 'చిరంజీవ' అని ఆశీర్వదిస్తే, ఆ అనారోగ్య లక్షణం – విజృంభించకుండా వుండి–వాళ్ళ ఆరోగ్యం బాగుంటుంది.

---

**బబ్బు నాగరత్నం, కాకినాడ**

బామ్మగారూ! గుడిలో పూజారి తీర్థం ఇస్తే, ముందు తాగి, తర్వాత తలకి రాసుకుంటారు. ఎందుకనండీ?

అది తలకి రాసుకోడం కాదర్రా – దేవుడి తీర్థం తల మీద చల్లుకుంటే, దేవుడి ఆశీర్వాదం పొందినట్టన్నమాట. చల్లుకోడానికి అంత నీరు వుండదు గనక, ఆ చేతిని వూరికే అలా తలకి రాసేసుకుంటాం!

**సిహెచ్. గిరిజ, తెనాలి**

ఎక్కడికైనా బయల్దేరుతున్నప్పుడు, 'ముగ్గురు బయల్దేరకూడదు; మలడిపడదు – అంటారు. అదే శుభకార్యమైతే 'మూడు' అంకె మంచిది కాదని మరీ సందేహిస్తారు. మరి వివాహ సమయంలో వరుడు, వధువు మెడలో 'మూడు' ముళ్లు వేస్తాడు గదా–అదేమిటి మరి?

'నగస్త్యం బ్రాహ్మణత్రయ' అన్నారుట పూర్వం ఎవరో. అంటే, ముగ్గురు బ్రాహ్మ ణులు కలిసి వెళ్ళకూడదని. మరి దానికేదో పాతకాలపు కథ కూడా వుంది. అంతేగాని, ముగ్గురు కలిసి వెళ్ళకూడదు – అని ఎవరూ చెప్పినట్టులేదు. అయితే ఇలాంటివాటికి కొన్ని కొన్ని కథలు ఆధారం అవుతూవుంటాయి. అనసూయాదేవిని పరీక్షించడానికి, త్రిమూర్తులు కలిసి వెళ్ళారు గనకనే, అలా పసి వాళ్ళుగా మారిపోయారన్న ఆధారంతో ముగ్గురు కలిసి వెళ్ళకూడదన్నమాట పుట్టి వుండొచ్చు. మూడు అంకె మంచిది కాక పోవడం ఏమిటమ్మా–గుడిలో మూడు ప్రదక్ష ణాలు చెయ్యాలన్నారు; పెళ్ళయ్యాక మూడు రాత్రులు నిద్రపోవాలన్నారు; ముత్తైదువ తాంబూలాలు ఇచ్చేటప్పుడు ముగ్గురికైనా ఇవ్వాలన్నారు; ఇలాంటివన్నీ ఏమిటంటారు మరి?—

---



**గట్టిపడిపోయిన వెన్నను సులభంగా మెత్తగా చెయ్యడానికి ఓ చిట్కా వుంది. ఒక వెడల్పాటి గిన్నెలో నీళ్లుపోసి, మరిగించండి. నీళ్ళు బాగా వేడెక్కిన తర్వాత, నీళ్ళు పూర్తిగా ఒలకబోసి, ఆ గిన్నెను వెంటనే వెన్నమీద బోర్లించండి. కాస్త కూడా కరగకుండా, వెన్న మెత్త బడుతుంది.**

---

'దెయ్యాలతో రెండేళ్ళు', అన్న పేరిట గత సంచికలో ఒక వ్యాసం వచ్చింది. దానికి సంబంధించిన రెండవ వ్యాసం ఈ సంచికలో రావలసి వున్నది. కాని, స్థలాభావం వల్ల ఆ వ్యాసాన్ని వచ్చే సంచికలో ప్రచురిస్తు న్నాము. —వ. సం

నేనోసారి లండన్ వెళ్ళినప్పుడు ఒక హోటల్‌లో బసచేశాను. అప్పుడు అక్కడ ఉద్యోగం చేసే ఒక ఆఫ్రికా వనితతో పరిచయం కలిగింది. తరచూ అదీ ఇదీ మాట్లాడుకునేవాళ్ళం. ఓ రోజు మాటల సందర్భంలో "మాకు ఎలాంటి దిగులూ లేదు. ధారాళంగా పొగ త్రాగవచ్చు. మద్యపానం చేయవచ్చు. మాకు నచ్చినవారిని పెళ్ళాడవచ్చు. ఈ విషయాలలో మమ్మల్నెవరూ ఏమని ప్రశ్నించలేరు. ఇలా అని శాసించనూ లేరు. మేము స్వేచ్ఛా పక్షులం. ఏమంటారు?" అని హుషారుగా ప్రశ్నించిందామె!

ఆమె వాదన వినడానికి లోపల కాస్త బాధగా వున్నప్పటికీ పైకి ఓ చిరునవ్వునవ్వి "మీరు చెప్పింది నిజమే. మీ ఇంట్లో మీకు సర్వస్వతంత్రాలూ వున్నాయి. అందులో ఎలాంటి సందేహమూ లేదు. అయితే ఈ సమాజం గురించి మీరు ఎప్పుడైనా ఆలోచించారా? ఎక్కడో ఎందుకు? మీ విషయమే తీసుకుందాం. ఈ హోటల్లో మీరు కూడా పురుషులు చేసే అదేపని చేస్తున్నారు. అయితే వాళ్ళకన్నా మీకు తక్కువ వేతనం ఇవ్వబడుతోంది. జీతాల విషయంలో స్త్రీ పురుషుల భేదం పాటిస్తూ పక్షపాతం చూపడం న్యాయమా?" అని అడిగాను. ఆమె జవాబు చెప్పడానికి బదులు నీళ్ళు నములుతూ దిక్కులు చూడసాగింది!



# రష్యాలో స్త్రీల స్వాతంత్ర్యం

స్త్రీ స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అన్న మాటలు సర్వే సర్వత్రా అందరినోటా వినబడుతూనే వున్నాయి. కాని కనబడటం మాత్రం చాలా అరుదుగానే వుంటోంది. ఫ్రాన్స్, జర్మనీ, ఇంగ్లండ్, ఇటలీ మొదలైన దేశాలను పర్యటించాను. అక్కడి స్త్రీల స్థితిగతులను నిశితంగా పరిశీలించాను. అయితే స్త్రీ స్వాతంత్ర్యం అనడానికి ఉదాహరణ ఒక్క సామ్యవాద దేశాలలో మాత్రమే చూడగల్గాను. ముఖ్యంగా సోవియట్ భూమిలో వనితలు నిజమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వుంటున్నారు. ఇది రాజ్యాంగచట్ట పుస్తకాలలో వట్టి మాటలతో కట్టిన కోటకాదు. వారి అనుదిన జీవన విధానంలో స్త్రీలు పురుషులకు సరిసమానంగా అన్ని రంగాలలోనూ వుంటున్నారు.

అన్ని రంగాలలో కూడా స్త్రీలు వున్నారు అనగానే స్త్రీ పురుషులు అన్ని విధాలా సరిసమానం అన్న గుడ్డి పిడివాదంతో పురుషులు చేసే ప్రతి పనిలోనూ మాకు స్థానం వుండాలి—అనే మంకు పట్టుదల సోవియట్ వనితలకు లేదు. అంతేకాదు, స్త్రీలు చేయలేని పనులకు, చేయకూడని ఉద్యోగాలకు నిషేధం ప్రకటించింది సోవియట్ ప్రభుత్వం. అంటే ఆరోగ్యరీత్యా స్త్రీలకు భంగం కల్గించే వృత్తులు (ఉదా: ఎక్కువ బరువు మోయడం, గనులలో పని చేయడం మొదలైన) చట్టరీత్యా నిషేధింపబడ్డాయన్నమాట.

మాస్కోలో నేను చదువుకునే రోజుల్లో నాతో పాటు ఇస్మేనియా అన్న ఒక అమ్మాయి చదివేది. ఓసారి ఆమెతో మాట్లాడుతున్నప్పుడు మల్లయుద్ధం ప్రసక్తి వచ్చింది. "మల్లయుద్ధం ఒక క్రీడ కదా. అలాంటప్పుడు స్త్రీ పురుషుల సమానతను అనుక్షణం ఉద్ఘాటించే సోవియట్ యూనియన్‌లో వనితలను ఈ క్రీడలలో పాల్గొనడానికి అనుమతించడం లేదు? ఇది అన్యాయం కాదా?" అని ప్రశ్నించింది.

"ఛ ఛ వనితలకు మల్లయుద్ధమా? వినడానికే అసహ్యంగా లేదూ? మల్లయుద్ధం ఒక కళ కావచ్చు, అయితే అది ఆడవాళ్ళు పాల్గొనడానికి మాత్రం అనువైంది కాదు. మృదువైన స్త్రీ శరీర ప్రకృతికి ఆ క్రీడ ఆరోగ్యకరమైంది కాదు. అది అలా వుంచి స్త్రీలు మల్లయుద్ధం చేస్తూంటే చూడ్డానికి అసహ్యంగా వుండదూ?" అంటూ ఒక

ఉపన్యాసమే ఇచ్చింది మా ప్రక్కనే కూర్చున్న ఒక సోవియట్ వనిత! వనితల శారీరక ఆరోగ్యానికి మల్లయుద్ధం హానికరంగా భావిస్తున్నారు సోవియట్ విజ్ఞానవేత్తలు. అంచేతే స్త్రీలకు ఆ క్రీడలు నిషేధించారు.

అదే విధంగా ప్రసవ కాలంలోనూ ఆ తర్వాతా స్త్రీలకు అదనంగా సెలవులు మంజూరు చేయవలసి వస్తుందనో, లేదా ఆ సమయంలో వారు సక్రమంగా పని చేయలేరనే కారణంగానో, ఉద్యోగావకాశాలు తగ్గించడమో, ఉద్యోగాల నుంచి తొలగించడమో చెయ్యడం లేదు. పైగా-స్త్రీలకు ఆయా సమయాలలో అవసరమైన అదనపు సౌకర్యాలు కూడా సమకూర్చబడి వున్నాయి! స్త్రీ పురుషులు సమానం అన్న అంశం మీద - దానిని అభాసుపాలు చేయడం లేదనడానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే!

స్త్రీ స్వేచ్ఛకు తొలి మెట్టు చదువు. చదువుకున్నప్పుడే స్త్రీలలో అంచనా వెయ్యబడుతున్న తక్కువ భావం పోతుంది. అందువల్ల వనితలకు ఉచిత విద్య నిర్బంధం చేశారు సోవియట్ యూనియన్‌లో.

చదువుకుని ఆరోగ్యవంతంగా వున్న ప్రతి వనితా ఉద్యోగం చేస్తుంది. అందువల్ల ఆర్థికంగా స్వతంత్రంగా నిలబడగల్గుతుంది. విద్య, ఉద్యోగం, సరియైన వేతనం, ఇల్లు మొదలైన ప్రాథమిక అవసరాలు అందరికీ అందుబాటులో వున్నాయి. అంచేత ఆర్థికంగా స్త్రీలు పురుషుల మీద ఆధారపడవలసిన అగత్యం తప్పింది. దాంతో ఒకరికన్నా ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అన్న భావం మటు మాయమయింది!

ఉద్యోగం వున్నంత మాత్రాన జీవితానికి నిండుదనం వచ్చినట్టు కాదు. స్త్రీ మాతృత్వానికి భద్రత కావాలి కదా? ఉద్యోగం చేస్తున్నా కూడా ఆమె ఒక గృహిణి అన్న విషయం మరచిపోకూడదు. ఆమె ఇల్లును సరిదిద్దడంలోనే సంసారంలో ఆనంద సంగీతం వినడానికి సాధ్యమవుతుంది. ఆమె పిల్లల్ని కని, పెంచడంలోనే జాతిమనుగడ సాధ్యమవుతుంది. ఆమె ఉద్యోగం చేయడంవల్ల పవిత్రమైన ఈ కర్తవ్యానికి భంగం రాకూడదు కదా? ఈ విషయాలనన్నిటినీ బాగా పరిశీలించడంవల్లనే, దీనికి కావలసిన సౌకర్యాలన్నీ అక్కడ ఏర్పాటు చేయబడి వున్నాయి. పసిపిల్లలను జాగ్రత్తగా శ్రద్ధగా చూసుకోడానికి నర్సరీలు వున్నాయి. ఉద్యోగాలుచేసే స్త్రీలు తమ పిల్లల్ని అక్కడ నిశ్చింతగా వదలి వెళ్ళవచ్చు. గృహకృత్యాలను చాలా సులభంగా అతి శీఘ్రంగా చేయడానికి కావలసిన సాంకేతిక పరికరాలు ఉపయోగంలో వున్నాయి. బయట భోజన వసతి గృహాలు వున్నాయి. సరసమైన ధరలకు ఇష్టమైన ఆహారాలు అక్కడ లభించడం వల్ల ఇంటి పనులు చాలావరకు తగ్గిపోతాయి.

తమ జీవితాల గురించి "ఆడదిగా పుట్టడం కన్నా అడవిలో చెట్టయి పుట్టడం మేలు" అంటూ వుంటారు మనదేశంలో చాలామంది స్త్రీలు! అయితే "వనితగా జన్మించడమే జన్మజన్మల తపోఫలం" అంటారు మరో కవి! ఎవరిమాట ఎలా వున్నప్పటికీ సోవియట్ వనితలకు సంబంధించినంత వరకు ఈ మాట ప్రత్యక్షర సత్యం! ప్రపంచ దేశాలన్నింటిలోనూ ఇలాంటి చల్లటి పరిస్థితి పల్లవించడానికి, ఆరోగ్యకరమైన వాతావరణం ఏర్పడ్డానికి ప్రతి ఒక్కరు పాటుపడాలి మరి!

—కమలా వరదాచారి

## 37 ఏళ్ళ అపస్మారక స్థితి!

అమెరికాకు చెందిన వనిత ఎలైనే ఎస్పొసిటీ. ఫ్లోరిడాలోని 'హాలిడే' నగరంలో ఆమె ఇటీవల మరణించింది. ఆమె వయసు 43 సంవత్సరాలు. 'అయితే వింతేముంది?' అని అంటారా? నిజమే. ఆ మరణం మామూలు మరణమైతే అందులో వింతేముంది? ఆమె 37 ఏళ్ళు అపస్మారక స్థితిలో వుండి, ఆ విధంగానే తనువు చాలించింది.

ఆ విధంగా అన్నేళ్ళపాటు స్పృహ తప్పి వుండడమన్నది ప్రపంచ వైద్య చరిత్రలోనే ప్రప్రథమం. ఆ విధంగా ఆమె రికార్డు స్థాపించింది. ఎలైన్‌కి ఆమె ఆరవ ఏట ఎపెండిక్స్ ఆపరేషన్ జరిగింది. ఆ ఆపరేషన్ జరుగుతూ వుండగానే ఆమె అపస్మారక స్థితికి గురైంది. అప్పట్నించి ఆమెకి స్పృహ రానేలేదు!

ఎలైన్ తలిదండ్రులు తమ కుమార్తెను ఆసుపత్రిలో చేర్పించి వారి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడదలచుకోలేదు. ఆమె తల్లి రోజుకి నాలుగుసార్లు ఒక గొట్టం ద్వారా పోషకాహారం ద్రవ రూపంలో ఎలైన్ శరీరంలోకి ఎక్కించేది. డాక్టర్లు యింటికే వచ్చి ఆమెని పరీక్షించి వెళ్తూ వుండేవాళ్లు. ఎలైన్ తండ్రి లూయీస్ ఎస్పొసిటీ—తన కుమార్తె వైద్య పరీక్షలకు అయ్యే ఫీజు చెల్లించడానికి ఒకేసారి మూడు వుద్యోగాలు చేపట్టాడట!

## బాలికల సాహసం!

ఈ మధ్య మద్రాసు సమీపంలోని మరైమలై అడిగళ్ నగర్‌లో స్కౌట్స్ అండ్ గైడ్స్ సమావేశం జరిగింది. భారత దేశంలోని అన్ని రాష్ట్రాల నుంచి వందల సంఖ్యలో బాలబాలికలు వచ్చి ఈ సమావేశంలో పాల్గొన్నారు. అందులో రాజస్థాన్ బృందం కూడా వుంది. పదమూడువందలమంది గల రాజస్థాన్ బృందం అజ్మీర్ నుంచి ఒక ప్రత్యేక రైలులో మద్రాసు బయల్దేరారు. తీరా ఆ రైలు సికింద్రాబాద్ సమీపంలోని 'పూర్ణ' అనే ప్రాంతానికి వచ్చేసరికి ఒక దొంగ కాస్తా పెట్టెలోకి ప్రవేశించాడు. లోపలి వస్తువులన్నీ కూడా ఒక్కొక్కటిగా కిటికీ లోంచి విసిరేస్తూ వుంటే నలుగురు అమ్మాయిలు ఆ దృశ్యం చూసి కేకలు పెట్టారు. దాంతో ఆ దొంగ బెదిరిపోయి అలారం చెయిన్ లాగాడు. రైలు ఆగుతుండగా కిందకి వురికి దగ్గరలోని అడవిలోకి పారిపోయాడు. అయినా చక్కని శిక్షణ పొందిన ఆ నలుగురమ్మాయిలూ వూరుకుంటారా?—అర్ధరాత్రినీ అడవినీ ఆ బృందం లక్ష్యపెట్టకుండా నాయకురాలితోపాటు, దొంగ వెంటబడ్డారు. దొంగని వెంటాడి పట్టి పోలీసులకి అప్పగించారు.



# వైద్య సలహాలు

**- డాక్టర్**

జి. ఆర్. యస్.

నా వయసు ఇరవైమూడు సంవత్సరాలు. నేను మరీ లావుగా వుండడంవల్ల శరీర వ్యాయామం చేస్తున్నాను. దానితోపాటు ఆహారాన్ని కూడా బాగా తగ్గించేశాను. క్రొవ్వు పదార్థాలను తీసుకుని రెండేళ్ళయింది. ఒళ్ళేమో చాలా తగ్గింది. సన్న బడింది. అయితే ఏదైనా కాస్త కష్టమైన పనిచేస్తే నడుము నొప్పి పెడ్తుంది. ఒక నరం మరీ బాధగా వుంటుంది. ఆహారం ఎక్కువగా తీసుకుంటే మళ్ళీ ఎక్కడ లావై పోతానో అని భయంగా వుంది. ఏం చెయ్యాలో తోచడం లేదు. దయచేసి చెప్ప గలరు.

**మీరు క్రొవ్వు పదార్థాలు ఎక్కువగా వుండే ఆహార పదార్థాలు మాత్రం మానివేసి మిగతా బలవర్ధక మైన ఆహారాలు ఎక్కువగా తీసుకోవాలి. అయినా ఒకేసారి ఆహారం తగ్గించడం మంచిది కాదు. బి కాంప్లెక్స్ మాత్రలు వాడండి.**

యస్. యస్.

నాకు ఇరవై ఆరు రోజులకోసారి ఋతుస్రావం అవుతుంది. ఆ సమయంలో జ్వరం వస్తుంది. ఇందువల్ల నా వైవాహిక జీవితానికి ఏమైనా హాని కల్గుతుందా? నావయసు పందొమ్మిది సంవత్సరాలు.

**మూత్రంలో ఇన్‌ఫెక్షన్ వున్నట్టయితే ఋతుస్రావ దినాలలో జ్వరం వస్తుంది. అది మూత్ర పరిశోధన చేసి చూస్తే తెలిసిపోతుంది. దీనికి పెళ్ళి చేసుకోడానికి, సంతాన ప్రాప్తికి ఎలాంటి సంబంధం లేదు!**

ఆర్. యస్.

నా పెదవుల మీద ఎరుపు తెలుపు కలిసినట్టు పెద్ద పెద్ద మచ్చలు ఏర్పడ్డాయి. చూడ్డానికి నాకే అసహ్యం వేస్తోంది. వీటిని పోగొట్టడానికి ఏం చెయ్యాలో చెప్పగలరు.

**వెంటనే చర్మవ్యాధుల వైద్యుని సంప్రదించి సరైన చికిత్స పొందండి. జాప్యం చేశారంటే ఆ మచ్చలు శరీరంలోని ఇతర భాగాలకు ప్రాకే ప్రమాదం వుంది!**

ఎ. కె.

నాకు పెళ్ళయి ఐదేళ్లు అవుతుంది. ఇంకా పిల్లలు కలుగలేదు. గత ఐదారు మాసాలుగా ఋతుస్రావానికి ఒక వారం ముందు నుంచి ఎడమ వక్షోజం బాధ పెడ్తోంది. ఋతుస్రావం అయిన తర్వాత బాధ తనంతట అదే తగ్గిపోతుంది. దీనికి నివారణం ఏమిటి డాక్టర్?

**ఋతుస్రావం కావడానికి పదిరోజుల ముందు నుంచి ఆహారంలో ఉప్పు కాస్త తగ్గించి చూడండి. మంచి ఫలితం వుంటుంది.**

వి. కె.

నాకు వైట్ డిస్చార్జి కాకుండానే ఋతుస్రావం అవుతుంది. బ్లీడింగ్ కూడా రెండు రోజులే వుంటున్నది. ఇందువల్ల గర్భధారణకు ఏమైనా ఆటంకం ఏర్పడుతుందా?

**ఋతుస్రావానికి ముందు తెలుపు పడాలని ఏమీ లేదు. రెండు రోజులు మాత్రమే రక్తస్రావం వుండడంవల్ల ఫరవాలేదు. బెంగపడవలసిన అవసరం లేదు. అయినా మీ గర్భాశయ ఆరోగ్యం, అండోత్పత్తి సక్రమంగా జరుగుతోందా లేదా అన్న విషయాలు వైద్య పరిశోధనచేసి తెలుసుకోవడం ఎంతైనా అవసరం.**

యం. ఎల్.

లైంగిక వ్యాధి లక్షణాలు, చిహ్నాలు ఏమిటి? వాటివల్ల వాటిల్లే ప్రమాదాలేమిటి? ఇవి ఎందువల్ల ఎటువంటి వాళ్ళకు వస్తాయి? ఎలాంటి చికిత్స చేస్తారు? కాస్త వివరంగా చెబుతారా డాక్టర్?

**మామూలుగా ఈ వ్యాధి వుండేవాళ్ళతో లైంగిక సంపర్కం పెట్టుకోవడంవల్ల ఇది అంటుకుంటుంది. ఇందులో వివిధ రకాలు వున్నాయి. ఇందువల్ల ప్రసవ మార్గంలో పుండు, వాపు యేర్పడవచ్చు, ఎక్కువగా తెలుపుపడటం కూడా కద్దు. మూత్రంలో ఇన్‌ఫెక్షన్ యేర్పడుతుంది. ప్రారంభ దశలోనే దీనిని కనిపెట్టి తగిన చికిత్స పొందాలి. అలా కాకపోతే వ్యాధి గర్భాశయానికి ప్రాకి, ఋతుస్రావానికి సంబంధించిన అనేక వ్యాధులు రావడానికి కారణం అవుతుంది. ఒక్కొక్క జబ్బుకు ఒక్కోరకం చికిత్స వుంటుంది. లైంగిక వ్యాధా? కాదా? అన్న విషయం - రక్త పరిశోధన, తెలుపు పరిశోధన. VDRL Test మొదలైన వైద్య పరిశోధనల ద్వారా తెలుసుకోవచ్చు.**

ఆర్.

నాకు ఇరవై సంవత్సరాలు. పోయిన సంవత్సరం ఋతుస్రావ సమయంలో రెండు రోజులు మాత్రమే రక్తస్రావం వుండేది. అయితే ఇప్పుడు ఒకరోజు మాత్రమే వుంటున్నది. రోజు రోజుకూ క్రింది కడుపు పెద్దదవుతూంది. శిరోజాలు కూడా రాలిపోతున్నాయి. ముఖం నిండా మొటిమలు వస్తున్నాయి. నా బరువు తగ్గడానికి, కడుపు చిన్నది కావడానికి, మొటిమలు రాకుండా వుండడానికి మీరేమైన సలహాఇస్తారా?

**ఋతుస్రావం తక్కువ అయిందంటే - Projesterone మాత్రలు వాడకూడదు. తాజా గాలి వీచే ప్రదేశంలో Abdominal exercise చేయడం చాలా మంచిది. ఐరన్ మాత్రలు వాడవచ్చు. ముఖానికి ఎక్కువ మేకప్ వేసుకోకూడదు. అప్పుడప్పుడు నిమ్మరసం, పాల మీగడ పట్టించి శుభ్రంగా కడుక్కోవాలి. మీ శరీరంలో oestrogen తక్కువగా వుండవచ్చు. వైద్య పరీక్ష చేసుకున్న తర్వాత డాక్టర్ సలహా మేరకు oestrogen మాత్రలు వాడండి.**

జి. ఆర్.

చిన్నప్పటి నుంచీ నాకు కఫం ఎక్కువ దగ్గేటప్పుడు కఫం ఎక్కువగా వస్తూంది. రక్త పరీక్ష చేసినపుడు- ఈసినోఫీలియా యాభై శాతం వున్నట్టుగా తెలిసింది. ఇటీవల చాలా చిక్కిపోయాను. నా వయసు ముప్పైమూడు సంవత్సరాలు. దగ్గు, కఫంతగ్గడానికి ఏం చెయ్యమంటారు డాక్టర్?

**వైటమిన్ 'సి' మాత్రలు వాడితే ఈసినోఫీలియా కొంతవరకు తగ్గుతుంది. కఫం ఎక్కువగా వున్నట్టయితే - టి. బి. లక్షణాలు ఏమైనా వున్నాయో అని - వైద్య పరిశోధన చేసి తెలుసుకోవాలి. ఐతే, అలా ఏమైనా వుంటే బెంగపడి పోనవసరం లేదు. టి. బి. నయం చేయడానికి ఇప్పుడు మంచి మంచి మందులున్నాయి. చికిత్స పొందితే చాలా సులభంగా నయమై పోతుంది.**

మౌనంగా గ్లాసందుకొని వెళ్ళిపోతున్న హర్ష వైపు చూస్తూండిపోయింది శోభాదేవి.

ముఖం కడుక్కుని అలాగే స్నానం కానిచ్చి వచ్చిన రావుగారు బీరువా దగ్గరకు వెళ్ళి ఏవో చేతికందిన బట్టలు తగిలించుకుని గబగబా పైకి వెళ్ళారు.

నిజానికి ఆ రోజు పైకి వెళ్ళాలని, శోభకు ముఖం చూపించాలనీ లేదు. కానీ శోభ అలవాటుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే బాధపడుతుందని పైకి వెళ్ళారు.

మంచం దగ్గరగా వేసి వున్న చెయిర్లో కూర్చున్న రావుగారు శోభ ముఖంలోకి చూడలేకపోతున్నారు. ఇంతలో హర్ష ఓ ప్లేట్లో ఇడ్లీ పెట్టుకుని ప్రవేశించింది.

"ఏమిటి హర్షా! మీ అంకులింకా టిఫిన్ చేయలేదూ? ఏమిటి ఇవ్వాళ అదోలా వున్నారు? ఆరోగ్యం బావుందికదా!" అంది ఆదుర్దాగా.

తను అనారోగ్య పరిస్థితిలో వుంకీ కూడా తన ఆరోగ్యం గురించి ఆరాటపడుతున్న శోభకు తనెంత ద్రోహం చేశాడు? ప్లేట్ టీపాయ్ మీద పెట్టి మౌనంగా క్రిందికెళ్ళిపోతున్న హర్షవైపూ రావుగారి వైపూ చూస్తూ—

"ఏం జరిగిందండీ! హర్ష కూడా అదోలా వుందేం? గలగలా నవ్వుతూ మాట్లాడేది. మూర్తీభవించిన మౌనంలా వుందేమిటి యివాళ ప్రొద్దుటి నుంచీ? దినేష్ దగ్గర్నుంచేమైనా కబు రొచ్చిందా?" ఆత్రుతగా ప్రశ్నిస్తున్న శోభాదేవి వైపు ఓసారి చూసి తల దించుకుంటూ "నో! నో! అలాంటిదేమీ లేదు శోభా! నాకు కొంచెం తల నొప్పిగా వుంది. ఇవాళ ఆఫీసుకు త్వరగా వెళ్ళాలి. హర్ష ఒకవేళ వాళ్ళ నాన్నగారి మీద బెంగపెట్టుకుందేమో! పోనీ వాళ్ళింటికి పంపిద్దామా?" అంటున్న రావుగారి వైపు విచిత్రంగా చూసింది శోభాదేవి.

అంతలోనే పర్దుకుంటూ లేచి నిలబడి—

"శోభా! మరి నే వెళ్ళిరానా? అర్జంట్ పని వుంది." అంటూనే సమాధానం కోసం చూడకుండా గబగబా వెళ్ళిపోతున్న రావుగారి వైపు చూస్తూ ఆలోచనలో పడిపోయింది శోభాదేవి.

ఇన్ని సంవత్సరాల్లో ఎప్పుడూ రావుగారు తన సమక్షంలో అంత నిశ్శబ్దంగా, అన్యమనస్కంగా



వుండటం చూసి ఎరుగదు. ఆఫీసు టైమ్ అవుతుందని శోభాదేవి గుర్తు చేస్తున్నా అల్లరిగా మరింత లేట్ చేయడానికి ప్రయత్నిస్తూండేవారు.

అలాంటిది ఈ రోజు అలవాటుకు విరుద్ధంగా తొందరగా ఆఫీసుకు వెళ్ళాలంటూ వెళ్ళిపోయిన రావుగారిలో ఏదో విపరీతమైన మార్పు గోచరిస్తోంది.

అది...అది....తన అనారోగ్యాన్ని గురించిన బాధా! లేక, దినేష్ గురించేమైనా చెడువార్త...

## పెద్దకథ:

# తెలిసి చేసిన పాపం 3

భగవాన్! వద్దు. నాకంతటి శిక్ష విధించకు. నేను నా దినేష్ను గురించిన ఎలాంటి చెడ్డ వార్తా వినడానికి సిద్ధంగా లేను. వాడు సలక్షణంగా నా సమక్షంలో వుండేలా అనుగ్రహించు తండ్రీ శ్రీనివాసా!....అంటూ మనసులోనే ఏడుకొండల వాడిని వేడుకుంటూ చంపలప్రక్కగా కారిపోతున్న కన్నీటిని తుడుచుకుంటూ అలాగే వుండిపోయిన శోభాదేవి వున్నట్టుండి ఒక్కసారిగా "హర్షా! హర్షా!" అంటూ కేక వేసింది. మళ్ళీ అంతలోనే ప్రక్కనే వున్న బెల్లు జ్ఞాపకం వచ్చి ప్రెస్ చేసింది.

హడావుడిగా పరుగెత్తుకువచ్చింది పని మనిషి మా లక్ష్మి.

"ఏమ్మా! ఏం కావాలి."

"లక్ష్మి! హర్ష ఏం చేస్తోంది?

"అమ్మాయిగారు గదిలో పడుకొని వున్నారమ్మా!" అంది లక్ష్మి. "ఈ టైములో పడుకోవడమేమిటి?" అంటున్న శోభాదేవి వైపు చూసి—

"ప్రొద్దుట నుంచీ కాఫీ కూడా తాగలేదమ్మా! తల నొప్పిగా వుందని పడుకున్నారు."

"సరే నువ్వు వెళ్ళి హర్షను దినేష్ ఆల్బమ్ పట్టుకొని నేను పైకి రమ్మన్నానని చెప్పు. హర్షకు కాఫీ, టిఫిన్ పైకి తీసుకురా" అంటూ దిండు మీదకు వాలిపోయింది శోభాదేవి.

లక్ష్మి గబగబా క్రిందికి వెళ్ళిపోయింది.

మరో పావుగంటకు ముఖం శుభ్రంగా కడుక్కుని ఫ్రెష్గా తయారయి నవ్వుతూ దినేష్ ఆల్బమ్ పట్టుకొని పైకి వెళ్ళింది హర్ష.

ఆల్బమ్ శోభాదేవి మంచం మీద పెడుతూ తను ప్రక్కన కూర్చుని—

"ఏం ఆంటీ! యింకో నాలుగు రోజుల్లో చూడబోతున్న కొడుకు మీద బెంగగా వుందా? మళ్ళీ అబ్బాయిగారి అల్లరి ఫొటోలన్నీ చూసుకుంటే తప్ప మనసు కుదుటపడదన్న మాట!" అంది నవ్వుతూ. ఎంత మామూలుగా ఆ మాటలు అనడానికి ప్రయత్నించినా హర్ష గొంతులో ఏదో అడ్డంపడ్డట్లే వుంది.

అయితే మళ్ళీ హర్ష నవ్వుతూ ఆల్బమ్ తీసుకు రాగానే తృప్తిపడ్డ శోభాదేవి హర్ష గొంతులోని ఆ చిన్న మార్పును గమనించే స్థితిలో లేదు. కుదుటపడ్డ మనసుతో ఆల్బం అందుకొని ఫొటోలు చూస్తూనే—

"హర్షా! నువ్వు టిఫిన్ చేశావామ్మా? తల నొప్పిగా వుందన్నావట. మీ అంకుల్ రూమ్లో టాబ్లెట్స్ వుంటాయి, ఓ టాబ్లెట్ వేసుకొని కాఫీ త్రాగు తల నొప్పి సర్దుకుంటుంది" అంది. 'టాబ్లెట్తో చల్లారే ఆవేదన కాదు ఆంటీ! నేను మీకు తీరని ద్రోహం చేశాను. అయినా ధైర్యంగా మీముందు యింకా నిలబడి వున్నానంటే నేను మనిషిని కాదు. నాలో ఏదో పిశాచం ఆవహించి వుంది. అదే నాకాళ్ళ త్తినిస్తోంది. అదే నన్ను వశపరచుకుంది....అంకుల్ మీద నాకు కలిగిన భావానికి ఏమని పేరు పెట్టాలో నాకే తెలీడం లేదు. ఆరాధన అననా, అనురాగం అననా? అదేమీకాదు కేవలం వయసు కలిగించిన వాంఛ అననా? ఏది అన్నా అనకపోయినా జరిగింది సరిదిద్దుకునే అవకాశం లేదు. ఈ ఆలోచనలన్నీ మనసులో సుళ్ళు తిరుగుతుంటే మౌనంగా ఆల్బమ్లోని బొమ్మలవైపే చూస్తూ కూర్చున్న హర్ష దగ్గర నుంచీ జవాబు రాకపోవటంతో తలెత్తి చూసిన శోభాదేవి—

ఆల్బంలోకి గుచ్చి వున్న హర్ష చూపులకు మరో అర్థాన్ని వూహించుకొని—

"హర్షా! ఆల్బమ్ చూస్తే నా మనసు కుదుటపడటం ఏమోగానీ, నీ తలనొప్పి పారిపోయి నట్లుంది. ఇంక మాత్ర అవసరం లేదుకదూ!" ఇంతలో లక్ష్మి తీసుకొచ్చి పెట్టిన టిఫిన్ కాఫీ చూసి.

"అదుగో ముందు టిఫిన్ చెయ్యి. తీరిగ్గా తర్వాత మాట్లాడుకుందాం!" అంటున్న శోభాదేవి మాటకు ఎదురు చెప్పలేక బలవంతంగా టిఫిన్ నోట్లో కుక్కుకోక తప్పలేదు హర్షకు. ఆ తర్వాత లక్ష్మి యిచ్చిన కాఫీ కూడా త్రాగక తప్పలేదు.

ఖాళీ ప్లేటూ కప్పు తీసుకొని లక్ష్మి క్రిందకు వెళ్ళిపోయింది. హర్ష చేయి తన చేతిలోకి తీసుకుంటూ శోభాదేవి దిగులుగా అన్నారు.

"హర్షా! ఎందుకో యివాళ మీ అంకుల్ చాలా మూడీగా వున్నారు. మాకు పెళ్ళైన యిన్ని



సంవత్సరాల్లో ఆయన్ని నేనెప్పుడూ ఇంత దిగులుగా చూడలేదు. నా అనారోగ్యం ఆయన్ని చాలా బాధ పెడుతోంది. నేను లేచి తిరగగలుగు తానో లేదోననే అనుక్షణం ఆలోచిస్తూ మథనపడు తున్నారనుకుంటాను. దినేష్ వస్తే ఇంట్లో మళ్ళీ సందడివస్తుంది. వాడితో వచ్చేపోయే ఫ్రెండ్స్‌తో హడావుడిగా వుంటుంది యిల్లు. అప్పుడాయనకు నన్ను గురించిన బాధ అంత వుండదు. దేవుడు అనుగ్రహిస్తే అప్పటికి నేను లేచి తిరగగలుగుతాను.

ఒకవేళ........ఒకవేళ అలాకాక నా కాలు శాశ్వతంగా యిలాగే వుంచేస్తే నన్ను............ మీ అంకుల్‌నూ, దినేష్‌నూ ఎవరు చూసుకుంటారు? వాడు వచ్చేసరికి అన్నీ ఎవరు అమర్చి పెడతారు? ఇన్ని సంవత్సరాల తర్వాత యింటికి వస్తున్నవాడికి ఎంత బాధగా వుంటుంది?" అంటున్న శోభాదేవి కళ్ళవెంట జలజలా కురుస్తున్న కన్నీటిని తన పమిటచెంగుతో అద్దుతున్న హర్ష కళ్ళు కూడా అంతకు రెట్టింపుగా వర్షించాయి.

"ఆంటీ! మీరు బాధపడకండి నేను లేనూ, అన్నీ నేను చూసుకుంటాను. అయినా మీ కాలు బాగైపోతుంది. మీరు అనవసరంగా మనసు పాడు చేసుకోకండి. దినేష్‌కు ఏమేం కావాలో చెప్పండి. అన్నీ స్వయంగా నేనే సిద్ధం చేస్తాను. మీరుండి చేసినంత శ్రద్ధగా అన్నీ చేస్తాను" అంటున్న హర్ష గొంతు బాధతో మెలితిరగడం గమనించిన శోభాదేవి—

"పిచ్చి పిల్లా ఎందుకలా బాధపడతావు? నాకు తెలుసు. నువ్వుంటే నేను నిశ్చింతగా వుండవచ్చు. ఎవర్ని గురించీ నేను బాధపడవలసిన పనిలేదు. ముఖ్యంగా యింక దినేష్‌ను గురించిన దిగులు కూడా నాకు లేదు. ఈ బంగారుబొమ్మ మా ఇంట్లో అడుగు పెట్టిన రోజే అనుకున్నాను. ఏదీ - కళ్ళు తుడుచుకో" అంటూ నవ్వుతూ చెయ్యి ముందుకు చాపి హర్ష కన్నీళ్ళు తుడవడానికి ప్రయత్నించిన శోభాదేవి గుండెల మీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది హర్ష.

పాటిబండ్ల
విజయలక్ష్మి

ఖంగారు పడిన శోభాదేవి బలవంతంగా హర్షను పైకి లేపుతూ—

"ఎందుకమ్మా అలా ఏడుస్తున్నావు? మీ నాన్న గారేమైనా అన్నారా? అంకులేమైనా పొరపాటుగా మాట్లాడి నొప్పించారా? లేక, నేనన్న మాటలు నిన్ను బాధ పెట్టాయా?" అన్నారు కళ్ళు తుడుస్తూ.

"లేదాంటీ! ఎవరూ ఏమీ అనలేదు. నాకే.... నాకే....విపరీతంగా తలనొప్పిగా వుంది. అందుకే.... అందుకే...." అంటూ వెక్కుతున్న హర్షవైపు ఆప్యాయంగా చూస్తూ చిన్నగా నవ్వి—

"నువ్వు మా దినేష్‌కు తోడుపోయినదానివే. ఏ కొంచం తలనొప్పి వచ్చినా యింట్లో అందర్నీ ఖంగారు పెట్టేస్తాడు. గొడవ గొడవ చేసేస్తాడు. పిచ్చీ! తలనొప్పి కెవరైనా ఏడుస్తారా ఛా! ఛా! లే, లేచి ముఖం కడుక్కొని ముందు క్రిందకెళ్ళి టాబ్లెట్ వేసుకొని మరో కప్పు కాఫీ త్రాగి కాసేపు పడుకో. బాగా పుస్తకాలు చదివుంటావు. మీ అంకుల్ రానీ చెబుతాను. ఆ పుస్తకాల బీరువాకు ఓ తాళం బిగించమని" అని శోభాదేవి అంటుండగానే "వెళతాను ఆంటీ. కాసేపు పడుకుంటాను" అంటూ క్రిందకు పరుగెత్తింది హర్ష.

వెళ్ళి బెడ్ మీద పడ్డ హర్ష చాలాసేపు అలాగే ఏడుస్తూ వుండిపోయింది. ఆ తర్వాత అలాగే పడుకొని నిద్రపోయింది. లేచేటప్పటికి సాయంత్రమైంది. ఖంగారుగా లేచి వంటగదివైపు పరుగెట్టి "ఆంటీకి అన్నం పెట్టారా? నన్ను లేపలేదేం!" అంటూ లక్ష్మిని అడిగింది ఖంగారుగా.

"అమ్మగారు మిమ్మల్ని లేపొద్దన్నారమ్మా! తల నొప్పిగా వుందని పడుకున్నారని చెప్పారు. అమ్మగారికి అన్నం పెట్టేసి, కారియర్ ఆఫీసుకు పంపాము. మీరు ఖంగారు పడకండి. మధ్యాన్నం భోజనం కూడా చెయ్యకుండా అలాగే పడుకుండిపోయారు. భోం చేస్తారామ్మా! కాఫీ కలిపి యివ్వనా" అంది వంటామె ఆప్యాయంగా హర్ష వైపు చూస్తూ.

"నాకిప్పుడు ఏమీ వద్దండీ! ఆంటీకి కాఫీ కలిపి యివ్వండి నాలుగైపోయింది. అంకుల్ కూడా వచ్చే టైమైపోయింది. ఏదైనా టిఫిన్ రెడీ చేయండి" అంటూ బాత్ రూమ్‌లోకి వెళ్ళిపోయింది హర్ష.

హర్ష వాలకం చూస్తే జ్వరమొచ్చినదానిలా కనిపిస్తూంది. ఎర్రగా మారిన కళ్ళు వుబ్బి మరింత పెద్దగా కనిపిస్తున్నాయి. ముఖమంతా కందిపోయినట్లుంది. "ఇవాళ ఈ అమ్మాయికేమైంది? ప్రొద్దుటి నుంచీ అదో మాదిరిగా వుంది?" అనుకుంటూనే స్టౌ అంటించి కాఫీ కలిపే ప్రయత్నంలో పడింది వంటామె.

మరో పదిహేను నిముషాల్లో ఫ్రెష్‌గా తయారయి "లక్ష్మీ! కాఫీ!" అంటూ హుషారుగా వచ్చిన హర్షను చూసి ఓ క్షణం విస్తుపోయి చూస్తుండిపోయిన వంటామె—కాఫీ కప్పు హర్ష చేతిలో పెట్టింది నవ్వుతూ.

కాఫీ తీసుకుని పైకి వెళ్ళిన హర్ష శోభాదేవి దగ్గిర కూర్చుని "ఆంటీ! మీ టాబ్లెట్‌తో తలనొప్పి ఎగిరి పోయింది. భలే నిద్రపోయాను" అని నవ్వుతూ కాఫీ అందించింది.

"కుంభకర్ణుడి చెల్లెల్లా నిద్రపోయుంటావని నీ కళ్ళూ, ముఖమే చెబుతున్నాయి. అందుకే మధ్యాహ్నం లక్ష్మి వచ్చి "లేపమంటారామ్మా?" అంటే వద్దని చెప్పాను. ఇప్పుడు ఫ్రెష్‌గా లేదూ! కాఫీ తాగావా? మీ అంకుల్‌తోపాటు తాగాలని అలాగే వూరుకున్నావా?" హర్ష బదులు చెప్పే లోపలే లక్ష్మి మరో కప్పు పట్టుకొని పైకి వచ్చి—

"ఈ రోజుకు అమ్మగారితో తాగండమ్మా! మధ్యాహ్నం భోజనం కూడా చెయ్యలేదు. అయ్యగారొచ్చాక మరోసారి కాఫీ తాగొచ్చులెండి!" అంటూ కప్పు హర్ష చేతిలో పెట్టి నవ్వుతూ శోభాదేవి వైపు చూసి క్రింది కెళ్ళిపోయింది.

ఇద్దరూ కాఫీలు తాగి ఏవో మాట్లాడుకుంటూండగానే కారు హారన్ వినిపించింది. రోజూ ఆ హారన్ వినగానే నాదస్వరం విన్న నాగులా లేచి క్రిందకు పరుగెట్టే హర్ష ఆ రోజెందుకో లోలోపల వణికిపోతూ మౌనంగా ప్రక్కనవున్న వీక్లీ చూస్తూ కూర్చుంది.

శోభాదేవికి హర్ష కదలకపోవడం కొంత ఆశ్చర్యం కలిగించినా పాపం! నీరసంగా వుందేమో! భోజనం చేయలేదుగదా! అనుకొని వూరుకున్నారు. మరో పది నిముషాల్లో మెట్లమీద చప్పుడు కావడంతో వులికిపాటుగా లేచి నిలబడింది హర్ష.

"నుంచున్నావేం హర్షా! కూర్చో. ఎవరొస్తారు? మీ అంకుల్ పైకి వస్తున్నారు చప్పుడు ఆ మాత్రం గ్రహించలేవూ" అంది నవ్వుతూ. నవ్వడానికి ప్రయత్నిస్తూ "తెలుసు ఆంటీ!" గబగబా గదిలోనుంచీ బయటకు వెళ్ళిపోయింది.

ఎదురుగా వచ్చిన రావుగా- వైపు వద్దనుకుంటూనే తలెత్తి చూసింది. ఆయన హర్షను చూడనట్లే గబగబా మెట్లెక్కి శోభాదేవి వున్న గదిలోకి వెళ్ళిపోయారు.

గబగబా క్రిందకు వెళ్ళి టిఫిన్ రెడీ చేయించి, లక్ష్మిని పిలిచి తీసుకెళ్ళి పైన యిచ్చి రమ్మంది. "మీరు తినండమ్మా" అంటే "నాకు తినాలనిలేదు లక్ష్మి వంట్లో బావుండలేదు. ఆంటీ అడిగితే నేను పడుకున్నానని చెప్పు" అంటూ గబగబా గదిలోకి వెళ్ళిపోయింది.

మరో గంటకు రావుగారు క్రిందకు దిగిరావడం తెలుస్తూనే వుంది హర్షకు. అంతక్రితమే లక్ష్మి టిఫిన్ ప్లేట్లు పెట్టినవి పెట్టినట్లే క్రిందకు తీసుకు రావడం చూసింది. ఏమిటని అడిగితే "అయ్యగారు వద్దన్నారమ్మా! అమ్మగారు కూడా తినలేదు" అంది.

మరో అయిదునిమిషాలకు హర్ష వున్న గదిలోకి వచ్చిన లక్ష్మి—

"అమ్మాయిగారూ! అయ్యగారు మధ్యాహ్నం భోజనం కూడా సెయ్యలేదమ్మా. కారియర్‌లో పెట్టినయి పెట్టినట్లే వున్నాయి. ఆయనేందో బ..ా దిగులుగా కనబడుతున్నారు. మీరైనా టిఫిన్ తీసుకెళ్ళి ఇయ్యండమ్మా! తింటారేమో" అంది.

మారు మాట్లాడకుండా టిఫిన్ ప్లేట్ తీసుకుని రావుగారి గదిలో అడుగు పెట్టింది.

ఎయిర్‌కండిషన్డ్ గదిలో అడుగు పెట్టగానే ఆ చల్లదనం, తనువును తాకటమే కాకుండా మనసులోకి కూడా పాకినట్లయింది. అంతవరకూ ఏదో తెలీని అశాంతితో భగభగమండుతున్న మనసుకు ఆహ్లాదకరంగా అనిపించింది ఆ వాతావరణం.

రావుగారు గదిలో లేరు. బాత్‌రూమ్‌లో నుంచి నీళ్ళ చప్పుడు వినిపిస్తోంది. బహుశా స్నానం చేస్తుండి వుంటారు. ప్లేటు టీపాయ్ మీద పెట్టి మంచం మీద కూర్చుని దిండు మీదకు ఒరిగి ప్రక్కనే వున్న పుస్తకం చేతిలోకి తీసుకుంది. నెమ్మదిగా పేజీలు తిరగేస్తూ చదువుతున్న హర్ష క్రమంగా అందులో లీనమైపోయింది.

"హర్షా" రావుగారు గట్టిగా వేసిన మూడో కేకకు వులిక్కిపడి లేచి కూర్చుంది హర్ష.

"హర్షా! మళ్ళీ....మళ్ళీ....నా గదిలోకి ఎందుకొచ్చావ్ హర్షా! నన్నెందుకు ఇలా చిత్ర వధ చేస్తున్నావు?" రావుగారి కంఠంలో ఆవేశం కంటే ఎక్కువ ఆవేదనే ధ్వనించింది.




## దీప్తి

(కవితాసంపుటి)

**[రచన: కిరణ్మయి; ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్, సికిందరాబాద్ వెల: రూ. 3-00.]**

ఈ కవితా సంపుటికి శ్రీ సి. నారాయణరెడ్డి, శ్రీ కుందుర్తి, శ్రీమతి నాయని కృష్ణకుమారిగార్లు రాసిన పీఠికలున్నాయి. చదవాలని అనిపించేటట్లు ఉన్నాయి. కవి హృదయం తన కవిత్వంలో కంటే, మరొకరి కవిత్వాన్ని ఆశీర్వదించేటప్పుడు మరింత వ్యక్తమౌతుందనిపిస్తుంది ఈ పీఠికలు చదివితే.

"పుస్తకం చదివే తీరికలేని జీవన వ్యాసంగంలో పీఠికలు చదివి తృప్తిపడే మహాత్ములు ఎంతమంది?" అన్నారు నాయని కృష్ణకుమారి. నిజమే. కానీ, పీఠికల్లో ఇంత కవిత్వమున్నప్పుడు ఆ తృప్తి ద్విగిణీకృతమై, కవితను చదివిస్తుంది.

ఈ కవిత్వంలో నిర్దుష్టమైన వ్యక్తిత్వం కనిపిస్తోంది. చెప్పగలిగిన విషయాన్ని ఆదేశంగా మార్చగల నేర్పుంది.

"కలవారికలికిలా
'నల' అడుగుపెట్టింది." —

ఇది ఒక్కటి మాటలగారడి.

"పక్కలకు చూడకు
చూపులవి జాగ్రత్త-
తెల్లతెల్లని, ఆ పరదాల వెనకాల
శాపాల మడుగులుంటాయి జాగ్రత్త" —

ఇందులో అందముంది. కవిత్వముంది. ఆలోచనుంది.

"సమత్వం ఒక నినాదంగా
ధరిస్తే అది అపాయం."
"ప్రగతి గీతం పాడబోయి
మేలుకొలుపుకు జోలపాడకు
క్రాంతి మార్గం వెదకబోయి
భ్రాంతి ముసుగున ముఖం దాచకు." —

ఈ కవితలో హెచ్చరిక ఉంది. ఒక రకమైన విసుగు ఉంది. కవిత్వంలో స్థైర్యం, నినాదం ఉంటే అది ఆదేశం అవుతుంది.

## దరిచేరని పక్షులు

(నవల)

**[రచన: పెన్నేరు పావ. ప్రచురణ: ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్. కాంగ్రెసు ఆఫీసు రోడ్డు, విజయవాడ-2; వెల: రూ. 7-00.]**

చెప్పదామనుకున్న మంచి విషయాన్ని, చెప్పే టెక్నిక్‌ను పూర్తిగా అర్థం చేసుకోకుండానే తొందరపడి చెప్పినట్లుంది ఈ నవల. కానీ, ఈ నవలలో మరీ శూన్యంలో నుంచి నిర్జీవత్వం ఊపిరిపోసుకున్నట్లుగా కాక, పాత్రలు, రచయిత్రి అనుభవంలో తెలిసిన వ్యక్తుల చిత్రీకరణలా సజీవంగా ఉన్నాయి. వసుంధర, విశాల తల్లితండ్రుల పాత్రలు చాలా చక్కగా ఉన్నాయి. అయితే హీరో రవి పాత్ర, అతని కుటుంబం పరమ సినిమాటిక్‌గా ఉన్నాయి. విశాల ఇంటి వర్ణన, అక్కడి సంభాషణలు ఒక చక్కటి మధ్య తరగతి సంసారపు ప్రతీకలుగా ఉన్నాయి. ఏదో చెప్పదామన్న ఉత్సుకత, తెలిసిందంతా ఒక్కసారి తెలియచెప్పాలనే 'పసితనం' రచనలో కనబడుతున్నా, ఆత్మవిమర్శతో, ఆలోచించి రాస్తే, ఈమె ఒక మంచి రచయిత్రిగా రూపొందే అవకాశాలు చాలా ఉన్నాయనిపిస్తుంది.

"ఈ నవల గురించి...." హరికిషన్‌గారు రాసేటప్పుడు "ఈ సాహిత్య నదీ తరంగాలలో ఓ పెద్ద నవలా రేవులో ఎక్కువగా స్నానాలు చేసేది తెలుగు నవలా రచయిత్రులు. అలా స్నానం చేస్తే సాహిత్యపుణ్యం వస్తుందని వారి నమ్మకం." అన్నారు. ఈ మాటలు చాలా ఆలోచింపదగ్గవిగా ఉన్నాయి.

---

"అంకుల్! నేను గతించిపోయిన గతాన్ని కాదుగా — మళ్ళీ రాకుండా వుండటానికి. నేను మనిషిని. మమతా మానవత్వం వున్న మామూలు మనిషిని. అందుకే రాకూడదనుకున్నా, రాకుండా వుండలేకపోయాను. మీరు ప్రొద్దుటి నుంచీ ఏమీ తినలేదని తెలిసి ఆగలేకపోయాను. నా మూలంగా మీరెందుకు అలా బాధపడాలి! తప్పు జరిగిందంటే శిక్ష నాకు విధించండి. అంతేగానీ మీకు మీరు శిక్ష వేసుకోవడం ఎందుకు? మీరు అలా వుంటే ఆంటీ ఎంత బాధపడుతున్నారో తెలుసా? క్షమించండి అంకుల్. యింక మిమ్మల్ని బాధపెట్టను వెళ్ళిపోతాను శాశ్వతంగా దూరంగా వెళ్ళిపోతాను" అంటూ వెక్కి వెక్కి ఏడుస్తున్న హర్షను చూసి రావుగారి గుండెకరిగి నీరైంది.

ఈ అమ్మాయి తన నెందుకిలా ఏదో తెలీని బంధంతో కట్టేస్తోంది! హర్షను చూస్తూ కఠినంగా మాట్లాడటం తనకు చాతగావటం లేదు. ఆ ప్రేమమూర్తి శోభకు ద్రోహం చేశానన్న బాధ ఓ ప్రక్క అన్నెం పున్నెం తెలీని హర్ష బ్రతుకు ఏమవుతుందోనన్న భయం మరో ప్రక్క కర్తవ్యమేమిటో తెలీని అయోమయావస్థ.

ఏడుస్తూ తలుపు తీసుకుని వెళ్ళబోతున్న హర్షను చేయిపట్టి లాగారు. తలుపు ఆటోమాటిక్‌గా మూసుకుంది.

హర్ష ఆధారం దొరకగానే అల్లుకుపోయే లతలా రావుగారి గుండెల మీద వాలిపోయి తన గుండె బరువు దించుకుంటోంది. అవిరామంగా వర్షించే కన్నీళ్ళతో రావుగారి గుండెల్ని తడిపేసింది. ఏం చేయాలో తెలీని అయోమయావస్థలో హర్ష తల నిమురుతూ అలాగే వుండిపోయారు రావుగారు.

ఆ స్పర్శలో ఏ రకమైన స్పందన క్రితం రాత్రి కలిగిందో అది యిప్పుడు లేదు. ఆప్యాయంగా తల నిమురుతున్న రావుగారి కళ్ళ నుంచి రెండు కన్నీటిబొట్లు రాలి హర్ష తలలో పడి యింకిపోయాయి. తలెత్తి రావుగారివైపు చూసిన హర్ష నుదుట ఓ కన్నీటిచుక్క పడగానే వులిక్కిపడి రావుగారి దగ్గర నుంచి దూరంగా జరిగింది.

"అంకుల్! మీరు........మీరూ....ఏడుస్తున్నారా!" అంత గంభీరంగా వుండే వ్యక్తి అలా ఎందుకయ్యారు? తనెంత దుర్మార్గురాలు! ఆయన్ని అనవసరంగా ఏడిపించింది. ఆయనకు మానసిక వేదన కలగటానికి తను కారణం. తన మూలంగానే ఆయనలా వివశులయ్యారు. ఆలోచనలకు అడ్డుకట్ట వేసి కళ్ళు తుడుచుకొని రావుగారిని తీసుకెళ్ళి మంచం మీద కూర్చోబెట్టింది. ఆయన మంత్రముగ్ధుడిలా చెప్పింది చేస్తున్నారు. ఆయన శరీరం కంపిస్తోంది.

కళ్ళు గట్టిగా తుడుచుకొని నవ్వడానికి ప్రయత్నిస్తున్న రావుగారివైపు చూసి "అంకుల్! ముందు టిఫిన్ తినండి. నేను వెళ్ళి ఆంటీకి యిచ్చి వస్తాను" అంది.

తల వూపారు రావుగారు.

సంతోషంగా బయటకు పరుగెత్తిన హర్ష గబగబా టిఫిన్ తీసుకొని పైకి వెళ్ళి,

"ఆంటీ! అంకుల్ టిఫిన్ చేస్తున్నారు. మీరూ చెయ్యండి." అంటూ ప్లేటు ముందు పెట్టింది. చిన్నగా నవ్వుతూ.

"మరి మీరూ చెయ్యండి" అంది శోభాదేవి.

ఆ రోజెలాగో గడిచిపోయింది. మరు రోజు ఆదివారం.

రోజంతా యింట్లోనే వుంటారు రావుగారు.

శోభాదేవి ప్రక్కనే కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ మధ్య మధ్య హర్ష చేత పాటలు పాడిస్తూ ఆ రోజంతా ఆనందంగా గడపటం అలవాటైంది చాలా రోజులుగా. ఆదివారం వస్తుందంటే... అదో పండుగలా వుండేది. హర్ష అది మళ్ళీ ఎప్పుడొస్తుందా అని ఎదురు చూసేది.

కానీ ఈ ఆదివారం హర్షకూ రావుగారికి కూడా పెద్ద గండంలా తోచింది. మామూలుగా ఏలాగో కాఫీ ఫలహారాలు అయ్యాయి. మిగతా టైమంతా ఎలా గడపాలో తెలీలేదు. శోభాదేవి ముందు ఒక్క రావుగారో లేక హర్షో వుంటే ఎలాగో మానేజ్ చేసి వుండేవారు. కానీ ఆమె ఎదురుగా కూర్చోడానికి యిద్దరికీ మనసులో ఏదో గుబులుగా వుంది.

కానీ అలాగని అలవాటుకు విరుద్ధంగా ఏ ఒక్కరో ఆమె దగ్గర కూర్చున్నా ఆమెకు అనుమానం కలగవచ్చు. ఏం చేయాలో తోచక గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు రావుగారు. మనసంతా అంతులేని అశాంతితో వేగిపోతోంది. మునుపటిలా ధైర్యంగా తలెత్తి శోభాదేవి కళ్ళలోకి చూడలేకపోతున్నారు. ఆమె ఎదురుగా కూర్చున్నా కనుమరుగైనా తను చేసిన తప్పుని, పాపాన్ని మరచిపోలేకపోతున్నారు.

ఆ పాపానికి ఎవరు బాధ్యులు అనుకుంటే వయసులో పెద్దవాడు కనుక తనే అనే సమాధానం వస్తోంది రావుగారికి. దానితో మరింత కుంచించుకుపోతోంది హృదయం. నెమ్మదిగా డ్రెస్ చేసుకుని బయటకు వెళదామని బయలుదేరుతున్న రావుగారు ఎదురుగా కనిపించిన హర్షను చూసి ఆగిపోయారు.

"మీరు పైకి వెళ్ళి ఆంటీ దగ్గర కూర్చోండి. ఇవ్వాళంతా సరిపడే పిండివంటల పని అప్ప చెప్పారు ఆంటీ నాకు. మీరు వెళ్ళి నిశ్చింతగా పైన కూర్చోవచ్చు. నేను దగరుండి ఆంటీ చెప్పినవన్నీ చేయిస్తానని చెప్పి వచ్చాను" అంటూ సమాధానం కోసం కూడా ఎదురు చూడకుండా గబగబా వెళ్ళిపోతున్న హర్ష వైపు కృతజ్ఞతగా చూస్తూ మళ్ళీ గదిలోకి వెళ్ళి డ్రెస్ మార్చుకునే ప్రయత్నంలో పడ్డారు రావుగారు.

ఆ రోజంతా శోభాదేవి దినేష్‌ను గురించిన కబుర్లు చెబుతుంటే తాత్కాలికంగా మనసులోని మాలిన్యాన్ని దూరం చేసుకుని ఆమెతో మాట్లాడుతూ ఆమె ఆనందంలో పాలుపంచుకున్నారు రావుగారు.

ఇద్దరికీ భోజనాలు పైకి పంపింది హర్ష, లక్ష్మితో. శోభాదేవి కబురు పెడితే "ఈ రోజుకు నేను క్రిందనుంచీరాను. వస్తే మీ దినేష్‌బాబు వంటకాలు పాడైపోతాయి. ఆ తర్వాత అమ్మా కొడుకూ చేరి నన్ను నిందించి ప్రయోజనం వుండదు." అని నవ్వుతూనే పైకి రాకుండా తప్పించుకుంది హర్ష. సమయస్ఫూర్తిగా పరిస్థితిని ఫేస్ చేయకుండా చేసిన హర్షను మనసులోనే మెచ్చుకున్నారు రావుగారు.

భోజనాలు కాగానే శోభాదేవిని కొంచం సేపు నిద్రపొమ్మని చెప్పి రావుగారు తమ రూమ్‌కు వచ్చి పడుకున్నారు.

నిద్ర కోసులదూరాన వుంది. శోభ మాటలు మనసులో గిర్రున తిరుగుతున్నాయి. ప్రతి మాటలో హర్షను మెచ్చుకుంటూ తమ అదృష్టం వల్ల ఆ అమ్మాయి తమకంత దగ్గరైందని పదేపదే మురిసిపోతున్న శోభాదేవికి ఏమని చెప్పగలరు? 'శోభా! మన యింటికేదో శని పట్టి అది హర్ష రూపంలో మన సంసారాన్ని, స్వర్గతుల్యమైన ఈ యింటిని నరకప్రాయం చేయబోతోందని' మనసులోనే మథనపడడం కంటే మరో మార్గం కనిపించటం లేదు.

ఈ రోజు శోభ వ్యక్తపరచిన మాటలనుబట్టి ఆమెకు హర్షను తమ కోడలిగా చేసుకుంటే బావుంటుందన్న అభిప్రాయమున్నట్లు అర్థమైంది. తను ఆ ప్రస్తావన రాకుండా వుండాలని దినేష్ మాటలు మొదలుపెడితే అందులోనూ హర్షను కలుపుకునే ఆమె ఆలోచిస్తోంది. తీరని కలలు కంటోంది. హర్ష ఆమె దృష్టిలో, అమాయకత్వం, అణకువ, అందం, అనురాగం అన్నింటినీ ఓ మూసలో పోసి బ్రహ్మ సృష్టించిన అపరంజి బొమ్మ. ఆ అపరంజిబొమ్మ తమ కోడలైతే ఎంతో బావుంటుందని శోభ అభిప్రాయం.

పరిస్థితుల ప్రాబల్యానికి లొంగి తను పశువుగా మారకుండా వుండివుంటే.... శోభ అభిప్రాయంతో అక్షరాలా ఏకీభవించేవాడే కానీ.... యిప్పుడు.... హర్షను దినేష్‌ను కలపడమనే మరో పాపం చేయడానికి తన మనసు సిద్ధంగాలేదు. అది ఎట్టి పరిస్థితులోనూ జరగటానికి వీల్లేదు.

అలాగని ఏ కారణం చెప్పి శోభ మనసు మార్చగలడు? అంత క్రితం హర్షను శోభతోపాటు తనూ అదే భావంతో ఆదరించాడు. ఆ రాక్షస క్షణం వచ్చేవరకూ తనకు హర్ష మీద ఆపేక్ష, అభిమానం తప్ప మరో భావం లేదు. ఇప్పుడూ ఆ భావంలో మార్పు లేదు. కానీ జరిగినదాన్ని ఎలా మరచిపోగలరు? చేసిన పాపాన్ని ఎలా తుడిచేసుకోగలరు? హర్షను తమ కోడలిగా ఎలా భరించ


**Statement about ownership of VANITHA (Telugu)**

*Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956*

1. *Place of Publication* ... 'CHANDAMAMA BUILDINGS' 2 & 3, Arcot Road Vadapalani, Madras-600 026
2. *Periodicity of Publication* ... MONTHLY 1st of each calendar month
3. *Printer's Name* ... B. V. REDDI
   *Nationality* ... INDIAN
   *Address* ... Prasad Process Pvt Limited 2 & 3, Arcot Road Vadapalani, Madras-600 026
4. *Publisher's Name* ... B. VISWANATHA REDDI
   *Nationality* ... INDIAN
   *Address* ... CHANDAMAMA PUBLICATIONS 2 & 3, Arcot Road Vadapalani, Madras-600 026
5. *Editor's Name* ... B. VISWANATHA REDDI
   *Nationality* ... INDIAN
   *Address* ... 'CHANDAMAMA BUILDINGS' 2 & 3, Arcot Road Vadapalani, Madras-600 026
6. *Name & Address of individuals who own the paper* ... CHANDAMAMA CHILDREN'S TRUST FUND BENEFICIERIES:
   1. B. V. HARISH
   2. B. V. NARESH
   3. B. V. L. ARATI
   4. B. L. NIRUPAMA
   5. B. V. SANJAY
   6. B. V. SHARATH
   7. B. L. SUNANDA
   8. B. N. RAJESH
   9. B. ARCHANA
   10. B. N. V. VISHNU PRASAD
   11. B. L. ARADHANA
   12. B. NAGI REDDI

All Minors—by Trustee M. UTTAMA REDDI, 9/3, V.O.C. Street, Madras-600 024.

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

1st March 1979

B. VISWANATHA REDDI
*Signature of the Publisher*

గలరు? మనసు విప్పి మరొకరితో, తన మనసులో మనసైన శోభకే చెప్పుకోలేని ఆవేదన భరించడం అసాధ్యంగా వుంది.

కన్నీటితో తలగడ తడిసిపోయింది. కళ్లు ఎర్రగా మంకెన పూవుల్లా మారాయి. నాలుగ్గంటలకు లేచి స్నానం చేసి హాల్లోకి వచ్చిన రావుగారి వాలకం చూస్తే జబ్బుపడిన మనిషిలా కనిపించారు హర్షకు. కాఫీలు కలిపి ఒకటి రావుగారికిచ్చి మరొకటి తీసుకొని పైకి వెళ్ళింది హర్ష.

నెమ్మదిగా రావుగారు కప్పు పట్టుకొని పైకి వెళ్ళారు. శోభ నవ్వుతూ హర్షవైపు చూస్తూ కాఫీ త్రాగుతూ వంటకాల వివరాలడిగి తెలుసుకుంటోంది.

రావుగారు గదిలోకి రాగానే "ఇప్పుడే లేచారా? అబ్బ కళ్ళు వాచేలా నిద్రపోయారన్న మాట! అదృష్టవంతులు. నాకేమో కళ్ళు మూసుకున్నా, తెరచినా దినేష్ కనిపిస్తున్నాడు. ఇంక నిద్రెలా పడుతుంది? ఎప్పుడెప్పుడు వాడిని చూస్తానా అని మనసు వేగిరపడుతోంది. ఇంక హర్షకు పనులతో తీరిక దొరికితేకదా నిద్రపోవడానికి. పాపం! ఆ వంటామెకు చేతకావని నేను చెప్పిన క్రొత్త వంటకాలన్నీ తనే చేసిందట. చెయ్యి కూడా కాల్చుకుంది చూడండి." అంటూ హర్ష చెయ్యి లాగి చూపించింది. చూసి మెదలకుండా వూరుకున్న రావుగారి వైపు చిరుకోపంతో చూస్తూ—

"పిల్ల చెయ్యి కాల్చుకుందని కొంచమైనా జాలిపడ్డారా? ఒట్టి రాతి మనుషులు బాబూ! కొద్దిగా మందేదైనా తెచ్చి రాయకూడదూ?" అంటుండగానే ఆమె చేతిలోని ఖాళీ కప్పు అందుకుంటూ—

"నేను రాసుకుంటానులే ఆంటీ! మీరు అంకుల్‌తో మాట్లాడుతుండండి." అంటూ క్రిందకు వెళ్ళిపోతూన్న హర్షవైపు ఆప్యాయంగా చూస్తుండిపోయిన శోభాదేవి ప్రక్కన కూర్చుంటూ—

'శోభా! కొద్దిగా చెయ్యి కాలినందుకే నీ మనసింత బాధపడుతోందే వళ్ళంతా కాల్చుకుంది ఆవేశంలో అని తెలిస్తే నువ్వు హర్షను క్షమించగలవా? హర్ష వళ్ళు కాలింది. నా మనసు కాలింది. ప్రకృతి ఆడే ప్రళయతాండవం మన బ్రతుకుల్ని ఆశల్ని నిలువంటా కూల్చేసింది. దినేష్ వస్తున్నాడంటే నీకు సంతోషంగా వుండి నిద్రపట్టడం లేదు. కానీ వాడు వచ్చిన తర్వాత ఎదుర్కోవలసిన పరిస్థితుల్ని తలచుకొని నాకు నిద్రపట్టడం లేదు. నీ మొఖం చూస్తూ నిజాన్ని చెప్పలేను. చెప్పకుండా వాళ్ళిద్దరి పెళ్ళికి అంగీకరించి, చేతులారా మరో పాపం చేయలేను.' ఈ మాటలన్నీ మనసులోనే అనుకుంటూ శోభాదేవి చేతిని తన చేతుల్లోకి తీసుకొని మృదువుగా రాస్తూ మౌనంగా కూర్చున్న రావుగారివైపు ప్రేమగా చూస్తూ—

"ఏమండీ! నాకిలాగే శాశ్వతంగా మంచంలోనే వుండిపోతే బావుండుననిపిస్తోంది."

"శోభా! ఏవిటామాటలు నీకేమైనా మతిపోయిందా?"

"కాదండీ, యింత ప్రేమగా చూసుకునే మీరూ, దినేష్, హర్షా మీ ముగ్గురూ నన్ను కంటికి రెప్పలా చూసుకుంటారని నాకు తెలుసు. ఇంక నేను మంచంలో వున్నా మహారాణీ భోగాలే అనుభవిస్తాను. అందుకే అలా అన్నాను మీరు బాధపడకండి. దినేష్ రాగానే హర్షకూ, దినేష్‌కూ పెళ్ళి చేసి వాళ్ళను ఈ యింట్లో వుంచి మనం మన ప్రేమ మందిరానికి, మన పాత యింటికి వెళ్ళిపోదాం. ఈ రోజే హర్ష వాళ్ళ నాన్నగారిని పిలిపించి మాట్లాడండి. ఆయన అభ్యంతరం చెప్పరని తెలుసనుకోండి. అయినా ముందుగా ఆయన అభిప్రాయం తెలుసుకోడం మన బాధ్యత."

రావుగారి మెదడు పని చేయడం మానేసింది. శోభ అప్పుడే అన్ని ఆలోచనలు చేసిందా? ఈ గండం తప్పించడం ఎలా? నిజం చెప్పేస్తే? ఆ పైన ఇంక అక్కడ నిలవలేక "ఇప్పుడే అలా బజారు కెళ్ళొస్తాను శోభా!" అంటూ గబగబా క్రిందకు వెళ్ళిపోయారు. అయోమయంగా చూస్తుండిపోయింది శోభాదేవి. అంత అకస్మాత్తుగా రావుగారు అలా ఎందుకు లేచి వెళ్ళిపోయారో అర్థం కాలేదు. తన మాటలు అసలు విన్నారో లేదో?

అయ్యగారు రావడం చూసి షెడ్డు తలుపులు తీస్తున్న డ్రైవర్ అయ్యగారు తనవైపైనా చూడకుండా గబగబా నడిచి వెళ్ళిపోతుంటే ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు.

బయటకు వెళ్ళిన రావుగారు అలా నడుస్తూనే వున్నారు. ఎన్ని బజార్లు తిరిగారో, ఎన్ని మైళ్లు నడిచారో, ఆయనకే గుర్తులేదు. నడిచి నడిచి కాళ్ళూ, ఆలోచనలతో మెదడూ అలసిపోయేసరికి ఎదురుగా కనిపించిన ఓ సిమెంట్ బెంచీ మీదకు చేరుకున్నారు.

మరో రెండు రోజుల్లో దినేష్ వచ్చేస్తాడు. అప్పుడు శోభ తన కోరిక చెబుతుంది. కాదనటానికి కారణం కనిపించదు. అన్నివిధాలా అందర్నీ ఆకర్షించగల హర్ష దినేష్‌ను ఆకర్షించకపోదు. కానీ ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదు. అలా అని తను అంటే, శోభ బాధపడుతుంది. కారణం అడుగుతుంది. అనురాగమూర్తి శోభ ముఖం చూస్తూ తను చేసిన పాపాన్ని చెప్పే ధైర్యం తనకు లేదు. అన్నీ వున్న దరిద్రుడు తనిప్పుడు. అందరూ వున్నా అనాథ తనిప్పుడు. తన బాధ ఎవరితో చెప్పుకోగలడు?

హర్షకు భవిష్యత్తు ఎంతో వుంది. అది తన మూలంగా విఘ్నం కావడం తన కిష్టంలేదు. అలా అని చూస్తూ చూస్తూ తన కోడలిగా చేసుకుని, చేసిన పాపాన్ని మరింత పెంచుకోలేడు. మొదలూ చివరాలేని ఆలోచనలు.

అడుగులో అడుగు వేసుకుంటూ యిల్లు చేరిన రావుగారికి హాల్లో కూర్చుని కునికిపాట్లు పడుతున్న హర్ష కనిపించింది. బూట్ల చప్పుడు కాగానే దిగ్గున లేచి నుంచుంది హర్ష. ఎక్కడివాళ్ళక్కడ అంతా నిద్రపోతున్నారు. పైన లైటన్నీ ఆఫ్ చేసి వున్నాయి. మెట్లవైపు అడుగులు వేయబోయిన రావుగారు హర్ష మాటలతో ఓ క్షణం ఆగిపోయారు.

"ఆంటీ నిద్రపోయారు. మిమ్మల్ని గురించి అడిగితే తల నొప్పిగా వుందని పడుకున్నారని చెప్పాను," అంది తల దించుకుని హర్ష. వెనక్కు తిరిగి ఓ క్షణం హర్షవైపు కృతజ్ఞతగా చూసి పైకి వెళ్ళిపోయారు.

చప్పుడు కాకుండా బెడ్ దగ్గిర నుంచొని బెడ్ లైట్ బిరు వెలుగులో ప్రశాంతంగా నిద్రపోతున్న శోభాదేవి వైపు తదేకంగా చూస్తూ నుంచున్నారు. తమ పరిచయం. ప్రేమ, పెళ్ళి, అనురాగపూరిత దాంపత్య జీవితం, అన్నీ ఒక్కొక్కటే, సినిమా రీళ్ళలా కళ్ళముందు కదిలాయి. టాబ్లెట్ వేసుకుని పడుకుని వుండటం వల్ల శోభాదేవి హాయిగా



బంగారు గొలుసులు, దుద్దులు మట్టిపట్టి వుంటే— చిన్న సబ్బు ముక్క వేసిన నీళ్ళలో వాటిని వడేసి, ఆ నీటిని కాసేపు ఉడికించండి. తర్వాత ఆ వస్తువుల్ని తోమితే-ఏవైనా సరే 'కొత్తవి కొన్నారా' అని అడగవలసిందే!

—వరహాలమ్మ

నిద్రపోతోంది. అయినా ఆమెకు దిగులేముంది?

దగ్గరగా వెళ్ళి ముంగురులు సవరించి నుదుట ముద్దుపెట్టుకున్నారు. ఆమెలో కదలిక లేదు. మెల్లగా కళ్ళు తుడుచుకుంటూ క్రిందకు దిగి వచ్చారు. ఇంకా అలాగే నుంచొని పైకి చూస్తోంది హర్ష.

రావుగారు రాగానే డైనింగ్‌హాల్ వైపు దారి తీసింది. భోజనాలు సిద్దంగా వున్నాయి. రాత్రి పదకొండు గంటలైంది. అప్పుడేమీ తినాలని లేదు రావుగారికి. కానీ హర్షను బాధపెట్టడం యిష్టంలేక టేబుల్‌ముందు కూర్చున్నారు. మౌనంగా వడ్డిస్తోంది హర్ష.

"హర్షా! నువ్వు భోంచేశావా?" కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి హర్షకు. లేదని అడ్డంగా తల వూపింది. తన ప్రక్కన మరో ప్లేట్ పెట్టి "కూర్చోమ్మా! సారీ. నా మూలంగా నీకూ లేటైపోయింది నువ్వూ భోంచేసి వుండాల్సింది" అంటూ హర్ష చేయిపట్టి కూర్చోబెట్టారు.

రావుగారి మనసిప్పుడు ప్రశాంతంగా వుంది. ఏ ఆలోచనలూ బాధించడంలేదు. అందుకే అంత మామూలుగా హర్షతో మాట్లాడగలిగారు. ఓ నిశ్చయానికొచ్చిన నిశ్చింత కనిపిస్తోంది ఆయన ముఖంలో. తనకు స్వయంగా ఆప్యాయంగా వడ్డిస్తున్న రావుగారి వైపు చిత్రంగా చూస్తుండిపోయిన హర్షను చూసి మెల్లగా నవ్వుతూ వీపు తట్టి "తినమ్మా! చాలా ప్రొద్దుపోయింది" అంటున్న రావుగారి మాటలతో జలజలా రాలిన కన్నీళ్ళు ప్లేట్‌లోపడి అన్నంలో కలసిపోయాయి. ఇద్దరికీ తినాలనిలేదు. ఒకరికోసం ఒకరు కూర్చున్నారని చూస్తేనే తెలుస్తోంది. ఎలాగో భోజనాలు ముగించి, ఎవరి రూమ్‌లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

అంకుల్ రాగానే ఎన్నో మాట్లాడాలనుకున్న హర్ష, ఆయన ముఖం చూస్తూ, ఆప్యాయంగా ఆయన మాట్లాడుతుంటే వింటూ లోలోనే కుంచించుకుపోయింది. ఆ యింట్లో ఆ స్తబ్దతకూ, నిశ్శబ్దానికి కారణం పరోక్షంగా తనేననే బాధ ముద్ద మింగనివ్వలేదు. గొంతుకేదో అడ్డం పడ్డట్లే అయింది. ఎలాగో తిన్నాననిపించి అన్నీసర్దేసి రూమ్‌లోకి వెళ్ళి పడుకుంది. తలగడ కన్నీళ్ళతో తడుపుతూ ఇంటి కప్పు వైపు చూస్తూ అలాగే పడుకుంది.

రావుగారు రూమ్‌లోకి రాగానే కొంతసేపు దినేష్ ఆల్బమ్ చూస్తూ కూర్చున్నారు. డిగ్రీ పుచ్చుకున్నప్పటి దినేష్ ఫొటోవైపు ఎంతోసేపు అలాగే చూస్తుండిపోయిన రావుగారి కళ్ళలో నీటిపొర అడ్డంవచ్చి దినేష్ ముఖం మసకమసకగా కనిపించింది. ఆప్యాయంగా ఆ ఫోటోని గుండెల కద్దుకొని ముద్దుపెట్టుకున్నారు. దుఃఖం తన్నుకు వచ్చింది. గుండెలు పట్టుకొని చాలాసేపు అలాగే కూర్చుండిపోయారు. బీరువా తెరచి పాత ఆల్బమ్ తీశారు. అందులో శోభ వివిధ భంగిమల్లో తీయించుకున్న ఫొటోలు. తామిద్దరూ కలిసి వెళ్ళిన ప్రదేశాల్లో జంటగా తీయించుకున్న ఫొటోలు. అపురూపంగా దాచుకున్న తమ పెళ్ళి ఫొటోలు— అన్నీ ఒక్కొక్కటే చూస్తూ కూర్చున్నారు చాలా సేపటి వరకూ.

మూడు గంటలకు పడుకొని ప్రశాంతంగా నిద్రపోయారు. మరు రోజు వుదయాన్నే లేచి స్నానం పూర్తిచేసి ఫ్రెష్‌గా తయారయి పైకి వెళ్ళారు.

"గుడ్‌మార్నింగ్ డియర్!" అంటూ శోభాదేవి ప్రక్కన కూర్చున్నారు నవ్వుతూ.

"ఏమిటి విశేషం చాలా హుషారుగా వున్నారు! ఓహో నాకర్థమైంది లెండి, తెల్లవారితే, సుపుత్రుడు వస్తాడనే ఆనందం కదూ" అంటున్న శోభాదేవి కళ్ళలో ఆనంద భాష్పాలు నిలిచాయి.

"ఛా! సంతోషపడాల్సిన సమయంలో కన్నీళ్ళేమిటి శోభా! తప్పు కదూ!"

చాలా ప్రేమగా పలికిన రావుగారి గొంతులోని మార్దవం శోభాదేవిని వివశను చేయడంతో అలాగే ఆయన భుజం మీదకు తల ఆనించి "యివ్వాళ నుంచీ కొద్దిగా నడవడానికి ప్రయత్నించమన్నారు డాక్టర్! మెట్లుమట్టుకు ఎక్కడం దిగటం చెయ్యొద్దన్నారు. ఎయిర్‌పోర్ట్‌కు రాలేకపోయినా బాల్కనీలో నిలబడి దినేష్ రావడం చూడొచ్చు" అంటున్న శోభాదేవి ఎదురుగా కనిపించిన హర్షను చూసి సిగ్గుపడి రావుగారికి దూరంగా జరిగింది. అప్పుడే వెనక్కు తిరిగి చూసిన రావుగారు—

"హర్షా! మీ ఆంటీకి ఇవ్వాళ డబుల్ డోస్ కాఫీ కావాలి. మరో కప్పు తీసుకురా!" అన్నారు నవ్వుతూ.

మెల్లగా నవ్వుతూ క్రిందకు పరుగెత్తింది హర్ష.

"అరే నాకు రెండు కప్పులెందుకు?" అంటున్న శోభాదేవి ముఖాన్ని దగ్గరకు తీసుకుంటూ "ఎందుకో చెప్పనా! ఇందుకు" అంటూ శోభాదేవి నుదుట ముద్దు పెట్టుకున్నారు.

"ఛా! కొడుకు పెళ్ళీడుకొచ్చినా చిలిపితనం, అల్లరీ కొంచం కూడా తగ్గలేదు" అంది శోభాదేవి తెచ్చి పెట్టుకున్న కోపంతో.

ఇంతలో మరో కప్పు కాఫీ తీసుకొని హర్ష రావడం చూసి, "ఆ! హర్షా! ఇలా కూర్చో" అంటూ దగ్గరకు చైర్ లాగారు రావుగారు.

బెరుగ్గా వచ్చి కూర్చున్న హర్షవైపు ఆప్యాయంగా చూస్తూ "హర్షా! ఆ కాఫీ నువ్వు త్రాగు. రేపు దినేష్ వస్తాడు. ఈ రోజంతా మనం సరదాగా గడపాలి. అందుకే యివ్వాళ నేను ఆఫీసుకు కూడా వెళ్ళడం లేదు" అంటున్న రావుగారి వైపు సంభ్రమంగా చూసింది శోభాదేవి.

"ఫర్వాలేదే! ఇన్ని సంవత్సరాల తర్వాత మొట్టమొదటిసారి మీ అంతట మీరు ఆఫీసు మానేస్తున్నారంటే విశేషమే. దినేష్, హర్షా మీలో చాలా మార్పు తేగలిగారని చెప్పొచ్చన్న మాట."

ఓ క్షణం రావుగారి ముఖం వివర్ణమైంది. హర్ష నవ్వుతూ కాఫీ సిప్ చేస్తున్నదల్లా శోభాదేవి మాటలు విని వులిక్కి పడింది. కాఫీ మీద వంపుకుంది.

"అరె! కాఫీ పోసుకున్నావు. బట్టలు పాడౌతాయి. ముందు వెళ్ళి ఓణీ అంతవరకూ తడుపుకు రా!" అంటూ నవ్వుతూ మాట్లాడుతున్న శోభాదేవి వైపు రావుగారివైపూ చూస్తూ లేచి కప్పు పట్టుకొని తొందరగా క్రిందకు వెళ్ళిపోయింది హర్ష.

ఆ రోజంతా రావుగారు చాలా ఆనందంగా వున్నారు. హర్ష తండ్రిని పిలిచి అతనితోపాటు కులాసాగా కబుర్లు చెబుతూ భోజనం చేశారు. మళ్ళీ యింట్లోకి చైతన్యం వచ్చినట్లుగా వుంది. హర్ష మనసు కొద్దిగా కుదుటపడింది. అంకుల్ తనను క్షమించారు. మామూలుగా మాట్లాడుతున్నారు అంతే చాలు. తృప్తిగా ఆంటీతో కూర్చుని కబుర్లు చెప్పింది. కొంతసేపు చదరంగం ఆడారు. అంకుల్ ఆంటీ ఆడుతుంటే మధ్యలో కూర్చొని కొంతసేపు సలహాలిచ్చింది. రాత్రి భోజనాలు ముగ్గురూ పైనే కబుర్లు చెప్పుకుంటూ చేశారు. రాత్రి చాలా ప్రొద్దుపోయేంత వరకూ రావుగారు ఏవేవో కబుర్లు చెప్పి నవ్విస్తూనే వున్నారు వాళ్ళిద్దర్నీ. ఆఖరికి శోభాదేవి 'నాకు నిద్ర వస్తోంది' అన్న తర్వాత క్రిందకు దిగి వచ్చారు. ఎవరి గదిలోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

టేబుల్ దగ్గర కూర్చొని పేపర్ పెన్నూ తీసుకుంటూన్న రావుగారి చేతులు సన్నగా కంపించాయి.

# పుష్పరాగం ముగ్గు

ఈ ముగ్గు వేయడానికి మధ్యన 16 చుక్కలు 6 వరుసల్లో పెట్టుకోవాలి. తర్వాత 14 చుక్కలు 3 వరుసల్లో ఇరువైపులా పెట్టుకోవాలి. తర్వాత 12 చుక్కలు ఒక వరుస, 6 చుక్కలు ఒక వరుస ఇరువైపులా పెట్టుకోవాలి. ఆ తర్వాత చిత్రంలో చూపించినట్లుగా కలుపుకుంటూ వస్తే అందమైన ఈ ముగ్గు తయారవుతుంది.

—దాసరి శారద



''డియర్ శోభా!

దినేష్ వచ్చే సమయానికి నీకు నేను లేకుండా పోతున్నాను. నిన్ను ఈ రోజంతా హాపీగా వుంచాను. రేపు ఎదుర్కో-బోయే దుఃఖాన్ని తట్టుకో గలగాలి నువ్వు. నేను కనిపించకుండా పోయినంత మాత్రాన చచ్చిపోతాననుకోకు. నాకు నా ప్రాణం కంటే అధికమైన, నిన్ను సర్వదా సుమంగళిగా చూడటం యిష్టం. అందుకే నేను నీకు యిక జీవితంలో ముఖం చూపించకపోయినా నీ మన సులో నేనెప్పుడూ సజీవంగా వుంటాను. వుండాలి. యిదీ నా స్వార్థమే. కానీ యిలా నేను వెళ్లిపోవ డానికి కారణమేమిటో చెప్పి నీ ముందు క్షమా పణలు అడిగే అర్హతా అధికారం కోల్పోయాను. కారణం అడక్కు.

శోభా! నా చివరి కోరిక. హర్షను దినేష్‌కు చేసుకోడానికి వీల్లేదు. అది నాకిష్టం లేదు. ఇది నేను చేస్తున్న పాపమని నువ్వనుకుంటే నన్ను క్షమించడానికి ప్రయత్నించు. తెలిసిచేసిన పాపానికి నేను శిక్ష తప్పక అనుభవిస్తాను. అయితే హర్ష వివాహానికి నువ్వు తప్పకుండా సాయం చేయాలి. పాతికవేలు హర్ష పేర వ్రాసి బీరువాలో పెట్టాను. అది హర్షకు నా పెళ్ళి కానుక. ఇంత కంటే ఏమీ వ్రాయలేని వ్రాయలేకపోతున్న....

నీ....పిరికి.... వేణు''

''అనురాగం చిందిందా
అమాయకత,
అభిమానం కురిపించిందా
అణకువ
అతిలోక సౌందర్యం
ఆకర్షించింది.
అంతటితో పూరుకోక ...
ఆశలు రేపింది అల్లరిగా.
వయసుడిగే కాలంలో,
వసంతాన్ని చవి చూపించింది.
అప్రయత్నంగా దొరికిన
అవకాశం................
నాదేవి వియోగ ఫలితం........
మనిషిగా నిలవ నివ్వలేదు
పశుత్వం నన్నావహించింది
ఆలస్యంగా మళ్ళీ మనిషి నయ్యాను
అంతరాత్మ ఘోషించింది!
తెలిసి చేసిన పాపానికి కక్షగా,
ఆమెకు దూరం కావడమే
వేసుకున్నాను శిక్షగా!''

[సమాప్తి]





3

చాలామందికి-పిల్లలకు దుస్తులు కుట్టడమనేది అమితోత్సాహాన్ని కలిగించే హాబీలలో ఒకటి. చూడ ముచ్చటైన గుడ్డలతో కొంత ఊహాశక్తి జోడించి మనం కన్నులకు యింపైన దుస్తులు కుట్టవచ్చును. చక్కటి రంగు, సరైన డిజైనులు, అతి తక్కువ ధరలో నాణ్యమైన బట్ట ఎంపిక చేయగలిగి—

6

ఫ్రిల్స్, రిబ్బన్లు, లేసు, ఆకర్షణీయమైన బొత్తాలు, ఆప్లిక్ పనితనానికి తగిన గుడ్డ వుంటే చాలు – మీ పిల్లలను 'అందాల రాణులు'గా చక్కటి దుస్తులతో రాణింపజేయవచ్చును. కాబట్టి మీ మీ కత్తెరలతోనూ, సూదులతోనూ, మీ ఊహాశక్తిని, మేధస్సును మేళవింపజేసి మీ పిల్లలకు చక్కటి దుస్తులు తయారు చేయడానికి సిద్ధం కండి. అందులోనూ రానున్నది వేసవి కాలం గనక....సింథటిక్ నారతో చేసిన నైలాన్, టెర్లిన్ దుస్తులైతే మీ పిల్లలను వెచ్చదనానికి గురిచేసి చికాకును కలిగిస్తాయి. అదే నూలు దుస్తులైతే చల్లగా, హాయిగా వుంటాయి.

అందుకే మీ పిల్లల కోసం ప్రఖ్యాత దుస్తుల డిజైనర్ శ్రీమతి గీతా దేవదత్ కొన్ని అందమైన నూలు దుస్తులను ఎలా తయారు చేసుకోవాలో చెబుతున్నారు.

దొంగని పట్టిన వనిత

మద్రాసుకు సమీపంలో కోయంబేడు అనే గ్రామం వుంది. ఆ గ్రామంలో నలభై ఐదు సంవత్సరాల ఒక స్త్రీ తన స్నేహితురాలి ఇంటికి వెళదామని బయల్దేరింది. ఆమె ఇల్లు కూడా ఆ వీధిలోనే వుంది. తీరా రోడ్డు మీదకి వచ్చిందో లేదో ముప్ఫైఏళ్ళ యువకుడు ఒకడు ఆమె మెళ్ళోని గొలుసు కాస్తా చేజిక్కించుకుని పరుగు ప్రారంభించాడు. ఆ దొంగ గొలుసు లాగడంతో ఆమె మెడ కాస్త కోసుకుపోయి రక్తం కారడం మొదలెట్టింది. ఆమె మాత్రం అదేమీ లెక్క చెయ్యలేదు. పెద్ద పెట్టున కేకలు వేస్తూ దొంగ వెనక పరుగెత్తింది. అలా పరుగెడుతూంటే కొంతసేపయ్యాక ఆమెకి ఆ దొంగ కనిపించకపోగా చుట్టూ ఏదో కట్టడంలావున్న ప్రదేశం కనిపించింది. దిక్కు తోచక చూస్తూ నిలుచున్న ఆవిడకి ఒక చిన్న కుర్రాడు కనిపించాడు. వాడు కాస్తా దొంగ 'రహస్య స్థావరం' రహస్యం బట్టబయలు చేశాడు. అక్కడే ఒక షెడ్డులో 'దొంగ గారు' నిప్పు రాజేసి బంగారు గొలుసుని అందులో వేసి ముద్ద చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు. అతనా పని చెయ్యకముందే ఆమె కాస్తా అక్కడికి చేరుకుంది. ఇంతలో చుట్టుపక్కల వారు కూడా వచ్చారు. దొంగకి బడితపూజ జరగడంతో బూడిద గుట్టలో దాచిన గొలుసు కాస్తాతీసి ఆమెకి అప్పగించాడు.

1. మొదటి చిత్రంలో కనిపిస్తున్న ఇద్దరు పిల్లలు ధరించిన అందమైన దుస్తులు చూశారా.... వాటిని 'పినాఫోర్ దుస్తులు' అని అంటారు. ప్రింటెడ్, సాదా గుడ్డలు కలిపి తయారు చేసిన దుస్తులు అవి. బ్లౌజ్‌కి సాదా టూబైటు పాప్లిన్ గుడ్డ ఉపయోగించబడింది. బ్లౌజ్‌కి బుట్ట చేతులు, కాలర్ వున్నాయి. ఈ రోజుల్లో సాధారణంగా అందరికీ నచ్చే డిజైను అది. ప్రింటెడ్ గుడ్డతో చేసిన స్కర్టుకి ప్లీట్స్ వున్నాయి. అలాగే సులభంగా ధరించేందుకు వీలుగా స్కర్ట్‌కి బెల్టు (స్ట్రాప్)లు కూడా వున్నాయి.

2. ఈ రోజుల్లో సల్వార్, కమీజు ధరించడం ఫ్యాషన్ అయిపోయింది. ఈ చిత్రంలో లేత పసుపు రంగు మీద చిన్న చిన్న ఎర్ర చుక్కలు గల గుడ్డ సల్వార్, కమీజులు కుట్టడానికి వుపయోగించబడింది. వీటి పైన ధరించే వలువ (దుపట్టా) కోసం ఎరుపు రంగు షిఫాన్ గుడ్డ ఎంచుకోబడింది. ఆ పక్కనే కూర్చుని దీక్షగా పుస్తకం చదువుతున్న చిన్నారి బాలిక గీతలు గల ఫ్రాక్ ధరించింది. అయితే ఆ గీతలు గమనించారా....అవి అడ్డంగానూ, నిలువుగానూ వున్నాయి. బుట్ట చేతులూ, గౌనుమీద అమర్చబడిన లేసు ఆ ఫ్రాక్ అందాన్ని యినుమడింపజేస్తున్నాయి.

డాడీకోసం వేచివున్న ఆ ఇద్దరూ స్నేహితురాలి పుట్టిన రోజు పండుగకి వెళ్ళడానికి తయారైనట్టున్నారు కదూ!

3. ఈ చిత్రంలో కనిపిస్తున్న పిల్లలిద్దరూ కూడా ఏదో పార్టీకోసమే సిద్ధమైనట్లున్నారు. అందులో కుడివైపున కూర్చుని వున్న అమ్మాయి పసుపు రంగు ఆర్గండీ గౌను తొడుక్కుంది. సాదా పసుపు రంగులో వున్న ఆ గౌనుకి అందం తేవడానికా అన్నట్లుగా నడుం దగ్గర ఎరుపురంగు పువ్వులతో ఎంబ్రాయిడరీ చేసి అంచులకి లేసు అల్లిన పట్టా కుట్టింది ఆ పిల్ల తల్లి. భుజాలమీద వున్న బుట్ట చేతులవల్ల ఆ పిల్ల ఎంత చలాకీగా కనిపిస్తోందో చూశారా....ఆ పక్కనే కూర్చుని వున్న ఆ అమ్మాయి చెల్లెలు చీటి గుడ్డమీద చిన్న చిన్న పోల్కా చుక్కలు గల గౌను ధరించింది. ఆ గౌను మీద అక్కడక్కడ పచ్చరంగు పువ్వుల ఎంబ్రాయిడరీ వుంది.

4. గింఘూరు-ఇదేమిటని ఆశ్చర్యపోతున్నారా? అవును. ఈ చిత్రంలో కనిపిస్తున్న చిన్నారి బాలిక ధరించిన గౌనుకి ముద్దు పేరు అది. చిన్న చిన్న గడులతో చూడ ముచ్చటగా వుండే ఈ గౌను సర్వత్రా, తల్లులు తమ పిల్లలకి కుట్టడానికి యిష్టపడతారు. లేత గులాబి రంగులో రిక్‌రాక్ లేసుతో అల్లబడిన గులాబి, నీలిరంగు డిజైనుతోనూ, చక్కటి జేబులతోనూ చూడ ముచ్చటగా వుంది. ఆరేళ్ళ పాపలకి ఈ గౌన్లు చక్కగా వుంటాయి.

5. ఇక్కడ చెట్ల మధ్య కూర్చుని వున్న చిన్నారిబాల లేత గులాబిరంగు గౌను వేసుకుంది. ఆ గౌను మీద ఎంబ్రాయిడరీ చేసిన తెల్లటి గుడ్డ అతుకు వేయబడింది. బుట్ట చేతులు ఆ గౌనుకి ఎంతో అందాన్ని యిస్తున్నాయి. ఆ పక్కనే నిల్చుని వున్న అమ్మాయి ఈ బాలకి స్నేహితురాలు. ఆ అమ్మాయి గులాబిరంగు బుట్ట చేతుల గింఘూరు గౌను తొడుక్కుంది.

6. నవ నాగరికతను అందుకోవాలని ప్రయత్నించేవారికి తగిన దుస్తులు చూపుతున్నది ఆరవ చిత్రంలోని అమ్మాయి. ఆ అమ్మాయి ధరించినది 'మాక్సీ' గౌను అయినా మన సంప్రదాయానికి తగినట్లుగానే వుంది. అందుకు కారణం ఆ మాక్సీ మీద వున్న నలుపు, తెలుపు గడులు. మాక్సీ మీద 'టాప్' (బ్లౌజ్ భాగం) సాదా తెలుపు రంగులో వుంది. మెడ మీద, మోచేతులవరకూ వున్న చేతుల వద్ద మాత్రం నలుపు, తెలుపు గడులు కనిపిస్తున్నాయి. ఈ మాక్సీ స్కర్టు చేతులకీ, స్కర్టు కింద భాగంలోనూ తెల్లటి 'ఫ్రిల్స్' వున్నాయి.

—సుశీ

సశేష నవల

# కృష్ణవేణి

విమలారామం

లిప్తకాలంలో అతని బాధంతా తరిగిపోయింది. ఆనందంతో ఎగిరి గెంతినంత పని చేసాడు.

"....ఎంత చల్లని మాట చెప్పావమ్మా!...." అని ఆమె తెచ్చిన స్వీటులోకి తన కన్నీళ్ళు చెదిరి పడేంతగా ఊగిపోయాడు. అంతలోనే "...అయ్యో! అంత దూరం నుంచి ఒక్కదానివీ వచ్చావా?...." అన్నాడు.

"....మీకు చెపుదామని!" కృష్ణవేణి చిన్న పిల్లలా నవ్వింది. "ఇన్నాళ్ళు నాతో చెప్పింది కాదు. తన రహస్యం కాస్తా వేవిళ్ళు బయిట పెట్టేసాయి. మూడో నెలట!....ఇవేళ కాలేజీ మానెయ్యమన్నాను. మురళికి ఉత్తరం వ్రాయాలి, మీ అబ్బాయికి ఉత్తరం వ్రాయాలి!....ఇంకా బోలెడన్ని పనులున్నాయి. త్వరగా రండి!"

ఆమె హడావిడికి అతనెంతో అబ్బురపడ్డాడు. 'నువ్వంటే మధూకి ఎందుకింత యిష్టమో యింత కాలం తెల్సుకోలేకపోయానమ్మా! నువ్వు మధూకి అక్కవే కాదు. తల్లివి కూడా! నిజంగా మధు అదృష్టవంతురాలు!'

ఆర్ద్రత చెందిన హృదయం బరువెక్క.... కృష్ణవేణితో సమంగా నడవలేకపోయాడు అతను. కొంతదూరం వచ్చాక కాని....ఆమెను నడిపించి తీసుకు వెడుతున్నానన్న స్పృహ కూడా లేక పోయింది.

"అయ్యో!....నాకు తోచనేలేదు. ఉండమ్మా రిక్షాను పిలుస్తాను!"

"ఎందుకండీ!....దగ్గరకు వచ్చేసాముగా!..." అంటూ ఆమె నడిచిపోతూనే వుంది.

అప్పుడుకాని ఆమె పాదాలకి చెప్పులు కూడా లేవని అతను గుర్తించలేదు. అతని గుండె కలుక్కుమంది. ఇటువంటి మంచి మనిషికి ఎంత బాధ! అప్పుడే తెరుస్తున్న చెప్పులషాపు కనిపించింది.... ఆమెతో చెప్పి లోపలికి తీసుకువెళ్ళి ఒక జత చెప్పులు కొంటే?....అతనికా ఆలోచన వచ్చి పిలిచేలోపల ఆమె పది గజాల దూరం వెళ్లి పోయింది.

కట్టుకున్న బట్టలయినా సరయినవి కావు. తన గురించి తానేమీ పట్టించుకోదు....ఆమె బాధలు ఒకటా రెండా? ఒక జత చెప్పులు కొంటే—ఒక చీర కొంటే తీరిపోయేవి కాదుకదా!

స్వంత కూతురు గర్భవతి అయిందన్న శుభవార్త తెచ్చిన సంతోషాని కన్న—ఆ కబురు చెప్పిన మనిషి పడుతున్న బాధలే అతని మనస్సుని ఎక్కువ ఆవరించుకున్నాయి ఆక్షణంలో!



## 57

పబ్లిషరు అడ్వాన్సుగా పంపిన చెక్కు మార్చి డబ్బు వచ్చిందని అదంతా ఆవేళ వదినగారికి పంపుదామని అనుకుంది నిర్మల. ఇంతలో తన కోస్టెనో అజీజాకి స్కూటర్ ఆక్సిడెంట్ అయిందని—ఆమెను ఆసుపత్రిలో చేర్పించారని తెల్సి చూడ్డానికి వెళ్ళింది.

"....కాలికి దెబ్బ తగిలితే తగిలింది కాని నిజంగా నా మీద ఎవరెవరికి ఎంత ప్రేముందో తెల్సింది!" అని నవ్వింది అజీజా.

"మంచిదానివే!"



"నిజం నిర్మలా! ఆరేళ్ళనుంచి పద్మ నాతో పనిచేస్తోంది. తనకే అవసరం వచ్చినా నాతో చెపుతుంది. ఎన్నోసార్లు నాదగ్గర డబ్బు అప్పుచ్చుకుంది కాని, నాకిలాగయిందని తెల్సినా ఒక్కసారి చూద్దామని రాలేదు....మరి నువ్వు! నీతో పరిచయమయి ఆరునెలలైనా కాలేదు!...."

"ఈ డబ్బు నీదగ్గరుంచు. అవసరమయితే ఉంటుంది...." అంటూ వందరూపాయలు తీసిచ్చింది నిర్మల.

అజీజా కళ్ళు చెమర్చాయి. ప్రేమగా నిర్మల చేయి పట్టుకొని నొక్కింది. "మెనీమెనీ థేంక్స్ నిర్మలా! అవసరమయితే నేనే అడుగుతాను. నా దగ్గర డబ్బుంది...." అని తన పర్సు తీసి చూపించింది. "ఇలాంటప్పుడు డబ్బు కన్న మనిషి సాయం ఎక్కువ అవసరం!....సాయమంటే ఏదో చేయనక్కర్లేదు. ఇలా కాసేపు దగ్గర కూర్చుని మాట్లాడటం. నాకేయింత బాధనిపిస్తోందే—మరి ఆ బేబీకి ఎలా వుంటుంది? ఎంత లవ్లీగా ఉందో చూడు. పేరు రాజీ!...." అంటూ ప్రక్క బెడ్ మీద ఏడుస్తూ కూర్చున్న పదేళ్ళ అమ్మాయిని చూపించింది అజీజా.

వెక్కుతూ తనవైపు జాలిగా చూస్తున్న ఆ పిల్లని చూసేసరికి నిర్మల మనసు ద్రవించి పోయింది. "ఏం జరిగింది?" అని అజీజాని అడిగింది.

"వాళ్ళదో విషాద కథ" అంటూ ఆమె తనకు తెలిసిన వివరాలు చెప్పింది.

రాజీ తండ్రికి ఎందువల్లనో మతిస్థిరం తప్పింది. అతని భార్య హాస్పటలు చుట్టూ తిరుగుతున్న రోజుల్లో ఈ పిల్ల ఇంట్లో నిచ్చెన ఎక్కి పైనున్న బొమ్మేదో తీయబోయిందిట. జారి క్రిందపడి కాలు విరక్కొట్టుకుంది. ఆయన సైక్రియాటిక్ వార్డులో ఉన్నాడు. ఈ పిల్ల ఇక్కడ. రెంటి మధ్యా తిరగలేక ఆవిడకి ప్రాణాలు పోతున్నాయి. దీనికి తోడు వాళ్ళబ్బాయి. ఐదేళ్ళవాడు - తల్లిని వదిలి క్షణం ఉండడు. ఇంట్లో తోడెవరూ లేరు. ఇక్కడ రాజీని చూడ్డానికి ఎవ్వరూ లేరు. ఇంటి పనీ, హాస్పటలు పనీ చూసుకోలేక ఆవిడ చాలా అవస్థ పడుతోంది. ఈ బాధకితోడు బెడ్ ఖాళీ చేసి ఇంటికి తీసుకు పొమ్మంటున్నారు డాక్టర్లు. ఇంట్లో చూసే వాళ్ళెవరూ లేరు. ఇక్కడయితే తోటి పేషెంట్లేనా ఉన్నారని ఆవిడ ఆశ .... వాళ్ళగతి ఏమవుతుందో ఏమో!" అంది అజీజా బాధపడుతూ.

వాళ్ళ కథ వినేసరికి నిర్మల మనస్సు కదిలి పోయింది. రాజీని పలకరించకుండా ఉండలేక పోయింది. అప్రయత్నంగా ఆ పిల్లదగ్గరికి వెళ్ళింది. ఏడుపుమాని తనవైపు తెల్లబోయి చూస్తున్న రాజీని చూసి చిరునవ్వు నవ్వింది. ఇట్టే కబుర్లలో పెట్టేసింది. తను ఆంటీనని చెప్పింది.

"...నిజంగా మీరు మా ఆంటీయేనా?" అని అడిగింది రాజీ కళ్ళింత చేసి చూసి.

నిర్మల తలవూపింది.

"మరి ఎప్పుడూ మాయింటికి రాలేదేం?"

"నేనెక్కడో లండన్‌లో ఉన్నాను. మరి చాలా దూరం కదా!" అని నవ్వింది నిర్మల.

"ఓహో! లండన్! చాలా బావుంటుంది కదూ! దూరమయినా ప్లేన్ ఉందిగా! మా డాడీ చెప్పారు. ఒక్క రోజులో ఇండియాకి వచ్చెయ్యొచ్చుట!... బొంబాయి నుంచి ప్లేన్ దొరకలేదా?...."

రాజీ తెలివితేటలకి ముచ్చట పడింది నిర్మల. ఆ పిల్ల తల్లి వచ్చేవరకు నిర్మల, అజీజా ఎన్నో కబుర్లు చెప్పుతూ కూర్చున్నారు.

రాజీ తన కొత్త ఆంటీకి తల్లిని, తమ్ముడ్ని పరిచయం చేసింది. "మా బ్రదర్ రాజేష్! మా మమ్మీ జానీ! .... మా డాడీ జానీ అంటారు. పూర్తి పేరు జానకి!"

జానకి ముఖం ఎర్రనయింది. కూతుర్ని మందలించి "రాజీ మిమ్మల్నేమీ ఇబ్బంది పెట్టలేదు కదా!" అని అజీజాని అడిగింది.

"నిర్మల వచ్చింది కదా! మా ఇద్దర్కీ కావలసినంత కాలక్షేపం...." అని అజీజా నవ్వింది.

జానకి ముఖంలో అంతుపట్టని దిగులు గూడు కట్టుకుని వుంది. "వెంటనే రాజీని డిశ్చార్జి చేసేస్తామంటున్నారు. ఇకముందేం చేయాలో తెలియటం లేదు" అని తనలో తాను అనుకున్నట్లుగా అంది.

"చేయగలిగిన సాయం నేను చేస్తాను. నిరభ్యంతరంగా ఏం కావాలో నాకు చెప్పండి" అంది నిర్మల.

ఆమె ఏదో మాటవరసకందని జానకి అప్పుడు అనుకుందేమో మరి కాసేపట్లో నర్సు వచ్చి డిశ్చార్జి షీటు ఇచ్చాక నిర్మల తన వెంట బయలుదేరేసరికి ఆశ్చర్యపోయింది.

"ఆరునెలల పరిచయం నిన్ను నా దగ్గరికి తెచ్చిందనుకున్నాను. అరగంట పరిచయంతోనే

నువ్వు మరొకరి సాయానికి వెడుతున్నావు. నిజంగా నీది గొప్ప మనసు నిర్మలా!'' అంది అజీజా.

నిర్మల బిడియంగా నవ్వి మర్నాడు వస్తానని ఆమెతో చెప్పి బయలుదేరింది. తిన్నగా జానకితో వాళ్ళింటికి వెళ్ళింది... అనాదేకాదు అలా పది రోజులపాటు అజీజాని చూడటానికి, రాజీని చూడ టానికి వరసగా వెళ్ళింది. జానకి హాస్పటల్లో భర్తను చూసుకోటానికి వెళ్ళినప్పుడల్లా ఆమె యింట్లోవుండి పిల్లలిద్దర్నీ ఏమార్చేది. అవసర మయినప్పుడు ఒకటి రెండుపూటలు ఆఫీసుకి శలవు కూడా పెట్టింది. మరోసారి పిల్లలిద్దర్నీ తమ గదికి తీసుకువెళ్ళింది....వాళ్ళకామె దగ్గర బాగా చేరువ అయింది. అనుకోని అండ లభించ టంతో జానకికెంతో బాధ తగ్గినట్లనిపించింది.

ఓనాడు ''నా చర్మంతో చెప్పులు కుట్టిచ్చినా మీ ఋణం తీర్చుకోలేను.'' అంది ఆమె.

''అంత మాటనకండి! తోటిమనిషికీ మాత్రం సాయం చేయటం కూడా ఘనకార్యమేనా?'' అంది నిర్మల.

పిల్లలు చెప్పే కబుర్లను బట్టి వాళ్ళ తండ్రివైపు వాళ్ళెవరూ లేరనో - ఉన్నా వాళ్ళిక్కడికి రారనో అర్థమయింది నిర్మలకి. కొన్నాళ్ళ క్రితం వరకు వాళ్ళ తాతయ్య, మామయ్య, అత్తయ్యా యింట్లోనే ఉండేవారట. ఇప్పుడేమయ్యారో వాళ్ళూ రావటం లేదు. వాళ్ళకో పెద్ద మేడ ఉండేదట. మరెందుచేతో ఆ చిన్న యింటికి మారిపోయారు. వాళ్ళేం చెపు తున్నా విని పూరుకుందేకాని జానకిని ఏమీ అడగ లేదు నిర్మల. ఆమెకు తన సహాయమెంతవరకు అవసరమో అంతవరకే తెల్సుకోవటం భావ్యమని, వ్యక్తిగత విషయాలు అడగటం వల్ల ఆమె మనస్సు బాధ పెట్టినట్లవుతుందే తప్ప ప్రయోజనముండదని పూరుకుంది.

ఒకనాడు వాళ్ళ డాడీని చూసి చాలా రోజుల యిందని బిక్కమొగాలు వేసారు పిల్లలు: వాళ్ళ డాడీకి తనంటే ఎక్కువ యిష్టమని రాజీ - కాదు తనంటే ఎక్కువ యిష్టమని రాజేష్ తగవులాడుకు న్నారు. వాళ్ళని సముదాయించటంలో సందర్భ వశాత్తూ వాళ్ళ డాడీ ఫోటో ఉందా అని అడిగింది నిర్మల.

కాలికట్టుతో కదలలేకపోయిన అక్కని హేళన చేస్తూ రాజేష్ పరుగుపరుగున వెళ్ళి డాడీ ఫోటో తెచ్చాడు. ఆంటీకి చూపించాడు.

ఫోటో చూసేసరికి షాక్ తగిలినట్లయింది నిర్మలకి!

తండ్రిని గురించి పోటీలు పడుతూ పిల్లలింకా ఏవో గొప్పగా మాట్లాడుతూనే ఉన్నారు. కొన్ని క్షణాల క్రితం వరకు వాళ్ళ మాటలు ముద్దనిపిం చాయి. ఇప్పుడవి కర్ణకఠోరంగా ఉన్నాయి. 'మీ డాడీ ఒక కుటుంబాన్ని సర్వనాశనం చేసిన గొప్పవాడు.' అని చెపితే ఆ పిల్లకేమర్థమవుతుంది?

జానకి వచ్చేవరకు నిర్మలకి ముళ్ళ మీదున్నట్టుంది.

''ఇన్నాళ్ళకి ఆయన పరిస్థితి కొంచెం బాగు పడింది. ఇవేళ నన్ను గుర్తుపట్టారు.'' అంది ఆమె ఎంతో సంతోషపడుతూ.

నిర్మల మాట్లాడకుండా వెళ్ళటానికి లేచింది. ఆమె ముభావంగా ఉండటం గుర్తించింది జానకి. ''పిల్లలు మిమ్మల్ని చాలా శ్రమపెట్టినట్టున్నారు.'' అంది కంగారుగా.

ఆమెవైపు కొన్ని క్షణాలపాటు తదేకంగా చూసింది నిర్మల. కొన్నేళ్ళుగా తాను మనస్సులో అసహ్యించుకుంటున్న మనిషి, కొన్నాళ్ళుగా తను కళ్ళతో చూసి జాలిపడుతున్న మనిషి ఒక్కరేనా? విధి ఎంత చిత్రమైంది? జీవితంలో అనుకున్నవి జరగవు-అనుకోనివి హఠాత్తుగా జరిగిపోతాయి. చలించిపోయిన మనస్సుతో అక్కడ ఉండలేక ''నాకు కొంచెం పనుంది. వస్తానండి.'' అని జానకి జవాబుకయినా ఎదురు చూడకుండా గబగబా బయటకి నడిచింది నిర్మల.

## 58

ఆ వేళ అజీజాకి కట్టువిప్పారని తెల్సి చూడటానికి వాళ్ళింటికి వెళ్ళింది నిర్మల.

''....నువ్వు చాలా చిత్రమైనదానివి నిర్మలా! ఆవేళ ఆవిడ ఎవరో తెలియకుండానే వాళ్ళింటికి సాయానికి వెళ్ళావు. తర్వాత వాళ్ళ పిల్లలతో బాగా చనువు పెరిగాక హఠాత్తుగా వెళ్ళటం మానేసావు. నీకెందుకో కోపం వచ్చి నువ్వు రావటం మానేసా వని ఆవిడ ఎంతో బాధపడుతూ చెప్పింది. పావం, రాజీకి జ్వరమట!....తగ్గితేనే కాని కట్టు విప్ప నన్నాడు డాక్టరు....''

నిర్మల మనస్సు చివుక్కుమంది. రాజీ డాడీ అంటే దుర్మార్గుడు కావచ్చు. రాజీ మమ్మీ మంచి మనిషి కాకపోవచ్చు. కాని, రాజీ పసిపిల్ల! ఏం తప్పు చేసింది? తనను మమకారం పెంచమని చెప్పిందా? తెంచమని చెప్పిందా? తానింత నిర్దయగా ప్రవర్తించటం అన్యాయమనిపించింది.

తన మనసులోని బాధ పైకి చెప్పుకోలేక పోయింది నిర్మల. ''సారీ! తీరికలేక వెళ్ళలేక పోయానంతే! వాళ్ళ మీద నాకేం కోపం లేదు ..''

''అయితే. ఒక్కసారి వెళ్ళిచూడు. నీ అవసరం యిప్పుడు వాళ్ళకెంతయినా ఉంది.'' అంది అజీజా.

వెంటనే జానకి వాళ్ళింటికి బయలుదేరి వెళ్ళింది నిర్మల. ఆమెను చూస్తూనే రాజీ ఎగిరి గెంతినంత పని చేసింది. ''ఆంటీ! వచ్చారా! లండన్ వెళ్ళిపోయారేమోననుకున్నా.'' అంటూ ఆమెను చుట్టేసింది.

జానకి హాస్పటలునుంచి తిరిగి వచ్చేసరికి పిల్లలతో కబుర్లు చెపుతూ కనిపించింది నిర్మల. ఆమెకి ఆనందోద్వేగాలతో కళ్ళనీళ్ళు వచ్చాయి. ''వచ్చారా! నన్ను క్షమించి వచ్చారా?'' అంది.

నిర్మల గంభీరంగా ఉండిపోయింది.

''ఈ నాలుగు రోజులూ మీరు రాకపోతే పిల్లలకీ నాకూ ఎలాగో అనిపించింది. రాజీకి జ్వరం. నిద్దట్లో ఆంటీ ఆంటీ అని ఒకటే పలవ రింతలు! .... నిజంగా మీరు దేవుడు పంపినట్టే వచ్చారు!''

నిర్మలకి మనసులో వున్న కోపాన్ని అణచు కోవటం కష్టమయింది. ''నేను పరాయి దాన్ని. మీకు నేను చేయగలిగే సాయమేముంటుంది?''

ఆమె మాటల్లోని వ్యంగ్యాన్ని జానకి గుర్తించ లేదు. ''కాని, మీరు నమ్ముతారో లేదో .... ఈ క్షణంలో మిమ్మల్ని మించిన ఆప్తులంటూ నాకీ లోకంలో ఎవ్వరూ లేరు!''

''చాలా చిత్రంగా మాట్లాడుతున్నారు!''

జానకి గాఢంగా నిట్టూర్చింది. ''మీరు నా గురించి ఏమనుకున్నా ఆశ్చర్యం లేదు. కాని, నేనిప్పుడు ఈ బాధ ఎందుకు పడవలసి వస్తోందో నాకు తెలుసు! .... నేనో మహాపాపం చేశాను. ఒకరి ఉసురు పోసుకున్నాను. అందుకే అనుభ విస్తున్నాను.''

ఆమె గద్గద కంఠం నిర్మల్ని చకితురాల్ని చేసింది....ఆమె తనని గుర్తించిందా అని పరీక్షగా చూసింది. కాని, అలా కనిపించలేదు. అయినా తనెవరో తెల్సుకోవటానికి ఆమె కవకాశమేది?

జానకి కళ్ళొత్తుకుంటూ అంది. ''చేసిన పాపం

చెపితే పోతుందంటారు. కాని, చెపుదామన్నా నాగోడు వినేవాళ్ళెవరూ లేరు....''

ఆమె గురించి మనస్సులో యింకా కోపంగానే ఉన్నా ఏమని చెపుతుందో వినాలన్న కుతూహలాన్ని ఆపుకోలేకపోయింది నిర్మల. ''మీరు మంచి వారులా ఉన్నారు. ఒకర్ని కష్టపెట్టటమేమిటి?'' అంది.

జానకి కొన్ని క్షణాలపాటు మాట్లాడలేదు. ''మీరు శ్రమకాదనుకుంటే మరికొంత సేపు యిక్కడ ఉంటారా? కొంచెం త్వరగా పిల్లలకి అన్నంపెట్టి....''

''అలాగే! వాళ్ళు పడుకునేదాకా ఉంటాను.''

పిల్లలు అన్నాలు తిని పడుకునేదాక జానకి తన కథ చెప్పనూ లేదు నిర్మల అడగనూ లేదు....

ఆమెది వర్ణాంతర వివాహం. ఆమెది తక్కువ కులం. విశాల హృదయంతో అతను తనను పెళ్ళాడినందుకు ఆమె ఎంతో సంతోషపడింది. కాని, ఆ కారణంగా అతను తన వాళ్ళకి దూరమయ్యాడు.

''ముందే వాళ్ళవాళ్ళకు చెపితే పెళ్ళికొప్పుకోరన్నారాయన. కాని, తర్వాత వాళ్ళంతట వాళ్ళు వచ్చి పిలిస్తే వెళ్ళటానికి ఆయన ఒప్పుకోలేదు. కని పెంచి పెద్దచేసిన వాళ్ళని నాగురించి దూరం చేసుకోవటం తప్పని ఎన్నోసార్లు చెప్పాను. కాని, నన్నాయింట్లో తక్కువ కులందాన్నని హీనంగా చూస్తారని నిరుత్సాహపరిచారాయన. వాళ్ళవాళ్ళు నాగురించి ఏమని అనుకున్నారో నాకు తెలియదు కాని....ఆయన మాత్రం నా అదృష్టం పరీక్షించుకొనేందుకు ఒక్క అవకాశం కూడా యివ్వలేదు.''

నిర్మల కన్నార్పకుండా జానకి మాటలు వినసాగింది.

ఎప్పుడూ అతని దృష్టి డబ్బు సంపాదన మీదే ఉండేది. ఏదో పెద్ద బిజినెస్ పెట్టి కోటికి పడగలెత్తాలని ఆశ. దానికి ఆమె అన్నగారి ప్రోద్బలం కూడా తోడయింది. 'చేస్తున్న ఉద్యోగాలతో తృప్తి పడండి. అవసరాలకి మించి అర్రులు చాచకండి.' అని ఆమె తండ్రి చెప్పేవాడు. కాని, వాళ్ళు వినలేదు. ఒకటి రెండుసార్లు చిన్న వ్యాపారాలు చేసి నష్టపోయినప్పుడయినా గుణం పాఠం నేర్చుకొని బుద్ధి తెచ్చుకోలేదు. ఈసారి పెద్ద యెత్తున ప్లాను వేసారు. ఇంటిమీద అప్పు తెచ్చారు. నగానట్రా తాకట్టు పెట్టి అప్పుతెచ్చారు. బ్యాంకుల్లో అప్పుతెచ్చారు. కనపడినవాడి దగ్గరల్లా అప్పుపుచ్చుకున్నారు....

## ఆవేదన

అమాయకత్వమని మురిసి ఆకర్షింపబడ్డాను
''మాయ'' అని తెలిసేలోగా మనసును కోల్పోయాను.
నిష్కల్మష హృదయమని తలచి నిరాజనమిచ్చాను
కల్మషమని తెలిసి కన్నీటికి కరువయ్యాను.

నిస్వార్థంగా నన్నునీకు అంకితమిచ్చాను
నీ స్వార్థానికి నేనే ఆహుతయ్యాను.
మాటలమధువులు చవిచూసాను.
చేతల చేదుకు బలి అయ్యాను.

చెదిరిన హృదయంలో చెరగని నీ స్మృతులు
తెగిన తీగలు తెగ చేస్తున్న అపశ్రుతులు
పగిలిన సమర్పిత జీవిత దర్పణంలో
మిగిలాయి తీపిచేదుల బింబప్రతిబింబాలు

ఊహలు కరిగిపోగా—ఆశలు అణిగిపోగా
సగం మిగిలిన జీవితంలో రగిలాయి నిట్టూర్పులసెగలు
ప్రేమలసితమైన జీవితాన్ని చేసాను నివేదన
అర్పణకు ఫలితంగా అందుకున్నాను తీరని ఆవేదన

—''పరితప్త''

''ఆఖరికి వాళ్ళ నాన్నగార్ని డబ్బడగటానికి కూడా ఆయన వెనుదీయలేదు. ఇన్నేళ్ళ తర్వాత యింటికి వెళ్ళేది డబ్బు కోసమా—ఇది తప్పని ఎంతో ప్రాధేయపడుతూ చెప్పాను. కాని, ఆయన డబ్బు సంపాదనలో పడి మమకారాలు - మంచీ మర్యాదా అన్నీ మర్చిపోయారు. వాళ్ళను పీడించి డబ్బు తీసుకువచ్చారు! ఈయనింత చేసినా వాళ్ళొక్క మాట కూడా అనలేదు....ఇదిగో చూడండి! నన్నూ నా పిల్లలనీ తీసుకురమ్మని ఎంతో అభిమానంతో ఆ యింటి కోడలు వ్రాసిన ఉత్తరం!....'' అంటూ పెట్టెలో భద్రంగా దాచిన కవరు తీసిచ్చింది జానకి.

నిర్మల చదివింది. కన్నీటి తెరలను చించుకుంటూ చదివింది. ఆ అక్షరాలలో ఒలుకుతున్న అమృతాన్ని చవిచూస్తూ చదివింది.

జానకి తర్వాత జరిగిన కథ చెప్పసాగింది.... వాళ్ళని బిజినెస్‌లోకి దింపిన వాళ్ళు మోసంచేసి డబ్బంతా కాజేసారు. ఈ సంగతి విన్నవెంటనే గుండె జబ్బుతో ఉన్న ఆమె తండ్రి ప్రాణాలు పోయాయి....అప్పులు తీర్చటంకోసం యిల్లు, నగలు అన్నీ అమ్మేసాడు అన్నగారు....''ఈయన మూలంగానే ఇదంతా జరిగిందని నానామాటలూ అని మా అన్నయ్యా వదినా వేరే కాపురం వెళ్ళిపోయారు.''....ఆస్తీ, ఆయనవాళ్ళూ అంతా దూరమయ్యాక వాళ్ళబ్రతుకు వీధిని పడింది. ఇంత కాలం ఆడంబరమైన జీవితానికి అలవాటు పడ్డాడు అతను. ఉద్యోగం ఉన్నా హాయిగా జీవించటానికి అవకాశం ఉన్నా ఆశించినవన్నీ భగ్నమవటంతో ఒక్కసారిగా ఈ అఘాతాలకి తట్టుకోలేకపోయాడతను. మతిస్థిరం తప్పింది....

''ఆ మహా ఇల్లాలిని బాధ పెట్టిన పాపం ఊరికే పోలేదు. మేమిప్పుడు నరకం అనుభవిస్తున్నాము!'' అంది జానకి గద్గదస్వరంతో.

నిర్మల కళ్ళింకా ఆ ఉత్తరం మీదే ఉన్నాయి.

''ఆస్తులు శాశ్వతం కాదు. డబ్బు శాశ్వతం కాదు....ఆత్మీయులంటూ ఉండాలి! కష్టంలో కనికరించే వాళ్ళుంటూ ఉండాలి!....అది ఆయన తెల్సుకోలేదు. చూడండి మా బ్రతుకులేమయ్యాయో!...''

నిర్మల మనసు ద్రవించిపోయింది. జానకి నిజరూపం ఆమెకు కళ్ళకు కట్టింది. ఇన్నేళ్ళుగా తను అసహ్యించుకోవలసినంత అపరాధం ఆమె చేయలేదని స్పష్టమయింది. ఆమె కులంలో

తక్కువేమో కాని గుణంలో కాదు! .... నిర్మల మనసులో ఆమె మీద మొలకెత్తిన అభిమానం అంతలోనే మొగ్గతొడిగి పుష్పించి పుష్పాది విరజిమ్మింది!

"అయ్యో! నా కోసం మీరు కంట తడిపెడు తున్నారా!...." అంది జానకి ఉద్వేగపూరిత స్వరంతో.

చటుక్కున ఆమె చేతులు పట్టుకుని "వదినా" అని ఉద్రేకంగా పిలిచింది నిర్మల.

జానకి నివ్వెరపోయింది. "వ....ది....నా?"

"నేనెవర్ననుకుంటున్నారు? రాజీకి ఒట్టి అంటీని కాదు. నిజమైన అంటీనే. అంటే అత్తని! కృష్ణారావుగారి చిన్న చెల్లెల్ని!"

ఆశ్చర్యంతో ఆనందంతో సంభ్రమంతో ఉక్కిరి బిక్కిరయి తట్టుకోలేక వణికిపోయింది జానకి!

నిర్మల మృదు స్పర్శ ఆమె బాధని నెమ్మది నెమ్మదిగా కరిగించి వేసింది!

## 59

చాలా రోజుల తర్వాత కృష్ణవేణికి ఉత్తరం వ్రాయటానికి కూర్చుంది నిర్మల....

"మనం అసహ్యించుకుని ఎవర్నీ మార్చలేం. మంచి ఉద్దేశ్యంతోనే మన ప్రయత్నం మనం చేద్దాం .... అని ఒకప్పుడు నువ్వన్నమాటలు ఎంత జీవితానుభవంతో నిండినవి! అప్పుడు నువ్వు పడిన శ్రమ వృధా కాలేదు వదినా! ఆ సమయం వచ్చింది-'పెద్దన్నయ్య' రాతి గుండె కరిగింది!"

హాస్పటల్లో రాజీని చూసిన క్షణం నుంచి ఆనాటి వరకు జరిగిన గాధంతా పూసగ్రుచ్చినట్టు తన ఉత్తరంలో వ్రాయసాగింది నిర్మల.

"ప్రతి రాత్రి తర్వాత ఒక పగలు వుంటుంది. చీకటి తర్వాత వెలుగురాక మానదు. ఒకప్పుడివి కేవలం చదివి సంతోషించటానికి పనికి వచ్చే మాటలనుకున్నాను. కాని, పదిహేడేళ్ళ రాత్రి గడిచిపోయింది వదినా! ఇప్పుడు కాంతులు విర జిమ్మే పగలు ప్రారంభమయింది .... అన్నయ్య అప్పటి అన్నయ్యకాదు. ఇప్పుడు పూర్తిగా మారి పోయాడు! గడిచిపోయింది పీడకలలో జరుగు తున్నది తియ్యని కలలో నాకు అంతుపట్టటం లేదు. ఈ అన్నయ్యేనా ఇంతకాలం మనకి దూరమయిన వాడు - అని నా కెంతో ఆశ్చర్యంగా వుంది...."

తానెలా అన్నగార్ని కలుసుకున్నదీ — రామ చంద్రం సాయంతో పెద్ద డాక్టర్ని సంప్రదించి ఎలా ట్రీట్‌మెంటు ఇప్పించిందీ-ఆ తర్వాత అన్న గారు తన్ను గుర్తించి పశ్చాత్తాపంతో బాధపడిన సంగతీ....వివరంగా వ్రాసింది నిర్మల.

"ఈ వదిన ఎటువంటిదో తెలియక ఇదివరకు ఎంతో అసహ్యించుకొనేదాన్ని. అన్నయ్య దూర మవటానికి ఈ వదినే కారకురాలని నాకు కోపంగా ఉండేది.... కాని, నేనెంతో పొరపడ్డాను వదినా! చూడని మనిషిని-తెలియని మనిషిని నిందించటం మనకి భావ్యం కాదని నువ్వన్న మాటలే నిజ మయ్యాయి!....ప్రతి మనిషిలోనూ మంచితనం సహజంగా ఉంటుందన్న నీ నమ్మకమే నిజం!.... ఈ వదిన కూడా చాలా మంచిది!...."

జానకి గురించి - ఆమె పిల్లల గురించి తనకు తెలిసిన వివరాలన్నీ వ్రాసింది నిర్మల.

"పెద్దన్నయ్య నన్ను, రవిని తన దగ్గరకి వచ్చి వుండమన్నాడు. కాలం విడదీసింది. మళ్ళీ కాలమే కలిపింది. నేనంటే సమాధానపడిపోయాను. కాని, రవికి అన్నయ్యంటే బొత్తిగా తెలియదు. ఇంత కాలం నాలాగే తనూ అసహ్యించుకున్నాడు. ఇప్పటికీ వాడికి కోపం తగ్గలేదు. మన అవసరం వాళ్ళకుంది కనుక రమ్మంటున్నారంటాడు. వెర్రి వెధవాయి, వాడికింకా లోకానుభవం ఏది?.... అంత పెద్దవాళ్ళు అన్నయ్య, వదిన వచ్చి వాడిని క్షమాపణ అడగటం....నాకు మరీ సిగ్గేసింది సుమా! వాడి నొప్పించి నేనే తీసుకువస్తానని....వాళ్ళని మనస్సు కష్టపెట్టుకోవద్దని చెప్పాను. ఏమయినా, మనమంతా ఒక్కసారి కలుసుకోవాలి! ఏళ్ళ తరబడి మనస్సులో పేరుకున్న బాధని కరిగించుకో వాలి! ఆ రోజు ఎంత త్వరగా వస్తుందా అని ఎదురుచూస్తున్నాను!...."

తను కథల్లో మార్పులు చేర్పులు చేసినట్టే తను కథంత వ్రాసిన ఉత్తరాన్ని మళ్ళీ చదువుతూ సవరణలు చేస్తోంది నిర్మల.

ఇంతలో భళ్ళున తలుపులు తెరచుకొని ఎవరో లోపలికి వచ్చారు. వచ్చిందెవరో గుర్తించేలోపల అతను గబుక్కున తలుపులు గడియ పెట్టటం జరిగిపోయింది. "ఎవరది?" అని గట్టిగా అరిచింది నిర్మల.

సుబ్బారావు! అతన్ని చూసి ఆమె కోపా వేశాలతో వణికిపోయింది. "ఎందుకు వచ్చావు ఇక్కడికి? ఏమిటి నీ ఉద్దేశం? వెంటనే బయటికి వెళ్ళకపోతే అరుస్తాను!" అని గద్దించింది.

సుబ్బారావు చేతులెత్తి దండం పెట్టాడు. "అంత పని చేయకు నిర్మలా! పోలీసులు బయట పోలీసులు తరుముతున్నారు." నిర్మల అతనివైపు అనుమానంగా చూసింది.

అతను నిజంగానే భయంతో వణికిపోతున్నాడు. "ఒకప్పుడు వెధవపని చేసాను. నాకు బుద్ధి చెప్పావు. మళ్ళీ అలాంటి పని చేస్తానా? నాకు ఉద్యోగం పోయింది. నామీద కేసు ఋజువయింది. ఇప్పుడు అరస్టు వారంటుతో పోలీసులు నా వెంట తిరుగుతున్నారు. మా వూరి నుంచి తప్పించుకొని యిక్కడికెలాగో చేరాను. అప్పుడే ఇక్కడికి కబురు ఎలా వచ్చిందో నా గురించి వెతుకుతు న్నారు. నన్నెలాగయినా దాచిపెట్టు....పోలీసులకి దొరక్కుండా రక్షించు...." అంటూ దాదాపు ఏడ్చేసాడతను.

మట్టి కొట్టుకుపోయిన బట్టలతో అతని ఆకారం చూసేసరికి ఆమెకిదంతా నమ్మక తప్పలేదు.

"సరే, స్నానం చేసి బట్టలు మార్చుకో! ఆ తర్వాత యేం చేయాలో ఆలోచిద్దాము."

అతను కట్టుగుడ్డలతో వచ్చాడు. అతను స్నానం చేసాక మార్చుకోటానికి ఏమివ్వాలో తోచలేదు నిర్మలకి! "రవి పైజమా సరిపోతుందా?" అంది సిగ్గుపడిపోతూ.

అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "బట్టల కేమొచ్చింది నిర్మలా! ఏమయినా ఫర్వాలేదు జైలుకి వెడితే వాళ్ళే యిస్తారు!" అన్నాడతను చేతులతో ముఖం కప్పుకుంటూ.

"బాధపడకు బావా! జరిగిందేదో జరిగి పోయింది."

"జరిగింది మామూలుగా జరగలేదు నిర్మలా! నా జీవితం సర్వనాశనమయిపోయింది. చేజేతులా యిదంతా చేసుకున్నాను."

అతన్నెలా ఓదార్చాలో ఆమెకు తోచలేదు. మరి కాసేపట్లో ఎవరో ఫ్రెండు దగ్గరికి వెళ్ళిన రవి వచ్చాడు. తమ్ముడ్ని రామచంద్రాన్ని పిల్చుకు రమ్మని పురిగెత్తించింది నిర్మల.

రామచంద్రం వచ్చాడు. జరిగిందంతా విన్నాడు. విషయం చెప్పి కృష్ణారావుని పిల్చుకువచ్చాడు. ఇద్దరూ సంప్రదించుకున్నారు. ఒక లాయరు దగ్గరకి వెళ్ళి సలహా అడిగారు.

"సాక్ష్యం బలంగా వుందంటున్నారు. అలాంటప్పుడు పోలీసుకేసు నుంచి తప్పించుకోవటం వల్ల ప్రయోజనం లేదు. ఆయనంతట ఆయన పట్టుబడిపోతే శిక్ష తగ్గుతుంది." అన్నాడు లాయరు.

"పోనీ, మీ నాన్నగారితో మాట్లాడి వస్తాను." అన్నాడు రామచంద్రం.

సుబ్బారావు తల అడ్డంగా తిప్పాడు. "మా నాన్నకి నా మీద కోపంగా వుంది. నేను జైలుకి వెళ్ళినా వచ్చి చూడను పొమ్మన్నాడు. చేసిన తప్పుకి నేను శిక్ష అనుభవిస్తాను. జైలుకి వెడతాను. కాని, ఏ పాపం ఎరుగనిది - పార్వతి గతి ఏమవుతుందా అని నా బాధ!"

"అదంతా మనస్సులో పెట్టుకొని బాధపడకు బావా! నువ్వు తిరిగి వచ్చేవరకు అక్కయ్యని నా దగ్గరే వుంచుకుంటాను." అని ధైర్యం చెప్పింది నిర్మల.

సుబ్బారావు పోలీసులకి లొంగిపోయాడు. కోర్టులో నేరం కూడా ఒప్పుకున్నాడు. తొమ్మిది నెలలు జైలు శిక్ష పడింది. రెండువేలు జరిమానా వేసారు. అది కట్టకపోతే జైలు శిక్ష పెరుగుతుందన్నారు. అతని తండ్రి అదేమీ పట్టించుకోలేదు సరికదా-కోర్టుకి కూడా రాలేదు. నిరాశ చేసుకొని ఎక్కువ శిక్ష అనుభవించటానికే సిద్ధపడ్డాడు సుబ్బారావు.

కాని, రామచంద్రం అప్పుతెచ్చాడు. నిర్మల అప్పుతెచ్చింది. కృష్ణారావు అప్పుతెచ్చాడు.... అంతా తలో చెయ్యీ వేసేసరికి ఆ గండం గడిచింది.

"నాలాంటి దౌర్భాగ్యుడి కోసం మీరంతా శ్రమపడుతున్నారు. నేను మీ ఆదరాభిమానాలకి తగను!...." అని సుబ్బారావు చిన్న పిల్లాడిలా ఏడ్చాడు.

అతన్ని ధైర్యంగా వుండమని.... జైలునుంచి విడుదల కాగానే ఎక్కడో అక్కడ ఉద్యోగం చూసిపెడతామని చెప్పివచ్చారు - రామచంద్రం, కృష్ణారావులు.

### కళ్ళు

అందానికి, ఆరోగ్యానికి ప్రతిబింబాలు కళ్ళు! కాని కొందరి కళ్ళకు క్రింది భాగంలో నల్లటి చారలు యేర్పడతాయి. అవి అందాన్ని తగ్గించడమే కాదు, వాళ్ళ వయసునూ మరింత ఎక్కువగా చూపుతాయి. అలాంటి వాళ్ళు కొన్ని రోజుల పాటు మల్టీ వైటమిన్ మాత్రలు వాడటం మంచిది. రోజుకు రెండు గ్లాసుల పాలు తీసుకుంటే కళ్ళ ఆరోగ్యానికి ఎంతో మేలు చేస్తాయి. టొమేటోలు, కేరట్, బీట్‌రూట్ మొదలైన తాజా కూరగాయలను మాత్రమే కాకుండా రోజూ ఆకు కూరలు, పళ్లు ఆహారంలో విరివిగా తీసుకోవాలి. రోజుకు ఎనిమిది గంటలకు తక్కువ కాకుండా నిద్రపోవాలి. పొగత్రాగటం, మధుపానం లాంటి అలవాట్లు వుంటే మానుకోవడం ఎంతైనా అవసరం.

శుభ్రమైన పల్చటి తెల్లగుడ్డ ముక్కను లేదా దూదిని ఐస్ నీళ్ళలో ముంచి దానిని అప్పుడప్పుడు కళ్ళు మూసుకుని రెప్పల మీద వుంచినట్టయితే కొన్నాళ్ళకు చారలు మాసిపోతాయి.

"ఇదివరకు నిన్నెన్నో పాడు మాటలన్నాను. నా మంచికోరి నువ్వెన్ని చెప్పినా నీదే తప్పని తూలనాడాను. పెద్దదాన్నన్న అహంకారమే కాని నువ్వు చెప్పిన మాటల్లోని మంచితనం అర్థం చేసుకోలేదు....అందుకే నాకు బాగా శాస్తి జరిగింది. అత్తారింట్లో గౌరవం పోయింది. పుట్టింట్లో గౌరవం పోయింది. ఆయన జైలు పాలయ్యారు. నా బ్రతుకిలా అయింది...." అని బావురుమంది పార్వతి.

"అదంతా మర్చిపో అక్కా! నేనుండగా నీకే కష్టం రానివ్వను. బావ తిరిగివచ్చి, నిన్ను తీసుకు వెళ్ళగలిగేవరకు నా దగ్గరే వుండు...." అంది నిర్మల ధైర్యం చెపుతూ.

"నేను నీ ఆదరణకి తగను....పాపిష్టిదాన్ని! నన్ను నువ్వు క్షమించకూడదు...."

"నిన్ను నువ్వు తిట్టుకుంటే నాకు సంతోషం కాదక్కా! నువ్వు మారాలని కోరాను. ఇప్పుడు నిన్ను చూస్తుంటే నాకెంతో గర్వంగా వుంది."

"నేను నీ మీద భారంగా కూర్చోలేను, నాకేదయినా పని యిప్పించు. ఆఖరికి కూలిపని అయినా సరే చేస్తాను." అంది పార్వతి ఆవేశంగా.

నిర్మల చకితురాలయింది. "అక్కా!...."

"అవును నిర్మలా! ఒకప్పుడు నిన్ను హేళన చేసాను. కాని, ఈవేళ కూలిదానికున్న గౌరవమేనా నాకుందా? నువ్వు మంచి ఉద్యోగమిప్పిస్తానంటే కాలదన్నుకున్నాను. ఇప్పుడనుభవిస్తున్నాను. ఇప్పటికయినా నాకు బుద్ధొచ్చింది. నా తిండి నన్ను సంపాదించుకోనియ్యి."

అభిమాన పడుతున్న అక్కగార్ని చూసేసరికి నిర్మల మనస్సు ద్రవించిపోయింది. "అలాగే అక్కా! ఏదయినా పని చూపించమని బావగారితో చెపుదాము."

రామచంద్రం ఎవరి ద్వారానో ప్రయత్నించి 'బాలభారతి' అన్న చిన్న పాఠశాలలో పార్వతికి పని యిప్పించాడు. ఆమె సంతోషంతో వెళ్ళి చేరింది.

మొదటి జీతం తెచ్చుకొని యింటికి వచ్చిన రోజున అక్కగారి కళ్ళల్లో నీళ్ళు చూసి చలించిపోయింది నిర్మల. "నీ కష్టార్జితం నీ చేతుల్లో ఉన్నప్పుడు నీకెంత బలం వస్తుందో చూసావా అక్కా! ఇటువంటి మంచిరోజు కోసమే ఒకప్పుడు నిన్ను సూదుల్లాంటి మాటలతో దెప్పి పొడిచాను!"

"నిజం నిర్మలా! నేను నీకన్న ముందు పుట్టాను. కాని, లోకంలో చూసి నేర్చుకున్నది చాలా తక్కువ. నీనుంచి నేర్చుకోవల్సింది ఎంతో వుంది." అంది పార్వతి నిండు మనస్సుతో.

"ఇప్పుడే అమ్మ కనుక యిక్కడుంటే ఎంత సంతోషించేదో!"

పార్వతి ముఖం ఎర్రనయింది. "ఆయన తిరిగి రాకుండా నేనీ పాడు ముఖాన్ని అమ్మకి చూపించలేను."

# పెరుగుతున్న సంవత్సరాలు కాల్షియం-శాండోజ్® సంవత్సరాలు





పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పనిదనంనుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది.

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు. అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి.

రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టి పళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి.

విటమిన్ సి. డి. మరియు బి12తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్ళల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది.

**కాల్షియం-శాండోజ్ స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్ వారు రూపొందించినది, ప్రపంచంలోని అత్యుత్తమమైన కాల్షియం.**




## కాల్షియం-శాండోజ్®

**గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం**




daCunha/CS/26 TL

అప్పుడే జానకి కృష్ణారావులు వచ్చారు.

"ఇంకా మీకు నామీద కోపం పోలేదామ్మా!" అన్నాడు కృష్ణారావు బాధగా.

"అదేం లేదన్నయ్యా! వద్దామనే అనుకుంటు న్నాము. కాని...." అని ఆగిపోయింది నిర్మల. ఇటీవల అన్నగారి విషయంలో హాస్పటలు చుట్టూ తిరగటంవల్లనైతేనేమి, బావగారి విషయంలో కోర్టుల వెంట వెళ్ళటంవల్లనైతేనేమి, నిర్మలకి డబ్బు బాగా ఖర్చయిపోయింది. ఇంటికి పంపే డబ్బు చాలా తక్కువయిపోయింది. పెద్దన్నగారింటికి వెడితే కొంత ఊపిరి సలపవచ్చు. ఇంటికి ఎక్కువ పంపటానికి వీలుకావచ్చు. కాని, తనలా అక్క సరిపెట్టుకుంటుందా? ఈ 'క్రొత్త వదిన'ని ఆద రించి మాట్లాడుతుందా? కులాల ఎక్కువ తక్కువల గురించి మనస్సుల్లో మార్పు వచ్చేవరకు మాటల్లో చేతల్లో విశాలభావం వ్యక్తం కావటం కష్టం! మరి అక్క మారినట్టేనా?.... ఈ అనుమానాలతో ఎటూ చెప్పలేకపోయింది నిర్మల.

"పెద్ద యిల్లు తీసుకుంటాను. అక్కడ మీకే లోటూ రాకుండా చూస్తాను. ..అంతగా మీ వదిన వండింది మీకు తినటం యిష్టం లేకపోతే...."

నిర్మలకి మనస్సు చివుక్కుమంది. "ఏం మాటలవి అన్నయ్యా! నేనెన్నిసార్లు మీ యింట్లో తినలేదు! ఇంకెప్పుడూ అలాంటి మాటలనకు. మావల్ల మీకిబ్బంది కలుగుతుందనే కాని.... రాకూడదని కాదు. రావాలని లేక కాదు..".

"మీవల్ల మాకే యిబ్బందీ లేదు....పోనీ వచ్చి కొన్నాళ్ళుండండి. మీకు సంతృప్తిగా లేక పోతే అప్పుడే వెళ్ళిపొండి నేనడ్డు చెప్పను...." అంది జానకి.

"ఏమంటావక్కా!" అంది నిర్మల.

అప్పటి పార్వతి కాదు యిప్పటి పార్వతి. చెల్లెలి మాటంటే ఎంతో గౌరవం. వేదమన్నా అతిశయోక్తిలేదు. "నీ యిష్టమే నా యిష్టం!" అంది.

రవివైపు చూసింది నిర్మల. రాజీ, రాజేష్‌లతో అతనికీమధ్య బాగా చనువయింది. తమ్ముడి ముఖం ప్రసన్నంగా ఉండటం చూసి నిర్మల నవ్వింది. "ఏమంటావయ్యా తమ్మయ్యా!"

ఆశగా చూస్తున్న అన్నగార్నీ – ప్రాధేయ పూర్వకంగా చూస్తున్న వదినగార్నీ చూసి చలించని రవి బింకం "....మా యింటికి రావా అంకుల్!"



'ఒకళ్ళకి మించి యిప్పుడు వద్దు. ఇద్దరికి మించి ఎప్పుడూ వద్దు'–ఇది మన దేశం లోని కుటుంబ నియంత్రణ నినాదం. కాని సోవియట్ రష్యాలో అలా కాదు. ఎంతమంది పిల్లల్ని కంటే అంత గొప్ప. ప్రభుత్వం కూడా వారిని ఘనంగా సత్కరిస్తుంది. అలా సత్కరింపబడిన_ టాయ్‌సియా ట్యుట్యున్నిక్ అనే వనితకు యిటీవల 'అధిక సంతానవతి' బిరుదూ, బహుమతి లభించాయి. మాస్కోలోని ఒక డిపార్ట్‌మెంటల్ స్టోర్‌లో పని చేస్తున్న టాయ్‌సియాకు పదకొండుమంది సంతానం. ఇలా ఎక్కువమంది సంతానం గల వనితలను సత్కరించడమే కాక, ఆ ప్రభుత్వం వారికి అధిక మొత్తాలలో జీవనోపాధికి, పిల్లల ఆలనాపాలనకి నిధులు కూడా సమకూరుస్తుందట!

అని రాజేష్ చెయ్యి పట్టుకుని లాగేసరికి సడలి పోయింది.

ఆ రాత్రి కూర్చుని కృష్ణవేణికి మరో ఉత్తరం వ్రాసింది నిర్మల.

"జీవితం ఎంత చిత్రమయిందో చూసావా వదినా! మారాలి. మనుషులు మారాలి. మారి మంచి దారిని పడాలి. అని మనమెంతో తపన పడతాం. అదేం చిత్రమో - మనం ఆశించినంత కాలం మారరు. కనీసం మనమేం చెపుతున్నామో, ఎందుకు చెపుతున్నామో అర్థం చేసుకోటానికి ప్రయత్నించరు. ఇక ప్రాణం విసిగి మనం గుండె రాయి చేసుకున్నాక ఏదో ఒక రోజున హఠాత్తుగా మారిపోతారు. ఏదో ఒక బలమయిన సంఘటన వల్లనే మారవచ్చు. అయినా, వాళ్ళు మారి దారి మళ్ళించుకున్నప్పుడు మనకెంత రిలీఫ్‌గా వుంటుంది! ఈ ఆనందాన్ని పట్టటం నా తరం కావటం లేదు. ఒక్కసారి రెక్కలు కట్టుకువచ్చి నీతో ఈ సంతోష వార్తలన్నీ చెప్పాలని వుంది!"

## 60

హైదరాబాదు శుభవార్తలు నిర్మల వ్రాస్తున్న ఉత్తరాలవల్ల తెలియటమేకాదు........రాఘవరావు కళ్ళారా చూసివచ్చి చెప్పటం కూడా జరిగింది.

రిటయిరయిపోయిన వెంటనే తండ్రిని తన దగ్గరికి రమ్మని చాలా రోజులుగా చెపుతున్నాడు రామచంద్రం. కూతురు పెళ్ళయినప్పటి నుంచీ ఒంటరితనం భరించటం ఇతనికీ కష్టమయింది. ఇంక ఉండలేక స్వంత యింట్లో ఎవర్నో అద్దెకు పెట్టి-కొడుకు దగ్గరికి వెళ్ళిపోయాడు రాఘవరావు. అక్కడుండి చూడటం మూలాన నిర్మల విషయా లన్నీ అతనికీ తెలిసాయి.

కృష్ణారావు గురించి నిర్మల వ్రాసిన సుదీర్ఘలేఖ కృష్ణవేణికి అందిన వారంలోనే కూతుర్ని చూద్దా మనిపించి వచ్చాడు. నిర్మల వ్రాయగా మిగిలిన వేవీ చెప్పటానికి లేకపోయినా - విన్నది కన్నది మరింత వివరంగా చెప్పాడు. కృష్ణారావులో మార్పు వచ్చినందుకు అంతా సంతోషించారు.

తర్వాత నెల తిరక్కుండా అతను మళ్ళీ వచ్చాడు. ఈ మాటు కోడల్ని కూడా వెంట బెట్టుకు వచ్చాడు. మాధవికి ఐదో నెల వచ్చిందని సీమంతం చేయించాలని వాళ్ళ ముచ్చట.

"ఇప్పుడివన్నీ ఎందుకు నాన్నా!" అంది మాధవి సిగ్గుపడుతూ.

"నీకోసం కాదు మా అల్లుడి కోసం!" అని ఏవో పరిహాసాలు చేసింది సుజాత.

కూతురితోపాటు కృష్ణవేణికి కూడా క్రొత్త చీర పెట్టాడు రాఘవరావు. అది పుచ్చుకోటానికి ఎంతో బిడియపడింది ఆమె.

"మధూకి అక్కవయినా, తల్లివయినా నువ్వే కాదమ్మా!........కాదనకు." అన్నాడతను నిండు మనస్సుతో.

అక్కగారి మీద తండ్రి చూపిన అభిమానానికి ఎంతో ఆనందపడింది మాధవి.

ఆమెను తమ కూడా తీసుకు వెళ్ళటానికే వచ్చా మంది సుజాత.

"ఇప్పటి నుంచీ కాలేజీకి శలవుపెట్టి మీ యింటికి వచ్చి కూర్చోనా? పొరపాటున విన్నావేమో వదినా! తొమ్మిదో నెల కాదు ఐదో నెల!" అని నవ్వింది మాధవి.

"నీకే నెలయినా ఇంక కాలేజీకి వెళ్ళేది ఒక్క నెలేకదా! ఈ నెలాఖరికి మీ శ్రీవారి ట్రయినింగు పూర్తయిపోతుంది. అప్పుడాయన ఎక్కడుంటే తమరక్కడ!"

అంతవరకు అక్కగారి నుంచి దూరంగా వెళ్ళే రోజు దగ్గర పడిందన్న ఆలోచనే రాలేదు మాధవికి. ఆ మాట విన్నాక ఏదో దిగులుతో ఆమె గుండె నిండిపోయింది.

ఒంటరిగా కూర్చున్న చెల్లెలి దగ్గరికి వచ్చి "ఏమిటి మధూ అలా వున్నావ్?" అని అనునయంగా అడిగింది కృష్ణవేణి.

తన మనసులోని భయాలు బయట పెట్టుకుంది మాధవి. "నిన్ను విడిచి ఉండాలంటే" ఆపై మాట రాక దుఃఖంతో ఆమె గొంతు పూడి పోయింది.

చటుక్కున చెల్లెల్ని తన గుండెలకి హత్తుకుంది కృష్ణవేణి. "ఈ యెడబాటన్నది మన శరీరాలకే కాని మనస్సులకి లేదు మధూ! నువ్వు, మురళి కలిసి సుఖంగా ఉండే రోజు దగ్గరికి వచ్చింది. నాకిప్పుడెంతో సంతోషంగా ఉంది."

"కాని,...."

"కాని, ఈ పరిస్థితిలో నిన్ను వదలి ఎలా వెళ్ళగలనక్కా!" అని చెప్పాలనుకుంది మాధవి.

అంతకుముందే ఆమె బాధ గ్రహించి "నువ్విప్పుడు ఎలాంటి దిగులూ మనసులో పెట్టుకో కూడదు. ఎప్పుడూ సంతోషంగా ఉండాలి. బరువైన పనేకాదు - బరువైన ఆలోచనలు కూడా చేయ కూడదు. పండంటి పాప నెత్తుకొనేవరకు ఇంకే బాధ్యతలూ ఎత్తుకోనూకూడదు! తెలిసిందా!" అని నవ్వింది కృష్ణవేణి.

మాధవి దిగులు కరిగిపోయేలా మరి కొన్నాళ్ళకి ఇంకో శుభవార్త కూడా తెచ్చింది నిర్మల ఉత్తరం. పార్వతీ సుబ్బారావుల జీవితాల్లో ఎలాంటి మార్పు వచ్చిందో స్వయంగా చూసి వచ్చి చెప్పాడు రాఘవ రావు. అతను దాదాపు ప్రతి నెలా వచ్చి కూతుర్ని చూసి వెడుతూనే వున్నాడు!

ఎప్పటికీ మారరనుకున్న మనుషులు మారుతున్నారు. మంచివైపు దారి మళ్ళించుకుంటున్నారు. వాళ్ళలాగే ఈ బావగారు కూడా త్వరలోనే మారవచ్చు! తన అక్కగారి కష్టాలు గట్టెక్కిపోవచ్చు!

ఇప్పుడు మాధవి మనసులోని ఆశాజ్యోతి మినుకుమినుకు మనటం లేదు. ఎంతో వెలుగు విరజిమ్ముతూ దేదీప్యమానంగా వుంది!

## 61

మురళీమోహన్‌కి ట్రయినింగు అయిపోగానే హైదరాబాదులోనే పోస్టింగు వచ్చింది.

స్టేషనులో తన్ను రిసీవ్ చేసుకోటానికి వచ్చిన వాళ్ళని చూసి అతనానందంతో ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. దూరంగా నిలబడిన పెద్దన్నగారి చేయి పట్టుకుని చిన్నన్నగారి దగ్గరికి తీసుకు వచ్చింది నిర్మల.

తన ముఖంలోకి చూడలేక అపరాధిలా తల దించుకున్న అన్నగార్ని చూసి మురళీమోహన్ చలించిపోయాడు. హైదరాబాదు విశేషాలు ఎప్పటికప్పుడు నిర్మల ఉత్తరాల ద్వారా అతనికి తెలుస్తూనే వున్నాయి.

"చిన్నన్నయ్యా! అన్నయ్య!...." అని నిర్మల హెచ్చరించింది.

పునర్జన్మ ఎత్తి ఎదుట నిలిచిన అన్నగారిని పొంగి వచ్చిన అభిమానంతో గబుక్కున కౌగలించుకున్నాడు మురళి. రాజీని, రాజేష్‌ని దగ్గరికి పిలిచి వాళ్ళకి చిన్నాన్నని పరిచయం చేసింది నిర్మల.

మురళీమోహన్ కళ్ళు చుట్టూ వెదకటం చూసి "మా మరదలిక్కడెక్కడా దాక్కోలేదండీ!.... వాళ్ళక్కయ్యని వదలిరాదుట! మీరెళ్ళి కోర్టులో దావా వేస్తే కాని మీతో కాపురం కూడా చేసేలా లేదు...." అంది సుజాత నవ్వుతూ.

అతను సిగ్గుగా నవ్వాడు. రాజీ ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని "అమ్మని తీసుకు రాలేదేం?" అని అడిగాడు.

"మమ్మీ ఇంట్లోనే ఉంది అంకుల్!" అంది రాజీ.

"రండి బావగారూ! అంతా యింటికి వెళ్ళి మాట్లాడుకుందాం!" అని దారి తీశాడు రామచంద్రం.

అంతా రావటంతో కృష్ణారావు యిల్లు సందడిగా వుంది!

"మీరంటే అభిమానించే వాళ్ళింతమంది వున్నారు! నా ఒక్కదాని కోసం ఇంతకాలం వీళ్ళనందర్నీ ఎందుకు దూరం చేసుకున్నారు!" అంది జానకి భర్తతో.

అప్పుడే ఆ గదిలోకి వచ్చిన నిర్మల ఆ మాటలు వింది. "మిమ్మల్ని మీరు వేరు చేసుకుని మాట్లాడకండి వదినా! అన్నయ్యంటేనే కాదు మీరన్నా మాకు అభిమానమే! ఇంతవరకు వదిన వచ్చి మాట్లాడలేదేమని చిన్నన్నయ్య అడుగుతున్నాడు." అని నవ్వి జానకి చెయ్యి పట్టుకుని బయటకి తీసుకు వచ్చింది నిర్మల.

తనకంటె పెద్దదయిన వదినగారు తన్ను చూసి సిగ్గుతో తల దించుకోవటం మురళీమోహన్ కిబ్బంది కలిగించింది. "ఒకసారి మీరంతా వెళ్ళి అమ్మనీ నాన్నగార్నీ చూసి రాకపోయారా!" అన్నాడు అన్నగారి వైపు తిరిగి.

"ఇన్నేళ్ళు వాళ్ళని బాధ పెట్టాను .... ఇప్పుడే ముఖం పెట్టుకుని వెళ్ళను!" అన్నాడు కృష్ణారావు తలదించుకుని.

"నువ్వింకా గతాన్ని మనసులో పెట్టుకుని బాధ పడుతున్నావు కాని....అక్కడంతా ఎప్పుడో మర్చిపోయారు. మీరెప్పుడు వస్తారా అని ఎదురు చూస్తున్నారు. ఇదిగో వదిన వ్రాసిన ఉత్తరాలు చూడు!....మీరూ చూడండి వదినగారూ!" అంటూ కృష్ణవేణి తనకి వ్రాసిన ఉత్తరాలు చూపించాడు మురళి.

"వదిన నీకే కాదు నాకూ వ్రాసిందన్నయ్యా! నువ్వు వస్తావు - అంతా కలిసి ఒక్కసారే వెళ్ళి చూడవచ్చని మేము ఎదురు చూస్తున్నాము." అని నవ్వింది నిర్మల.

"నువ్వు హైదరాబాదు వచ్చాక ఒక్కసారి కూడా ఇంటికి వెళ్ళలేదుట. ఇంతకాలం వాళ్ళని చూడకుండా ఎలా వుండగలిగావు?" అన్నాడు మురళి ఆశ్చర్యపోతూ.

"మీ చెల్లాయి రచయిత్రి కదా బావగారూ! మనసుతో ఎంత దూరమేనా వెళ్ళి చూసిరాగలదు!" అన్నాడు రామచంద్రం.

"మీరేమయినా అనండి! ఇంతకాలం ఎలా గడిచిపోయిందో నాకే తెలియదు, ఇంకొక్క క్షణం కూడా ఇక్కడ వుండడానికి బుద్ధి కావటం లేదు.

ఎప్పుడెప్పుడు ఎగిరి వెళ్ళిపోదామా అని వుంది. ఇంక నువ్వు బయలుదేరటమే తరువాయి నీతో మేమంతా వచ్చేస్తామన్నయ్యా!''

నిర్మల వెళ్ళి అందర్నీ చూడాలని ఎంతో ఉత్సాహపడిందే కాని తీరా వాళ్ళంతా బయలు దేరేవేళకి ఆమెకు విపరీతంగా జ్వరం వచ్చింది.

'పట్టలేని ఆనందమేమో!' అని రామచంద్రం పరిహాసం కూడా చేశాడు.

నిర్మల ఒక్కత్తీ ఉన్నప్పుడు ''పోనీ, మీకు జ్వరం తగ్గాకనే వెడతామండి!'' అంది జానకి.

''మీరిలా గౌరవించి పిలవటం నాకెలాగో వుంది. వదినా! మీకంటె చాలా చిన్నదాన్ని. మీరలా పిలిస్తే నేనెలా దగ్గరికి రాగలను? ఎలా చనువుగా ఉండగలను?'' అంది నిర్మల.

''మీది.... మీది పెద్దకులం....''

నిర్మల కోపం తెచ్చుకుంది. ''ఇంకెప్పుడూ అలాంటి మాటలనకండి. మీరిలాంటి కాంప్లెక్సుతో ఉంటే మాకెప్పటికీ దగ్గర కాలేరు. మీకేవయినా అనుమానాలుంటే అవిక్కడే వదలిపెట్టి వెళ్ళండి. వాళ్ళంతా మిమ్మల్ని ఆదరించటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళేకాని....అన్నయ్య నొకలాగ, మిమ్మల్ని మరొకలాగ చూస్తారని అనుకోకండి. పోనీ, నా ప్రవర్తనలో కాని, మా అక్కయ్య చిన్నన్నయ్య రవి ప్రవర్తనల్లో కాని మీకు తేడా కనిపించిందా?''

''లేదు లేదు. ఇంతకాలం ఇటువంటి అదృష్టానికి దూరమయ్యానే అన్న బాధ తప్ప మరేమీ లేదు.'' అంది జానకి కంగారుగా.

''ఇదికాదదృష్టం! అక్కడికి వెళ్ళండి.... ఆ వదిన లిద్దర్నీ చూడండి. అమ్మని చూడండి. వాళ్ళ ప్రేమాభిమానాలు చవిచూడండి-అదీ నిజమైన అదృష్టం!''

కృష్ణారావు కూడా నిర్మలకి జ్వరం తగ్గాకనే వెడదామన్నాడు. ఒకసారి డ్యూటీలో చేరాక తనకు వెంటనే శలవు దొరకదని తానిప్పుడయితేనే వెళ్ళి రాగలనన్నాడు మురళీమోహన్.

''మీరెవరూ ప్రయాణాలకి వాయిదా వేయకండి అన్నయ్యా! మీకోసం వాళ్ళంతా ఎదురుచూస్తున్నారు. మీరు వెళ్ళిరండి. జ్వరంతగ్గాక నేనూ వస్తానని చెప్పండి!'' అంది నిర్మల.

నిర్మలని తమయింట్లో ఉంచుకుంటానని సుజాత చెప్పినా పార్వతి వాళ్ళతో రానంది. భర్త జైల్లో వుండగా తల్లిదండ్రులకి తన ముఖం చూపించటానికామె కిష్టంలేదు. ఆ సంగతి గ్రహించి ఎవరూ



**డి. శైలజ**

కొందరు పిల్లలకి కళలమీద ఉత్సాహం కట్టలు తెచ్చుకుంటుంది. చిన్నవయసులోనే, విద్య సాధించి, పెద్దవాళ్ళను ఆశ్చర్యపరుస్తూ వుంటారు.

నాట్యంలో పేరుతెచ్చుకుంటున్న శైలజ-అలాంటిది. శ్రీకాకుళంలోని విశాలాంధ్ర నృత్య కేంద్రంలో నృత్యం నేర్చుకుంటూ, ప్రదర్శనల్లో పాల్గొంటున్నది. శైలజ తండ్రిగారు శ్రీ కురుపేటి అప్పారావు శ్రీకాకుళంలో వున్న విశాఖ గ్రామీణ బ్యాంకుకు మేనేజరు. తల్లి-జయలక్ష్మి. ఇద్దరూ కళాభిమానులు. తలిదండ్రుల ప్రోత్సాహంతోనే-శైలజ, నాట్య కళాకారిణిగా రాణిస్తున్నది.

తెనాలి, అనకాపల్లి, శ్రీకాకుళం మొదలైన పట్టణాల్లోని మహిళా మండలుల సభల్లో-శైలజ ఇంతవరకూ నాట్యాలు చేసింది. చదువులో కూడా శ్రద్ధ చూపిస్తున్న శైలజ ఆటల్లో కూడా బహుమతులు అందుకుంటున్నది.

—టి.

ఆమెను బలవంతం చేయలేదు. కాలేజీకి శలవు లిచ్చారని అందరితోపాటు రవి కూడా ప్రయాణమయ్యాడు....జ్వరంవల్ల తను వెళ్ళలేకపోయింది కాని వాళ్ళకంటె ముందు నిర్మల మనస్సు తమ వూరు చేరుకుంది.

అంతా కల్సుకునే ఆ శుభవేళ వాళ్ళ మనస్సు లెంతగా ఉప్పొంగిపోతాయో ఊహించుకుంటూ ఉండిపోయింది. చెల్లెలి పలకరింతలు విని ఎంతో భయపడిపోయింది పార్వతి....జ్వర తీవ్రత వల్ల తప్ప మరేం కంగారు లేదని రామచంద్రం ధైర్యం చెప్పాడు!

## 62

జానకీ కృష్ణారావులకి నిర్మల చెప్పిన దానికంటె అఖండ స్వాగతం ఎదురయింది. ఇంట్లో అందరి మనస్సులు నిర్మల ఊహించినదానికంటె ఎక్కువ ఆనందంతో పరవళ్ళు త్రొక్కాయి.

ఒకప్పుడు కృష్ణారావు అమానుషంగా బంధాలు త్రెంచుకుపోయాడన్న కోపావేశాలు మచ్చుకయినా కనిపించలేదు. సంవత్సరం క్రితం వచ్చి డబ్బు కావాలని నిర్దయగా పీడించి పట్టుకువెళ్ళిన మనిషి ఇతనే అన్న కక్ష కళ్ళల్లోనయినా కనిపించలేదు.

వాళ్ళ మనస్సులనుంచి గతం పూర్తిగా తొలగిపోయిందని మాటలేకాదు — చేతలు కూడా చూపించాయి.

కన్నకొడుకుని పిలిచిన చేత్తోనే-పెద్దకోడల్ని పిల్చి దగ్గర కూర్చోపెట్టుకుంది సుభద్రమ్మ. ఆ మనుమల్నీ-ఈ మనుమల్నీ సరసన కూర్చోబెట్టుకొని ఎన్నో కబుర్లు చెప్పారు సత్యనారాయణ గారు.

కృష్ణవేణి — మాధవి సరేసరి ఆక్షణంవరకు ముఖముయినా తెలియని జానకితో కొన్నేళ్ళ అనుబంధం ఉన్నట్టు ప్రియాలాపాలాడారు.

వాళ్ళ మాటలకి ముగ్ధురాలై కళ్ళప్పగించి చూస్తూండిపోయింది జానకి.

''మీరిద్దరూ మాట్లాడుతూ ఉండండి. నేనందర్కీ కాఫీలు కలుపుతాను.'' అని కదలబోయింది మాధవి.

''నువ్వు కూర్చో! ఆ సంగతి నేను చూసుకుంటాను కాని ముందు అక్కయ్యకి స్నానానికి నీళ్ళు అవీ చూపించు....'' అని లేచి వెళ్ళింది కృష్ణవేణి.

''ఎప్పుడూ అంతే! నన్నేదీ ముట్టుకోనివ్వదు ఇప్పుడీ స్థితిలో సరేసరి. ఇక్కడ తీసిన గిన్నె

అక్కడ పెట్టనివ్వదు.'' అని మురిపెంగా విసుక్కుంది మాధవి.

"మీరు స్వంత అక్క చెల్లెళ్ళనే అనుకుంటారు క్రొత్తవాళ్ళెవరయినా చూస్తే!'' అంది జానకి ఆశ్చర్యంతో తల మునకలవుతూ.

"రేపటినుంచి మన ముగ్గుర్ని చూసినా అలాగే అనుకుంటారు!'' అని గలగలనవ్వింది మాధవి.

జానకి మనస్సు పులకరించింది. "....మీ ప్రేమాభిమానాలు అనుభవించి చూడవల్సిందే కాని మాటలతో చెప్పలేనంది నిర్మల. ఆ మాటల్లో ఎక్కడా అతిశయోక్తి లేదు. నేను విన్నదానికంటె మంచి చోటుకి వచ్చాను. నేనాశించిన దానికంటె ఎక్కువ ఆదరణ లభించింది. కాని, నాకిక్కడ నిలబడే అర్హతయినా ఉందా!'' అంది జానకి నీళ్ళు నిండిన కళ్ళతో.

"ఛ! ఏం మాటలండీ అవి! ఇంకెప్పుడూ మిమ్మల్ని మీరు తక్కువ చేసుకోవద్దు. అక్క వింటందంటే బాధపడుతుంది. రండి....స్నానం చేయండి.'' అని ఆమె చేయి పట్టుకొని దొడ్లోకి తీసుకువెళ్ళింది మాధవి....తియ్యని కలలో నడిచి వెళ్ళినట్టనిపించింది ఆమెకు.

మురళీమోహన్ మాధవిని పిల్చుకుపోయాడు. పిల్లలు ఆటల్లో పడిపోయారు. కృష్ణారావు తల్లి దండ్రుల దగ్గర్నించి కదలటమే లేదు.

జానకిని కూర్చోమని చెప్పి వంట ప్రయత్నంలో పడింది కృష్ణవేణి. ఆమె ఒకటి రెండుసార్లు చేతిలోని పని అందుకోబోతూంటే "మీరలా కూర్చుని కబుర్లు చెప్పండి....నేను చేస్తానుగా!'' అంది. తను తక్కువ కులానికి చెందినది కనుక వండినవి - వండుతున్నవి తన చేతికి తగలకూడదని కృష్ణవేణి అలా అడ్డు చెపుతోందని మొదట అపార్థం చేసుకుంది జానకి. అందుకనే ఆ తర్వాత కూర్చున్న చోటునుంచి కదలలేకపోయింది. ఏది ముట్టుకుందామన్నా జంకుతో కుంచించుకుపోయింది.

నారాయణతోపాటు వంటింట్లోకి వచ్చాడు రాజేష్. వేయించిన అప్పడాలు వాడొకటి తీసుకుంటుంటే వీడింకొకటి తీసుకోబోయాడు. అలా ముట్టుకోవటం తప్పు కదా అని కొడుకుని మందలించింది జానకి. ఆమె మనస్సులో పడుతున్న బాధని అప్పుడు కాని గుర్తించలేకపోయింది కృష్ణవేణి. అంతదూరం ఆలోచించనందుకు ఎంతో నొచ్చుకుంది.

ఆ తర్వాత "పిల్లలందరికీ కొంచెం అన్నం పెట్టండి అక్కయ్యా! నేనీలోగా అత్తగారికి పెట్టి వస్తాను.'' అని పని కట్టుకునే జానకికి పని చెప్పింది.



**బహు భార్యత్వం గురించి మీరు వినే వుంటారు. చూసీ వుంటారు. కాని బహు భర్తృత్వం గురించి (ఒక్క ద్రౌపది మినహా) ఎన్నడయినా విన్నారా.... అయితే ఈ వింత వినండి.**

**ఝాన్సీకి సమీపంలో వుంది రక్ష అనే గ్రామం. ఆ గ్రామానికి చెందిన యువతి అలా అలా సంచారంచేస్తూ ఒక్కొక్కరిని ఒక్కొక్క విధంగా ఆకర్షించి వరసగా ఆరుగురి దాకా వివాహం చేసుకుంది. అంతే కాదు. అలా వివాహం చేసుకున్న ప్రతి ఒక్కరి దగ్గర్నుంచి వీలైనంత మొత్తం రాబట్టింది. అలా పెళ్ళి చేసుకున్నవారిలో చివరి 'భర్త' — ఒక హరిజనుడు. అతడు పాపం తాను కూడబెట్టిన వెయ్యి రూపాయలూ ఆమెకు ధారాదత్తం చేశాడట. తీరా పెళ్ళాడిన తరువాత జరిగిన మోసం గ్రహించి పోలీసులకి ఫిర్యాదు చేశాడు. ఇంకేముంది? అంతటిలో ఆ 'నిత్య వధువు'ను కాస్తా వారు అరెస్ట్ చేశారు.**

**పాపం ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఆమె వివిధ కులాలవాళ్ళని పెళ్ళి చేసుకుని తనకు కులమతబేధాలు లేవని నిరూపించింది!**

ఎన్నో ఏళ్ళనుంచి పరిచయమున్న వాళ్ళల్లా పిల్లలు కబుర్లు చెప్పుకుంటూ అన్నాలు తింటుంటే జానకి మనస్సులోని శంకలన్నీ తొలగిపోయాయి. 'పసివాళ్ళకి కులాల తేడాలు తెలియవు. ఈ ఇంట్లో పెద్దవాళ్ళవీ పసి మనస్సులే! వీళ్ళకి ప్రేమ పంచిపెట్టటమే కాని-కక్ష కట్టడాలు ఎక్కువ తక్కువలు చేసి మాట్లాడటాలు తెలియవు! ఇలాంటి చోటుకి ఎంతో పుణ్యం చేసుకున్న వాళ్ళు కాని రాలేరు!' ఇలాంటి భావాలతో జానకి మనస్సు ఉత్తేజితమై పోయింది.

## 63

హైదరాబాదు నుంచి అంతా వచ్చారన్న సంగతి విశ్వనాథానికి చెప్పి రమ్మని ఆతని ఆఫీసుకి కొడుకును పంపింది కృష్ణవేణి. నారాయణతోపాటు రవి కూడా వెళ్ళి చెప్పి వచ్చాడు.

కృష్ణవేణికి మాట దక్కిస్తూ ఆ సాయంత్రం పెందరాళే వచ్చాడు విశ్వనాథం. వంటింట్లో చోటు చాలక మధ్య గదిలో అందరికీ ఆ రాత్రి భోజనాలు వడ్డించింది కృష్ణవేణి.

భర్త ప్రక్కన కొడుకులు - మనుమలు అంతా కూర్చుని భోజనాలు చేస్తోంటే చూసి ఆనందించటానికి రెండు కళ్ళూ చాలలేదు. మాధవిని కూడా వడ్డించమన్నాడు మురళి. ఆమెను కదలవద్దంటుంది కృష్ణవేణి. వాళ్ళ పోట్లాటల నడుమ జానకి వడ్డిస్తోంది. కోడళ్ళు ముగ్గురు కళ్ళ ముందు కదులుతుంటే సుభద్రమ్మ తన అవిటికాలు విషయమే మరిచిపోయింది-తను తిరి కూర్చున్నాననే అనుకుంది!

"పెళ్ళివారిల్లులా వుంది! పెళ్ళి కూతురు మాత్రం వచ్చింది కాదు!'' అంది మాధవి.

"ఇంతకీ నిర్మల పెళ్ళికొప్పుకున్నట్టేనా?'' అని అడిగాడు మురళీమోహన్.

"పెళ్ళికొడుకుని చూడండి. నేనొప్పిస్తాను.'' అంది ఆమె.

"ఇంక దాని పెళ్ళి చూడాలన్న కోరిక తప్ప నాకింకే ఆశలూ లేవు!'' అంది సుభద్రమ్మ.

"చెల్లాయి పెళ్ళిచేసే బాధ్యత నాదమ్మా!''

ఆ మాటలన్న కృష్ణారావువైపు అంతా కుతూహలంగా చూసారు....ఇంతకాలం తమ్ముళ్ళు కుటుంబ భారాన్ని మోసారు. ఈ బాధ్యతేనా నిర్వర్తించటం తన ధర్మం!....నిండు మనస్సుతో ఉద్వేగంతో అతను చెప్పిన మాటలు అందరి హృదయాల్ని కదిలించి వేశాయి. [సశేషం]

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-45' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు మార్చి 26 వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 మే సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు - అడ్డము

1. ముఖ్యమైన ఒక పంటను ఒక నది తనలోనే ఇముడ్చుకుంది.
2. జంతువులు కనడం
3. ఒక ప్రసిద్ధ రచయిత్రి ఇంటి పేరులోని మొదటి అక్షరాలు
4. కలిసిమెలిసి వుండడం
5. నిద్ర రాకపోతే ఇదీ రాదు!
6. జంతువే ; అదిగో తోక
7. చెట్టులో వుండేది - తల కిందులైంది.
8. దేవేంద్రుడు ఎందుకో చెదిరిపోయి వున్నాడు!
9. తర్జుమా అంతా అవకతవకగా వుంది ; పైగా చివరి అక్షరం లేనేలేదు!
10. జరగనిది - (చివర్లో 'ము' లేదు)
11. విధివ్రాతకి అక్కర్లేకపోయినా, మన వ్రాతకి కావాలి.
12. సుకుమారమైన వనితే ; పాపం - మధ్యలో పొట్టి!
13. బాగా వాడి చెయ్యబడడం!

### ఆధారములు – నిలువు

1. 'కాకి - మాంసం ముక్క' కథలోని ముఖ్య పాత్ర
2. రోగాల్ని వ్యాప్తి చేస్తుంది.
5. చెట్టు లేకపోతే, లేదు!
8. పేరంటాలు
10. పైకి లేస్తుంది; కింద పడుతుంది.
14. పాలిచ్చి పెంచే తల్లి
15. చైత్ర, వైశాఖ మాసాల్లో కురిసే వానయితే మాత్రం, కిందనుంచి పైకి కురుస్తుందా!
16. ముయ్యనూవచ్చు ; వెయ్యనూవచ్చు.
17. పిండివంట కాకపోయినా, పండగ రోజుల్లో కూడా చేసుకునే వంటకం.
18. చిరునవ్వు
19. ఈ మధ్య 'వనిత'లో వచ్చిన ఒక గేయం.
20. చిలుక, రాబందు, గద్ద, కాకి, కోడి, నెమలి
21. వట్టి అర్థంలేని మాట!
22. మేషాది పన్నెండు...వాటి ఏకవచనం.
23. మన్మథు

# వనిత మాటల కొలువు - 45
## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 14 | | 15 | ■ | 2 | 16 | ■ |
| 3 | | ■ | 4 | | | | 17 |
| | ■ | 5 | | ■ | ■ | 6 | |
| | ■ | 7 | | ■ | 18 | ■ | |
| ■ | 19 | ■ | ■ | 8 | | 20 | |
| ■ | 9 | 21 | | | ■ | | ■ |
| 10 | | | ■ | 11 | 22 | ■ | 23 |
| 12 | | | ■ | 13 | | | |

పేరు ____________________

చిరునామా ____________________

____________________

____________________

# టూరిజమ్






ఆంధ్రప్రదేశ్ పెవిలియన్ నిర్వహించిన విద్యార్థిని త్రివేణి ఆరుద్ర

దేశంలోని విశ్వవిద్యాలయాల్లో టూరిజమ్ బోధనా విషయంగా వున్న రాష్ట్రం తమిళనాడు ఒక్కటే. అది కూడా ఒక్క మద్రాసు విశ్వవిద్యాలయంలో, క్వీన్ మేరీస్ కళాశాలలో మాత్రమే టూరిజమ్ ప్రారంభించడం జరిగింది. తర్వాత మధుర పళనియాండవర్ కళాశాలలో కూడా అబ్బాయిల కోసం ప్రారంభించారు. విచిత్రం ఏమిటంటే-1975 లో ప్రారంభించిన ఈ శాఖను 1979తో ముగించడం! దేశంలో టూరిజానికున్న ప్రాముఖ్యం పరిశ్రమల్లో దేనికీ ఇవ్వడం లేదనడం అతిశయోక్తి కానేకాదు. కోట్లకు కోట్లు ఖర్చుచేసి విహార యాత్రికులకు సదుపాయాలు సమకూర్చే ప్రయత్నాలు చేస్తున్నారు. అటువంటి అదనులో ఇంత ప్రత్యేకంగా ప్రారంభింపబడిన యీ శాఖ మూసివేయడం ఎవరికైనా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. దానికి కారణాలు రకరకాలుగా చెప్పుతున్నారే గాని ఇదీ అని ప్రత్యేకం ఏమీ చెప్పడం లేదు.

విద్యార్థినులతోనూ, ఆ శాఖను ఇన్నేళ్ళుగా మోసుకొస్తున్న అధ్యాపక వర్గంతోనూ మాట్లాడినప్పుడు చాలా విషయాలు తెలిశాయి. 'ఈ శాఖకు సిలబస్ సరిగా నిర్ణయించకపోవడం, పుస్తకాలు లేకపోవడం విద్యార్థులను పలు దేశాలకు తీసుకువెళ్ళి ఏ విద్యకేనా ప్రాతిపదిక అనవలసిన ప్రాక్టికల్ పరిజ్ఞానం కలిగించవలసిన సదుపాయ సౌకర్యా'లు అమర్చకపోవడం కొన్ని కారణాలుగా చెప్పవచ్చు అంటున్నారు కొందరు. "టూరిజమ్ చదివి ఏం చేస్తాం? శుద్ధ దండుగ! ఏ వుద్యోగవకాశాలూ వున్నట్టు కనిపించడం లేదు" అంటున్నారు కొందరు. ఎంతసేపూ రిసెప్షనిస్టులుగా, 'అతిథికన్యలు'గా వుండడానికి అందరికీ యిష్టం వుండదు కదా, టూరిజమ్ డిపార్టుమెంటు–వారిని ప్రోత్సహిస్తుందా అంటే అదీ లేదు. మొదటి బాచ్ పిల్లలంతా ఎక్కడా సెటిల్ కాలేకపోతున్నారు. ఇంకొకటి– టూరిజమ్ అన్నందుకు – దేశం నాల్గు మూలలా టూరిస్టు స్థలాలు, వాటి విశేషాలు మన శిల్ప సంపద మొదలైన భాగాలు ముఖ్యమైనవిగా చేయాలేగాని టూరిస్టు సైకాలజీ నుంచి టూరిస్టు సంఖ్యలు, శాతాలు ముఖ్యం చేస్తే ఎలా? చరిత్ర, జాగ్రఫీ, ఫిలాసఫీ, ఆర్కిటెక్చర్, సైకాలజీ, కాటరింగ్, కమ్యూనికేషన్స్ యివన్నీ చదివి, సంస్థల తర్ఫీదు, ప్రోజెక్టు రిపోర్టు, ఎక్జిబిషన్ యివన్నీ చేయాలి. ఇంతచేసి బి.ఎ యిచ్చేబదులు ఎంఏ యివ్వచ్చు. ఈ ప్రోజెక్టు పని ఎం.ఫిల్ వాళ్ళు కూడా చెయ్యరు." అంది మూడేళ్ళూ పూర్తి చేస్తున్న ఒక విద్యార్థిని. "ఇంతా చేసి మళ్ళీ పబ్లిక్‌సర్వీసు కమిషన్ పరీక్షలు బాంకింగ్ పరీక్షలు, ఎంప్లాయిమెంట్ ఎక్చేంజులు-ఏవీ తప్పవు. అక్కడ మళ్ళీ మెరిట్ కాదు. సబ్జక్టు అంతకంటే కాదు. కావలసింది-కోటా! రికమండేషన్. ఇవన్నీ – ఏం చదివినా ఒకటే అన్న నిస్పృహ కలిగిస్తున్నాయి కాని-లేకపోతే టూరిజమ్ చాలా కుతూహలమైన శాఖ" అంది - యీ పరీక్షకు ప్రదర్శనకోసం ఆంధ్ర రాష్ట్రాన్ని ఎన్నుకున్న విద్యార్థిని త్రివేణి. 'అంతా ఫొటోలు, కాగితాలేగాని మిగిలిన ఇన్‌ఫర్మేషన్ దొరకడానికి తెగతిరగాలి. ఆంధ్రరాష్ట్ర టూరిజమ్ శాఖవారు నాకు చాలా సహకరించారు. హైద్రాబాదు వెళ్ళి చాలా సేకరించి వీలైనంతలో 'మినీ ఆంధ్ర ప్రదర్శించాను' అంది త్రివేణి.

ఈ 'ఇన్‌ఫర్మేషన్ ఇండియా' ప్రదర్శనం మద్రాసు క్వీన్ మేరీస్ కళాశాలలో తమిళనాడు ఇన్‌ఫర్మేషన్ శాఖామాత్యులు శ్రీ ఆర్. ఎమ్. వీరప్పన్ ప్రారంభించారు. "ఇంత ఉత్సాహంతో ఇంత చక్కగా ప్రదర్శన ఏర్పాటు చేసి భారత దేశంలోని ఏకత్వాన్ని చాటారు అమ్మాయిలు. ఏ శాఖలో సీటు దొరికితే ఆ శాఖలో చేరడం కాదు ప్రధానం. ఏది చదవాలన్న కుతూహలం వుంటే దానికోసం పాటుపడాలి. ఈ శాఖను మూసేస్తున్నారని నిరుత్సాహపడవద్దు. ఏదో రూపంలో డిప్లమోగానో సర్టిఫికేట్‌గానో దీన్ని పెంపొందించాలన్న ప్రయత్నంలో వున్నాం. విలాస యాత్రలు విదేశీయులకేకాదు. మనకీ కావాలి. మనం గర్వించతగ్గ చరిత్ర కలిగినవాళ్ళం. అది తెలుసుకోవలసిన తెలియచేయవలసిన బాధ్యత యీ టూరిస్టు విద్యార్థినులపై వుంది. మీ జాతి ఘనత, మీ రాష్ట్ర ఘనత మీ దేశ ఘనత మీద మీకు ఎంతో మక్కువ వుండాలి. టూరిజమ్ అందుకు దోహదం కావాలి" అన్నారు.

విద్యార్థినులు అమర్చిన ప్రదర్శన ఒక రోజు పబ్లిక్‌కోసం కేటాయించడం జరిగింది. ఈ ప్రదర్శన 'మినీ భారతదేశయాత్ర'గా తోచింది చాలామందికి. విద్యార్థినులు ఎంత శ్రమపడి విషయ సేకరణ చేశారన్నది వారు ప్రదర్శించిన వివరాలు, విశేషాలు ప్రేక్షకులకు చెప్పకచెప్పాయి. నిజంగా మన ఆంధ్ర యూనివర్శిటీ కూడా ప్రారంభింపతగ్గ–శాఖ టూరిజమ్.

—విలేకరి




గర్భకాలంలో స్త్రీలకు కలిగే అనుభూతి చాలా విలక్షణమైనది. అనిర్వచనీయమైనది. ఈ సమయంలో కాబోయే తల్లులు ఎన్నో విషయాలలో చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. మెలకువగా మెలగాలి. ఈ సమయంలో వారు తీసుకునే జాగ్రత్తలను అనుసరించే వారి ఆరోగ్యం – పుట్టబోయే పాపాయి ఆరోగ్యం వుంటుంది. ఈ జాగ్రత్తలలో చాలా ముఖ్యమైనది ఆహార విషయంలో తీసుకోవలసిన జాగ్రత్తలు. ఎందుకంటే–గర్భిణీ స్త్రీ తీసుకునే ఆహారమే – కడుపులోని శిశువు సంపూర్ణంగా ఆరోగ్యంగా పెరగడానికి; కాన్పు సమయంలో తల్లికి కావలసిన బలానికీ, శక్తికీ ఉపయోగపడుతుంది. అంతేకాదు. కాన్పుకు తర్వాత పాపాయికి పాలు పట్టడానికి అనుకూలంగా వక్షోజాల పాలగ్రంథులు పెరగడానికి కూడా ఇప్పుడు తీసుకునే ఆహారమే ఆధారం అవుతుంది. అందువల్ల పుట్టిన తర్వాత పాపాయి ఆరోగ్యానికి–గర్భ సమయంలో తల్లి తీసుకునే ఆహారానికి సన్నిహితమైన సంబంధం వుంది. అంచేత గర్భిణీ స్త్రీలు తీసుకునే ఆహారం బలవర్ధకంగా వుండాలని వేరే చెప్పనవసరంలేదు.

కాని మన దేశంలో–పేదరికం కారణంగానో, లేదా ఒక రకమైన అజ్ఞానం, ఉదాసీనతల వల్లనో– గర్భకాలంలో సరియైన ఆహారం తీసుకోవడం లేదు. అందువల్ల – పుట్టేప్పుడే చాలామంది పిల్లలు రకరకాల వ్యాధులతో, బలహీనంగా పుడుతున్నారు.

సాధారణంగా ఒక స్త్రీకి రోజుకు రెండువేల నుంచి రెండువేల రెండువందల కేలరీల శక్తి అవసరమవుతుంది. (వాళ్ళు చేసే పనిని అనుసరించి ఇందులో కాస్త అటూ, ఇటూ తేడా వుండొచ్చు.) అయితే గర్భిణీ స్త్రీకి రోజుకు రెండు వేల అయిదు వందల కేలరీలు అవసరమవుతాయి. ఇది కాకుండా ప్రొటీన్లు, కొవ్వులు, ఖనిజ లవణాలు, కార్బొహైడ్రేట్లు అదనంగా ఆహారంలో తీసుకోవలసి వుంటుంది. ఇది తల్లి ఆరోగ్యానికి గర్భస్థ శిశువు అభివృద్ధికీ ఎంతో దోహదం చేస్తుంది.

శారీరక అభివృద్ధికి దోహదం చేసేవి ప్రొటీన్లు. గ్రుడ్లు, చేపలు, మాంసం, పాలు, పెరుగు మొదలైన వాటిలో ప్రొటీన్లు విరివిగా లభిస్తాయి. అంచేత వీటిని ఆహారంలో తమ ఇష్టమైన విధంగా తీసుకోడం ఎంతైనా అవసరం. శాఖాహారులు పాలు, పప్పు దినుసులు ఎక్కువగా తీసుకోవడం వల్ల కావలసిన ప్రొటీన్లు సమకూర్చుకోవచ్చు.

తాజా కూరగాయలను, ఆకు కూరలను తీసుకోవడంవల్ల–శరీరానికి కావలసిన విటమినులు, ఖనిజ లవణాలు చేకూరతాయి. ఆహారంలో కాల్షియం, ఇనుము లాంటి ఖనిజ లవణాలు లోపిస్తే–పంటినొప్పులు, చిగుళ్ళు వాయడంలాంటి వ్యాధులు రావడానికి అవకాశం వుంది. అవసరమైతే గర్భ సమయంలో విటమిను మాత్రలు, ఐరన్ మాత్రలు వాడడం కూడా మంచిదే.

స్త్రీ పూర్ణ గర్భవతిగా వున్న కాలంలో ఆహార విషయంలో జాగ్రత్తలు తీసుకున్నంతమాత్రాన అన్నీ సరిపోయినట్టు భావించరాదు. గర్భధారణ జరిగినప్పటినుంచి సరియైన కాలంలో క్రమం తప్పకుండా వైద్య పరిశోధనలు–రక్త పీడనం, రక్త పరీక్ష, మూత్ర పరీక్ష మొదలైన వైద్య పరిశోధనలు చేయించుకోవాలి.

గర్భ సమయంలో మామూలుగా తల్లులు సుమారు ఎనిమిది కిలోలనుంచి పన్నెండు కిలోల వరకు బరువు పెరుగుతారు. గర్భంలో సంపూర్ణ అభివృద్ధి చెందిన శిశువు, బాగా వ్యాకోచం చెందిన గర్భాశయం; యుటిరస్ ప్లాసెంటా అమ్నియోటిక్ ఫ్లూయిడ్; వక్షోజాలలో అభివృద్ధి చెందిన పాల గ్రంథులు - బరువును ఎక్కువ చేస్తాయి. అంచేత ఈ సమయంలో తగినంత బరువు ఎక్కువ కాలేదనుకుంటే తల్లి ఆరోగ్యంలోనే ఏదో ఒక లోపం వుందని గ్రహించాలి. వెంటనే వైద్యులను సంప్రదించాలి. ఐతే, అదే విధంగా వున్నట్టుండి శరీర భారం పెరగడం, రక్తపీడనం ఎక్కువకావడం కూడా హాని సూచకమే.

మొదటి మూడు మాసాలలో వేవిళ్లు వుంటాయి. ఈ సమయంలో క్రొవ్వు ఎక్కువగా వున్న ఆహారాలను, నూనెతో చేసిన వంటకాలను వదిలి – పళ్ళరసాలను మరేదైనా బలవర్ధకమైన ఆహారం తరచూ తీసుకుంటూ వుండాలి. గర్భవతియైన స్త్రీ మొదటి మూడు మాసాలలోను, ఆఖరి నెలలలోనూ ప్రయాణాలు చేయడం మంచిదికాదు.

రోజూ సాయంకాలం కొంతదూరం నడవడం వల్ల — రక్తప్రసారం ఎక్కువ అవుతుంది. అంచేత మనసు ఎంతో ఉల్లాసంగా వుంటుంది.

రాత్రులు చాలాసేపు నిద్ర మేల్కొనకూడదు. పగటిపూట మధ్యాహ్నం విశ్రాంతి తీసుకోవడం మంచిది. శారీరకమైన విశ్రాంతితోపాటు మానసిక విశ్రాంతి కూడా చాలా అవసరం. ఆరు నెలలు నిండిన తర్వాత పదిహేను రోజులకోసారి డాక్టర్‌ను సంప్రదించి తగిన వైద్యపరీక్షలు చేయించుకోడం మంచిది. గర్భకాలాంతంలో కాళ్ళు వాచడం సాధారణమైన విషయమే. కాని మడమలు బిగువైనా, ముఖం ఉబ్బరించినా, చూపు మందగించినా, విసర్జించే మూత్రపరిమాణం ఎక్కువైనా, తల తిరుగుడులాంటిది ఎక్కువైనా వెంటనే డాక్టర్‌ను సంప్రదించి తగిన చికిత్స పొందాలి. ఎంచేతంటే ఇవన్నీ రక్తంలో విషాధిక్యతవల్ల యేర్పడే రుగ్మతలు.

—శోభా రామ్‌జీ

# క్రోషాయితో బొమ్మగౌను



ఈ బొమ్మను క్రోషా వయరుతో చేశాము. దీనికి కావలసిన వస్తువులు 100 గ్రాముల క్రోషావయరు మీకు నచ్చిన రంగుది. 25 గ్రాముల వయరు వేరొక కలరుది బార్డరుకి కావాలి. (25 గ్రాములు వయరు షాపులో ఇవ్వరు కనుక 2 వయర్లు చెరి ఒక 100 గ్రాములు తీసుకొంటే 2 బొమ్మలు అవుతాయి.) 1 తులం పూసలు పగడం సైజులో బార్డరు కలరువి కావాలి. (ఫొటోలోని బొమ్మకు గులాబి రంగు వయరు, బార్డరుకు నీలంరంగు వయరు, నీలం పూసలుతో గౌను అల్లాము) ఇప్పుడు క్రోషా సూది, బొమ్మ కావాలి. క్రోషా అల్లిక ఈ రోజుల్లో అందరికి తెలిసినదే. ఈ అల్లిక ఏ మాత్రం తెలిసినవారయినా దీనిని సులభంగా వేయవచ్చు.

వయరును ముందు శుభ్రంగా చిక్కుపడకుండా దేనికయినా చుట్టుకోవాలి. తరువాత దాని కొసని ఎడమ చేయికి చుట్టుకుని సూదితో చిన్న చిన్న రింగులుగా వేయాలి. అది ఒక సన్నని గొలుసులా వుంటుంది. అది బొమ్మ ఛాతికిచుట్టి సరిపడేలాగా అల్లి రెండు కొసలు కలిపి వేయాలి. (1 బొమ్మ)



(1 బొమ్మ)

తరువాత మన చేతిన ఉన్న వయరును సూదికి మెలికవేసి మొదటి రింగులోనికి సూదిని పోనిచ్చి మరొకసారి సూదికి వయరు మెలికవేసి, ఆ మెలికను జాగ్రత్తగా రింగులో నుండి, మొదట వేసిన మెలికలో నుండి లాగాలి. అప్పుడు సూదికి రెండు రింగులు ఉంటాయి. తిరిగి సూదికి వయరు మెలి వేసి ఈ రెండు రింగుల్లో నుండి లాగాలి. ఇలాగే వున్న రింగులు అన్నిట్లోను అల్లాలి. ఇప్పుడు అది ఒక వెడల్పాటి గాజులా ఉంటుంది. ఇది అయినాక పై లైను కూడా ఇలాగే అల్లాలి. ఇలా మొత్తం



(2 బొమ్మ)

3 లైనులు (2 బొమ్మ) అల్లాలి. ఇది బొమ్మకు ఆకృతి అన్నమాట. ఇక దీనికి కుచ్చులుగా షెల్స్ (డొల్లలు) వేయాలి. షెల్స్‌కు మనం మొదట వేసినట్లు రింగుల లైనును ప్రక్క ప్రక్క లైన్లలో కాక ఒకే రింగుతో తొమ్మిది లైన్లు వేస్తే షెల్ వస్తుంది. (3 బొమ్మ) ఈ షెల్ వేశాక రెండు రింగులు వదిలి మూడవ రింగులో ఇంకో షెల్



(3 బొమ్మ)

వేయాలి. అలా మొత్తం బొమ్మ బాడిచుట్టు తొమ్మిది షెల్స్ వస్తాయి. అప్పుడు ఆ అల్లికను వెనుకకు తిప్పి ఈ షెల్స్‌కు మధ్య వచ్చే ఖాళీల్లో మళ్ళీ షెల్స్ వేయాలి. ఇలా చేస్తే ఒక షెల్ వెనుకకు,





(4 బొమ్మ)

# 卐 సువస్తిక్ శికాకాయ్
## సౌందర్యపు సబ్బు–జుట్టు కొరకు
## క్రొత్త రేపర్! క్రొత్త ఆకృతి! క్రొత్త సువాసన!




Shilpi-dm-18/78 Tel

**జుట్టుకు సిల్క్‌వంటి మృదుత్వము నిచ్చుటకు నైసర్గిక ఉపాయము**

ఒక షెల్ ముందుకు తిరిగినట్లు వస్తాయి. అలాటివి మొత్తం ఆరు వరుసల షెల్స్ (54) వస్తాయి. అలా ఈ షెల్స్ అల్లటం అయినాక బాడికి అల్లినట్లుగా ప్రక్కప్రక్క రింగుల్లోకి అల్లేవి (4 బొమ్మ) మూడు వరుసలు అల్లాలి. తరువాత నాల్గవ వరుసలో ఆ అల్లేటప్పుడు ఒక్కొక రింగులో రెండు సార్లు అల్లుతూ ఆ వరుస పూర్తి చేయాలి. తరువాత ఐదవ వరుసలో కూడా ఒక రింగులో రెండుసార్లు అల్లాలి. తరువాత ఆరవ వరుసలో కూడా ఒక రింగులో రెండుసార్లు అల్లుతూ పూర్తి చేయాలి. రింగులు పెంచిన ఈ మూడు వరుసలు పూర్తి అయ్యేసరికి గౌను మెలికలు తిరిగి ఉంటుంది. ఇక దానికి బార్డరు వేయాలి. వేరే వయరును ఈ అల్లిక లోనికి పోనిచ్చి ముడి వేయాలి. తరువాత సూదిని రింగులోనికి పోనిచ్చి వయరును సూదికి మెలి తిప్పి బయటికి లాగాలి. ఆ మెలిక సూదికి అలాగే ఉంచి ప్రక్క రింగులోనికి సూదిని పోనిచ్చి వయరును మెలివేసి లాగాలి. అప్పుడు సూదికి రింగులు రెండు ఉంటాయి. అవి అలా ఉంచి సూదికి వయరును మెలివేసి ఈ రెండు రింగుల్లో నుండి లాగాలి. అలా అల్లుతూ బార్డరు పూర్తి చేయాలి. ఇంతవరకు తయారయిన గౌను బొమ్మకు చేతుల క్రింద నుండి మాత్రమే. ఇంక ఇప్పుడు ఈ గౌనును బొమ్మకు తొడిగి అల్లాలి. బాడిపైభాగపు రింగుల్లో వేరే వయరు ముడివేసి సన్నని గొలుసులాగా అల్లుతూ బొమ్మ భుజం పై నుండి వెనుకకు అల్లి బాడి వెనుక భాగపు రింగుల్లో కలపాలి. అలా రెండు వరుసలు చొప్పున రెండు భుజాల పైన వేయాలి. అది చిన్న పిల్లలకి వేసే పట్టీల లంగాలా వుంటుంది. భుజానికి చివరవైపు ఉండే వరుసలో చిన్నచిన్నవి నాలుగు షెల్స్ వేస్తే రెక్క చేతుల్లా ఉంటాయి. మెడవైపు ఉండే పట్టీల నుండి బాడిని కలుపుతూ బార్డరు వయరుతో బార్డరు అల్లితే మెడ పూర్తవుతుంది. చేతులకు కూడా బార్డరు వేస్తే బొమ్మ అయిపోతుంది. షెల్స్ ఒక్కొక్కదాన్లోనూ ఒక్కొక్క పూస కుట్టుకోవచ్చును చివరకు.

ఈ బొమ్మ చూడటానికి చాలా అందంగా ఉంటుంది. కొంచెం ఓర్పు, నేర్పు ఉంటే ఇదే అల్లికతో బొమ్మకు టోపి, బ్యాగు కూడా అల్లి తగిలించవచ్చును. చేసి చూస్తారు కదూ.

—పి. సత్యవాణి

"నేరం చేసిన వారికి శిక్ష విధించడమన్నది సబబు. అయితే కుటుంబాన్ని పోషిస్తున్న వ్యక్తి జైలుకి వెళ్ళడంతో యిక ఆ కుటుంబానికి జీవనోపాధి అంటూ లేకుండా పోతోంది. వారి పిల్లలు నిర్లక్ష్యం చేయబడుతున్నారు. అసలు ఒకసారి నేరం చేసిన వ్యక్తి యిక ఎప్పటికీ నేరస్తుడుగానే పరిగణింపబడుతున్నాడు. దాంతో అటువంటి వారు మంచిదారి పట్టి జీవనం గడుపుదామన్నా అందుకు అవకాశం లేకుండా పోతోంది. ఈ పరిస్థితులు మారాలి" అన్నారు శ్రీమతి రాధాపాల్.

ఢిల్లీ స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్ ద్వారా ఎం. ఏ. పట్టం పొందారు రాధ. 1959 నుంచి

రాధాపాల్



ఆమె మద్రాసు స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్ క్రిమినాలజీ విభాగంలో ఉపన్యాసకురాలిగా వుంటున్నారు. ఒక వైపు ఉపన్యాసకురాలుగా తన విధి నిర్వహిస్తూనే స్వచ్ఛంద సేవా కార్యకలాపాలలో కూడా చురుకుగా పాల్గొంటున్నారు రాధ.

"మన ఆలోచనలలో నేటికీ మార్పు రాలేదు. పురాతన ఛాందస భావాలు నేటికీ చలామణీ అవుతున్నాయి. శిక్ష అనుభవిస్తున్న ఖైదీలకు సామాజిక స్పృహ కలిగించేందుకు తగిన శిక్షణ పొందిన సంఘ సేవకులు మన జైళ్ళలో లేరు. ఈ మధ్యనే తమిళనాడు ప్రభుత్వం మగవారి జైళ్ళలో సంఘ సేవకులను నియమించింది. వీరు ఖైదీలలో మానసికమైన మార్పు రావడానికి, వారు సద్వర్తనులుగా మారడానికి కృషి చేస్తారు" అన్నారు రాధ.

రాష్ట్ర స్థాయిలోనూ, జాతీయ స్థాయిలోనూ కూడా ఆమె అనేక సలహా సంఘాలలో సభ్యురాలుగా వుంటున్నారు. ఖైదీలలో పరివర్తన తేవడానికి సంఘ సేవకులను నియమించే విషయంలో ప్రభుత్వ విధానంలో మార్పు తేవడానికి ఆమె తీవ్రంగా కృషి చేస్తున్నారు.

బాల నేరస్థుల - స్థితిగతుల గురించి, ఆ నేరాలు చేయడానికి వారికి దోహదం చేసిన పరిస్థితుల గురించి ఆమె పరిశోధనా కార్యక్రమాలను నిర్వహించారు.

ఆమె అమెరికా, ఆస్ట్రేలియా, ఫిలిప్పైన్స్ మున్నగు దేశాలను సందర్శించారు. ఆస్ట్రేలియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్రిమినాలజీ వారు నిర్వహించిన గోష్ఠిలో ఆమె పాల్గొన్నారు.

జాతీయ స్త్రీల సమాఖ్య తమిళనాడు శాఖ కార్యదర్శినిగా ఆమె 'మేరీ క్లబ్‌వాలా జాదవ్' పేరిట వృద్ధులకు ఒక గృహాన్ని ప్రారంభించదలుచుకున్నారు. అరవై ఏళ్ళకు పైబడిన వారికి ఈ గృహంలో స్థానం లభిస్తుంది. ఆశ్రమ జీవితం పద్ధతిలో తగిన హంగులన్నీ యిక్కడ వుంటాయన్న మాట.

"విడుదలైన ఖైదీలకు మేము ఏ విధంగా సహాయపడగలం?" - అని అడుగుతూ వుంటారు కొందరు మహిళా మండలి కార్యకర్తలు, యితరులు. రాఖీపండగనాడో, మరో పండగ రోజునో జైలుకి వెళ్ళి ఖైదీల చేతులకి రక్షాబంధనలు కట్టడం, తీపి పదార్థాలు పంచి పెట్టడంతో చేతులు దులుపుకోవడం కాదు. జైలు నుంచి విడుదలై వచ్చాక వారికి ఉపాధి కల్పనకు కుటీర పరిశ్రమల వంటివి స్థాపించడానికి దోహదం చెయ్యాలి. సమాజంలో వారికి కూడా సరైన స్థానం లభించేందుకూ, ఆర్థికపరంగా వారు నిలదొక్కుకునేందుకూ వారికి వృత్తి పనులు కల్పించాలి. అప్పుడే వారిలో ఆత్మస్థైర్యం నెలకొంటుంది. తాము చేసిన తప్పులు సరిదిద్దుకునేందుకు అవకాశం ఏర్పడుతుంది" అంటారు రాధ.

"మన పిల్లలూ మన యిళ్లల్లో అప్పుడప్పుడు దొంగతనాలు చేస్తూ వుంటారు. మనం మందలించి వదిలేస్తూ వుంటాం. అటువంటప్పుడు పనిపిల్లలపై ఎందుకంత కఠినంగా ప్రవర్తించడం.... వారూ మన పిల్లల ఈడువాళ్ళే అయి వుంటారు కదా" ఉద్రిక్త స్వరంతో అన్నారు శ్రీమతి రాధాపాల్.

—కమలాకుమార్

### కూరలు-పోషక పదార్థాలు

ఉల్లిపాయలు :

ఇది దుంపజాతికి చెందింది. దీని ఆకులు కోలగా వుంటాయి. నీటివసతి వున్న ప్రదేశాలలో ఉల్లి బాగా పెరుగుతుంది. దీని ఆకుల మధ్య నుంచి బోలుగా కాండం లేస్తుంది. ఆ కాండం చివర పువ్వులగుత్తి వుంటుంది. ఈ పువ్వులు తెల్లగా వుంటాయి. వీటిలో నుంచి వచ్చే గింజలనే విత్తనాలుగా వుపయోగిస్తారు. ఉల్లిచెట్లు రావడానికి 'దుంపలు కూడా నాటుతారు. ఉల్లిపాయలలో తెలుపు, ఎరుపు అని రెండు రకాలు వున్నాయి.

ప్రతి 100 గ్రాముల ఉల్లిపాయలలోనూ-86.8 గ్రాముల తేమ, 1.2 గ్రా. ప్రొటీన్లు, 0.1 గ్రా. క్రొవ్వుపదార్థం, 0.4 గ్రా. ఖనిజపదార్థం, 11.6 గ్రా. పిండిపదార్థం, 0.18 గ్రా. కాల్షియం, 0.05 గ్రా. భాస్వరం, 0.7 మిల్లిగ్రాముల ఇనుము, 0 08 మి.గ్రా. విటమిన్ బి, 0.4 మి.గ్రా. నికోటినిక్ ఆమ్లం, 0.01 మి.గ్రా. రిబోఫ్లోవిన్, 11 మి గ్రా. విటమిన్ సి, 1.0 మి.గ్రా. ఆక్సాలిక్ ఆమ్లం వున్నాయి. కెలోరి విలువ-51.

ఉల్లికాండాన్ని 'ఉల్లికోడు' అని అంటారు. కొందరు ఉల్లికాడ అని కూడా అంటారు. ఈ ఉల్లికోళ్ళ పులుసు చేసుకుంటారు. ఉల్లిపాయలను కూరలలోనూ, పచ్చళ్ళల్లోనూ, పులుసులలోనూ, పకోడీల వంటి పిండి వంటలలోనూ విరివిగా వుపయోగిస్తాము. ఉల్లిపాయ సాంబారు రుచిగా వుంటుంది. ఉల్లిపాయలను చిన్న చిన్న ముక్కలుగా తరిగి ఇనుప బాణలిలోగాని, కుండలోగాని నూనె పోసి అందులో మిరపకాయలు, ఆవాలు, మెంతులు, వెల్లుల్లిపాయలు పోపుపెట్టి మగ్గించి చింతపండు పులుసు, ఉప్పు చేర్చి, కొంచెంగా బెల్లం కలిపి చిక్కగా మరిగించితే ఈ విధంగా చేసుకున్న పచ్చడి రెండునెలల వరకూ నిలవ వుంటుంది.

ఉల్లిపాయ త్వరగా జీర్ణం కాదు. మోతాదు హెచ్చుగా ఆరగిస్తే వాంతులు, విరేచనాలు కలుగుతాయి. ఉల్లిపాయ ఎక్కువగా తింటే గుండెకు బలం తగ్గిపోయి అనేక రోగాలు సంభవిస్తాయని అంటారు.

కాని ఉల్లివల్ల మేళ్ళు కూడా అనేకం వున్నాయి. ఆధునిక వైద్యశాస్త్రం ప్రకారం ఉల్లిపాయలను తక్కువ మోతాదులో తీసుకుంటే శ్లేష్మం కరిగి, అల్పాచమానం సులభంగా జారీ అవుతుంది. గుండెకు ఉత్తేజం కలుగుతుంది.

ఉల్లిపాయ చలవచేస్తుంది. బలప్రదమైనది. రక్తపైత్య రోగాన్ని అరికడుతుంది. వాంతులను కడుతుంది. ఉల్లిపాయ సన్నగా తరిగి, నేతిలో వేయించి అందులో పంచదార కలిపి తింటే రక్తవిరేచనాలు తగ్గుతాయి. ఉల్లిపాయలను కచాపచాగా నమిలి చెవులలోను, ముక్కులోను వూదితే స్పృహ తప్పిన వారికి తెలివి వస్తుంది. ఉల్లిరసం, పంచదార కలిపి కాచి పానకంగా చేసి తాగితే వీర్యవృద్ధి అవుతుంది-అని చెబుతుంది ఆయుర్వేదశాస్త్రం.

పైన చెప్పినవే కాక ఉల్లిపాయవల్ల యింకా అనేక మేళ్ళు వుండడం చేతనే 'ఉల్లి చేసిన మేలు తల్లి కూడా చెయ్యదు' అనే సామెత వాడుకలోకి వచ్చింది.



# పెరటితోట పెంపకం



— లలితకుమారి

**డి. పి. వేణి, విశాఖపట్నం**

మా పెరట్లో మిరపచెట్లు వేసినప్పుడల్లా ఆకులు ముడుచుకుని పువ్వులు రాలిపోతున్నాయి. ఒక్క కాయ కూడా కాయడం లేదు. అంతేకాక మా పెరట్లో ఏ మొక్క వేసినా ఎదగడం లేదు. మా శ్రమకు ఫలితం దక్కదా?

మీరు చెప్పినదాన్ని బట్టి చూస్తే మీ పెరట్లోని భూమి సారవంతమైనది కాదేమోననిపిస్తోంది. ఆ మట్టిని టెస్ట్‌కి పంపి పరీక్ష చేయించండి. విశాఖపట్నంలోనే వున్నారు కాబట్టి వ్యవసాయ శాఖ వారికి చూపించండి. మీరు విత్తనాలు వేసేటప్పుడు, మొక్కలు నాటేటప్పుడు మూడు అడుగుల లోతుకి తవ్వి వేస్తే ఫలితం కనిపించవచ్చును.

**జొన్నల విజయ, అత్తిలి**

మా తోటలో ఆపిల్ చెట్లు వేయాలని కోరికగా



## వైద్య విశేషాలు

అధిక సంతానం వున్నవారికి గర్భాశయంలో కేన్సర్ వ్యాధి వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నట్లు ఇటీవల వైద్యపరిశోధనలవల్ల రుజువైంది. ఈ విషయాన్ని కలకత్తా మెడికల్ కాలేజ్ అండ్ హాస్పిటల్‌కు చెందిన డాక్టర్ ఎస్. ఎన్. రాయ్ ఇటీవల వెల్లడిచేశారు. చిన్న వయసులోనే పెళ్లి చేసుకుని, ఎక్కువమంది పిల్లలను కన్నవారు, అనారోగ్యకరమైన వాతావరణంలో దాంపత్య జీవితం కొనసాగించేవారు, పరిశుభ్రత పాటించని వారు ముఖ్యంగా వేశ్యలు ఈ 'సెర్వికల్ కేన్సర్'కు ఎక్కువగా గురిఅయ్యే ప్రమాదం వుందని తమ పరిశోధనల ద్వారా తెలిసినట్లు ఆయన వివరించారు.

*

శిరోజాలు క్రమక్రమంగా తగ్గిపోతున్నాయని, బట్టతల వస్తున్నదనీ బాధపడుతున్న వారికి ఒక ఆశాజనకమైన వార్త! బర్మింగ్‌హామ్‌లోని అలబామా యూనివర్శిటీ మెడికల్ సెంటర్‌కు చెందిన డాక్టర్ లియోపోల్డ్ మోంటెస్—బట్టతలపై మళ్ళీ శిరోజాలు రావడానికి ఒక కొత్త మందును కనిపెట్టారు. 'హాల్సినోనైడ్' అన్నది ఆ మందు పేరు. "ఈ మందుతో కొన్ని ప్రయోగాలు చేసి చూసిన తర్వాత, అద్భుతమైన ఫలితాలు కనిపించాయి. దీన్ని ప్రయోగించిన కొన్ని నెలలకు మళ్ళీ బట్టతలపై శిరోజాలు వచ్చాయి. అవి ఒక సంవత్సరానికి పైగా వూడిపోకుండా వున్నాయి!" అన్నారు డాక్టర్ మోంటెస్.

*

'పిగ్మెంటెడ్ డైస్ట్రాఫీ' లేదా 'రెటెనిటీస్ పిగ్మెంటోజా' కారణంగా-వంశ పారంపర్యంగా వచ్చే అంధత్వాన్నించి విముక్తి కలిగించే వైద్య విధానాన్ని-సోవియట్ యూనియన్‌లోని వైద్య శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. మామూలుగా అలా చూపు పోవడం అనేది చిన్నతనంలోనే సంభవిస్తుంది. లేదా వయసు మళ్ళుతున్న కొద్దీ క్రమక్రమంగా దృష్టి తగ్గిపోవడం జరుగుతుంది. అలా అంధత్వంతో బాధపడుతున్న వందలాది రోగులను — కొత్తగా కనిపెట్టిన 'ఎన్‌కాడ్' అనే మందుతో చికిత్స చేయగా చాలామంది రోగులకు చూపు వచ్చినట్లు తెలిసింది. ఈ మందును ఇంజెక్షన్ల ద్వారా యిస్తారట!

*

శస్త్ర చికిత్స జరిపి చెవిటివారికి వినికిడి జ్ఞానం కలిగే వైద్య విధానాన్ని యూనివర్శిటీ ఆఫ్ కేంబ్రిడ్జ్‌కు చెందిన వైద్యశాస్త్రజ్ఞుడు డాక్టర్ బ్రెయిన్ మూర్, ఆయన బృందం కనుగొన్నారు. చెవి అంతర్భాగంలో 'ఎలక్ట్రోడ్' (విద్యుత్‌సాధనం)ను అమర్చి, ఆ చికిత్సా విధానంతో కొన్ని ప్రయోగాలు చేసి చూసిన తర్వాత, ఫలితాలు ఆశాజనకంగా వున్నాయని, ఐతే, ఈ పద్ధతి ఇంకా ప్రయోగదశలోనే వుందనీ డాక్టర్ బ్రెయిన్ మూర్ చెప్పారు.

*

కాఫీ ఆరోగ్యానికి మంచిది కాదన్న వాదం సమంజసం కాదని, కాఫీలో 'బి' విటమినులలో ఒకటైన 'నియాసిన్' అనే పదార్థం పుష్కలంగా వుందని - అది ఆరోగ్యకరమైన పానీయమేనని డాక్టర్ రమేష్ వి. భట్ ఇటీవల తెలియజేశారు. ఆయన కాఫీ గురించి కొంతకాలం పరిశోధనలు జరిపి, ఈ నిర్ణయానికి వచ్చారు.

వుంది. మాది నల్లరేగడి యిసుక భూమి. అవి విత్తనాలా లేక అంటు మొక్కలా?

అవి విత్తనాలే. కాని మీ అత్తిలిలో పండడం కష్టం. ఆపిల్ చెట్లకి బాగా శీతల ప్రదేశం కావాలి. కాదూ కూడదనుకుంటే మీరు ఏ సిమ్లాకో, కాశ్మీరుకో కనీసం వూటీకో మకాం మార్చాల్సిందే తప్ప—మరో దారిలేదు.

**కె. నాగేంద్రమ్మ, తుళ్లూరు**

ఏమండీ! మా యింట్లో దానిమ్మ మొక్క వున్నది. దానికి బాగానే ఎరువు వేస్తున్నాము. నీళ్ళు పోస్తున్నాము. నాటి ఐదు సంవత్సరాలైంది. ఇంత వరకు పూతలేదు. కాయ కాయడం లేదు. అందరూ మగ చెట్టు అంటున్నారు. నిజమేనా?

తాటి, బొప్పాయి చెట్లలో మగ, ఆడ తేడాలు వున్నాయి. కాని దానిమ్మలో సెక్స్ (Sex) విభేదం లేదు. దానిమ్మలో వివిధ రకాలు వున్నాయి. ఏమైనా ఐదు సంవత్సరాలలోపే కాయాలి. బహుశ భూమిలో లోపం అయి వుండవచ్చు.

మా పెరట్లో ఒక కుంకుడు చెట్టు వుంది. అది బాగానే పెరిగింది. కాని ఈ మధ్య పురుగులు తిన్నట్లుగా పాడైపోయింది. ఇక పెరగడం లేదు. కారణమేమిటో తెలియజేయగలరా?

కుంకుడుకి ఒక గుణముంది. మరీ పాత చెట్లయితే కాయలు రాలిపోతూ వుంటాయి.

**కె. లక్ష్మీబాయి, రాజమండ్రి**

మా పెరట్లో బెండ మొక్కలు వేశాము. వాటి మొగ్గలు రెండు మూడు రోజులకల్లా రాలి పోతున్నాయి. దీన్ని నివారించడానికి వుపాయ మేదైనా చెప్తారా?

అలా రాలిపోవడానికి మొక్క లక్షణాలను బట్టి అనేక రకాల కారణాలు. మొక్కలో లోపాలూ వుంటాయి. మీ రాజమండ్రిలో అన్ని హంగులూ వున్న వ్యవసాయ శాఖ వుంది. వారికి చూపితే తగినసలహా యిస్తారు.

**సి. ఆర్. జానకి, బెంగళూరు**

మా తోటలో బెంగళూరు వంకాయ వేశాము. బాగానే కాస్తోంది. కాని రెండవ కాపుకు వచ్చేసరికి కాయ ముదురుగా, తక్కువ సైజులో ముళ్ళతో వుంటోంది. దీనికి తగిన ఎరువు ఏదైనా వుందా? ఆకు పురుగుకు తగిన మందు చెబుతారా? అలాగే దొండపాదు కూడా తీగలో సారంలేకుండా చప్పబడి పోతూ ఒకవైపు ఎండిపోతోంది, కారణం ఏమిటి?

భూమిలో సారం పోయింది. అలాంటప్పుడు ఇక మొక్కలు ఎలా ఎదుగుతాయి? ఆ మట్టిని తీసి వేసి సారవంతమైన మట్టితో నింపండి. ఆ తరువాత మొక్కలు, పాదులు బాగా కాస్తాయి. ఇక ఆకు పురుగుకి మందు, ఆ పురుగునుబట్టి వుంటుంది. హార్టీకల్చరల్ వారిని సంప్రదించండి. చూపి మందు ఇస్తారు. సెంటు జాజి తీగకి ఏ ఎరువులు వాడాలో తెలియ జేస్తారా?

పందిపెంట శ్రేష్టం. రేగడిమన్ను, చెత్త ఎరువు కూడా వేయవచ్చు. ◻

# చందన ఒయ్యారంలో ఒలిగే సౌందర్యం

గోకుల్ మీకు ఇచ్చేది చక్కని తాజా సౌందర్యం, నూతనమైనది. మైక్రోఫైన్ పద్ధతితో తయారు చేయబడినది. పరిశుద్ధమైన చందనం, అద్భుతమైన మూలికలు, ఇతర సువాసన ద్రవ్యములు చేకూర్చ బడినది.




**గోకుల్ పౌడరు వాడండి**
**సౌందర్య దేవతగా ఒలగండి!**

## గోకుల్

సాన్‌టాల్ & సాన్‌డల్‌వుడ్ పౌడరు

**టి. యస్. ఆర్. & కంపెనీ, మదరాసు**

ప్రత్యేక తయారింపు

టి. యస్. ఆర్. & కంపెనీ, రామాపురం మదరాసు 600 089



ADWAVE-TSR 692/TEL R

కొత్త శీర్షిక:

# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

మనకు వారసత్వంగా లభించిన ప్రాచీన విశ్వసాహిత్యంలో అమృత నిధులైన ఉద్గ్రంథాలెన్నో ఉన్నాయి. ఆ మహాగ్రంథాల రచయితలను గురించి, కథాసంవిధాన వైశిష్ట్యాలను గురించి ముదావహమైన సంగతులున్నాయి. సూక్ష్మంగానైనా వాటి కథారూపాలను పాఠకులు తెలుసుకోగలరన్న ఉద్దేశంతో ఈ సంచికనుంచి 'విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు' పేరిట ఈ శీర్షికను—ఆంధ్ర రచయిత్రి గంగాదేవి సంస్కృత రచన 'మధురా విజయమ్'తో ఆరంభిస్తున్నాము:

—వ. సం

'బ్రాహ్మీదేవి'

విశ్వ సాహిత్యంలో ప్రాచీనమైనది సంస్కృత సాహిత్యము. అతి ప్రాచీన కాలంలోనే సంస్కృతంలో మహా కావ్యాలు వచ్చినై. వాల్మీకి, వ్యాస, కాళిదాస, భాస, భవభూతి, మురారి, భారవి, మాఘ మొదలైన వారంతా ఎవరి మార్గంలో వాళ్ళు మహా కవులు సంస్కృతంలో. సంస్కృతంలో మహా కావ్యాన్ని రచించి దాన్ని ఉత్తమ స్థాయిలో నిలువ బెట్టిన గౌరవం స్త్రీలలో ఆంధ్రుల ఆడపడుచు గంగాదేవికే దక్కింది.

'మధురా విజయం' గంగాదేవి రచన. ఈ కావ్యం ఇతివృత్తం–చరిత్ర. చరిత్రను వస్తువుగా తీసుకుని మహాకావ్యం వ్రాసిన కల్హణునితో తుల్యమైన కీర్తి సంపాదించింది గంగాదేవి. కల్హణుని కావ్యానికి కాశ్మీరదేశ రాజవృత్తాంతం కథావస్తువు కాగా, గంగాదేవి కావ్యానికి ఆమె సమకాలీన చరిత్ర వస్తువైంది.

మధురా విజయానికి 'వీరకంపరాయ చరిత్ర' అనే నామాంతరం కూడా ఉన్నది.

కాళిదాస మహాకవి తన మహా కావ్యాలలో ఒక్కొక్క సర్గలో ఒక్కొక్క ఛందస్సును ప్రయోగించి కథానుకూల ఛందోగమనాన్ని సాగించినట్లుగానే గంగాదేవి కూడా 'మధురా విజయము'లో వేరు వేరు సర్గలలో వేరు వేరు ఛందస్సులను ఉపయోగించి (అనుష్టుప్, ఉపజాతి, వంశస్థము, ద్రుత విలంబితము, పుష్పితాగ్రము మొ॥) కథానుసారి ఛందోగమన శిల్పాన్ని చక్కగా పోషించింది.

గంగాదేవి ఈ కావ్యాన్ని క్రీ. శ. 1371-1374 ప్రాంతాల రచించినట్లు స్పష్టమవుతున్నది.

ఈ మహా కావ్యాన్నిబట్టి గంగాదేవిని గురించిన వివరాలు కొన్ని తెలుస్తున్నవి. ఆమె ఓరుగల్లు ప్రాంతమున జన్మించినది. విజయనగర సామ్రాజ్యాన్ని నిర్మించిన హరిహర బుక్కరాయ సోదరులలో బుక్కరాయలకు ముగ్గురు కుమారులు. కంపన, సంగమ, కుమారకంపన. గంగాదేవి కుమారకంపనకు పట్టమహిషి. మరియొక భార్య రామాదేవి.

విజయనగర చక్రవర్తి బుక్కరాయలకు కోడలై ద్రావిడ దేశమున తొండమండలమును చక్రవర్తి ప్రతినిధిగా పాలించిన కుమారకంపనకు పట్టమహిషియై గొప్ప స్థితిలో వున్న గంగాదేవికి వినయ విధేయతలుండేవి. పెద్దలయందు దైవము నందు మిక్కిలి భక్తి గౌరవములు. ఆమె మహా విదుషీమణి.

ఆధ్యాత్మిక గురువుగా ఈమె కాశీ విలాస క్రియాశక్తిని స్తుతించినది. అతడు కాశ్మీరదేశం వాడు. వైదిక విద్యలందేగాక శైవాగమములందును నిష్ణాతుడు. ఇతడు హరిహర బుక్కరాయలిద్దరికీ గురువు. ఈ కాశ్మీర శైవ పండితుడు ఉపనిషన్మతానుయాయియైన శ్రీ జగద్గురు విద్యారణ్యస్వామికి శిష్యుడై చివరకు సన్న్యాసము స్వీకరించినవాడు. ఇతని కుమారుడు చంద్రభూషణ క్రియాశక్తి.

గంగాదేవి స్తుతించిన పూర్వ సంస్కృత కవులలో వాల్మీకి, వ్యాస, కాళిదాస, బాణ, భారవి, దండి, భవభూతి, శీలాశుకుడు మొదలైనవారు ఉన్నారు. ఈమె ఆంధ్ర విద్వత్కవులను కూడా స్తుతించినది. వారిలో తిక్కన సోమయాజి ప్రథముడు. ఆయనతోపాటు అగస్త్యుని, గంగాధర పండితుని, విశ్వనాథకవిని స్తుతించింది.

అగస్త్యుడు (క్రీ శ. 1292 - 1323) కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు ఆస్థానంలో కవిగా వుండి 'ప్రతాపరుద్ర యశోభూషణమ్' అనే ప్రసిద్ధమైన అలంకార గ్రంథాన్ని రచించినవాడు. ఆయనకు విద్యానాథుడను బిరుదు పాండిత్యప్రకర్ష

వల్ల లభించింది. భారత కథను దృశ్య కావ్యంగా రచించినవాడు గంగాధర పండితుడు. అగస్త్యునికి మేనల్లుడే విశ్వనాథకవి. ఇతడు 'సౌగంధికాప హరణ' మన్న కావ్యాన్ని రచించినవాడు. ప్రతాప రుద్రుని ఆశ్రితుడు.

ఋతువర్ణన, చంద్రోదయము, ప్రయాణము, నాయకాభ్యుదయము మొదలైన అష్టాదశ వర్ణనలతో వున్న మధురా విజయములో మహాకావ్య లక్షణాలు చక్కగా అమరినవి.

ఈమె శ్లోకాలు కాళిదాసుని దండిని జ్ఞాపకం చేస్తుంటవి. ఈమె వర్ణనాచమత్కృతి, రచనలోని మృదుత్వం ప్రత్యక్షర ప్రస్ఫుటంగా నడచినది– మధురావిజయ మహాకావ్యము. ఎన్ని శ్లోకాలనైనా ఉదహరింపవచ్చును.

"మదాంధకారోహి మహానిశీథినీ
ప్రబోధ చంద్ర ప్రతిరోధకాలికా
మనోజమత్త ద్విపవైజయంతికా
శరీరిణాం శశ్వదలంఘినీదశా॥"

సామాన్య విషయాలను కూడా ఈమె మనోహరంగా చెప్పగలదు. లలిత మధుర ప్రసన్నమైన వైదర్భీరీతి.

మొదటి సర్గలో కృత్యాది, దైవగురు ప్రార్థన, పూర్వ కవిప్రార్థన, మొదలయినవి ముగిసిన పిదప కావ్య నాయకుడైన కుమారకంపరాయల స్థానమైన విజయనగర వర్ణన విపులంగా వున్నది. శ్రీ శృంగేరి జగద్గురు విద్యారణ్యస్వామి ఆశీర్బలంతో విజయనగర సామ్రాజ్యమును హరిహర బుక్కరాయ సోదరులు నిర్మించారు. స్థాపన మొదలు క్రీశ. 1356 వరకు హరిరాయలు చక్రవర్తిగా వున్నారు. తరువాత బుక్కరాయలు చక్రవర్తి. బుక్కరాయలకు దేపాయి దేవేరి. వారికి కంపన, సంగమ, కుమారకంపన పుత్రులు. రచయిత్రి గంగాదేవి కుమారకంపనకు దేవేరి. ఈ వివరాలు ద్వితీయ సర్గయందున్నవి. తండ్రి బుక్కరాయలు కుమారుడైన కుమారకంపనకు చేసిన హితబోధ మూడవసర్గ.

నాలుగవసర్గ కుమారకంపన జైత్రయాత్రా వర్ణనము. కాంచీనగరంలో కుమారకంపన కొంత కాలం ఉండేవాడు. వర్షఋతువు, శిశిరహేమంతములు అక్కడనే గడిపినాడు. ఇది అయిదవ సర్గలోని విషయము. శిబిరమున కుమారకంపరాయల జీవితం ఆరవసర్గలోని విషయము. గంగాదేవి కంపరాయల సంభాషణ వృత్తాంతము సప్తమసర్గ.

ఎనిమిదవసర్గలో మధురాపురాధిదేవత కంపరాయలకు ప్రత్యక్షమై తన బాధ వెల్లడించుట; కంపరాయలు యుద్ధమున తురుష్కులను జయించుట వర్ణింపబడినవి.

మధురా ప్రాంతమున తురుష్కుల పరిపాలనమున జనుల గోడును గంగాదేవి యిట్లు వర్ణించినది.

"పూజా పురస్కారములు నిలచిపోవుటవలన దేవాలయములు పాడుపడిపోయినవి. మృదంగ ధ్వానములకు బదులు వానియందు నక్కల యూళలు నెలగుచున్నవి. నీతిలేని తురుష్కులవలె, కావేరీనది తన పూర్వ మర్యాదలనుల్లంఘించి తరచుగా తన ప్రవాహమువలన సర్వనాశనము గావించుచున్నది. అగ్రహారములందు సతతాధ్వర సౌరభములకు బదులు పచ్చిమాంసపు పొలగులు కొనుచున్నవి. వేద ఘోషణకు బదులు వికృత తురుష్క సింహనాదములు వినవచ్చుచున్నవి. మధురానగర పరిసరములందున్న ఉపవనములు చూచుటకు ఘోరములైయున్నవి. నారికేళ షండములు ఖండితములైనవి. ఎటు చూచినను మనుష్య కపాల మాలికలు వ్రేలాడు శూల పరంపరలు గానవచ్చుచున్నవి. ఏ పట్టణపు రాజవీధులు రమణీమణుల మణినూపుర ప్రణాదము వలన రమణీయములై యుండెనో అవి యిప్పుడు ద్విజుల యొక్క సంకెలుల చప్పుడువలన కర్ణశూలములైనవి. సాలీని గూండ్లు పుర గోపుర సాలభంజికలకు పట్టు పుట్టములైనవి. హిమచందన వారి సేకముచేనే రాజమందిరాంగణములు జల్వలీనుచుండెనో అవి నేడు బందీకృతులైన వనితాజనుల కన్నీటిచే దడియుచున్నవి. పూర్వము జలకములాడు స్త్రీల మేని చందనముల దరగుటవలన దేని జలములు పాండురమగుచుండెనో ఆ తామ్రపర్ణి నదీ పావనోదకములు నేడు నృశంసులైన తురుష్కులచే జంపబడిన గోవుల రక్తమువలన నెర్రనై పారుచున్నవి. వేదము విస్మరింపబడినది. ధర్మము దాగినది. న్యాయ ఔదార్యము లెచ్చటను గానరావు. దిక్కులేని ద్రావిడుల ముఖములందు నిరాశ నెలకొనియున్నది."

ఈ రాక్షస కృత్యములను భీభత్సరసోపేతముగ వర్ణించినది గంగాదేవి. □

**[లోకజ్ఞానం: సమాధానాలు]**

1. అలెగ్జాండ్రియా (ఈజిప్టు) లోని ఫారోస్. క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దిలో కట్టబడిన లైట్ హవుస్ ఇది. దీని ఎత్తు 500 అడుగులు.
2. స్వచ్ఛమైన వజ్రానికి రంగు లేదు. అది ఏ రంగులోనూ వుండదు. స్ఫటికంలా వుంటుంది. స్వచ్ఛమైన వజ్రాన్ని కట్ చేసినప్పుడే ఇంద్రధనుస్సులాగా సప్తవర్ణాలను వివిధ కోణాల నుంచి ప్రసరింపజేస్తుంది.
3. అమెరికాలోని మిస్సిసిపి - మిస్సోరి (దీని పొడవు 3,710 మైళ్ళు) ఈజిప్టులోని నైలు నది (4,149 మైళ్ళు) సోవియట్ రష్యాలోని వోల్గా నది (2,290 మైళ్ళు) ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన నదులు. అయితే రష్యాలోని అబ్ - ఇర్తిష్ నది వోల్గా నదికన్నా పొడవైనది. దీని పొడవు 3,200 మైళ్ళు.
4. భూటాన్‌కి తింపు, బెల్జియంకి బ్రస్సెల్స్, పాకిస్తాన్‌కి ఇస్లామాబాద్, టర్కీకి అంకారా, థాయ్‌లాండ్‌కి బాంగ్‌కాక్-రాజధాని నగరాలు.
5. అమెరికా సంయుక్త రాష్ట్రాలకి (USA) 16 వ అధ్యక్షుడు.
6. ఆగస్ట్ 4, 1914 న ప్రారంభమై, నవంబర్ 11, 1918 న అంతమైంది.
7. జపాన్‌దేశం. ఫిబ్రవరి 11, 1970 న జపాన్ అంతరిక్షంలోకి ఉపగ్రహాన్ని పంపి ఆసియాలోకెల్లా తొలి దేశంగా ఘనత పొందింది. అదే సంవత్సరం ఏప్రిల్ 25 న చైనా కూడా ఒక ఉపగ్రహాన్ని పంపి ద్వితీయ స్థానం పొందింది.
8. 1952 లో. డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్ ప్రథమ అధ్యక్షుడుగానూ, పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూ ప్రథమ ప్రధానిగానూ పదవీ స్వీకారం చేశారు.
9. శ్రీమతి విజయలక్ష్మీపండిట్.
10. ప్రొఫెసర్ సర్ విలియం లారెన్స్‌బ్రాగ్. ఈయన ఇంగ్లండు దేశస్థుడు. 1915 లో అతని 25 వ ఏట భౌతికశాస్త్రంలో ఆయన జరిపిన పరిశోధనలకుగాను ఈ బహుమతి లభించింది.

# సంస్కృత పాఠమాల (3)

**स्वरयुक्त व्यञ्जनानि** స్వరయుక్త వ్యఞ్జనాని = గుణితములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కౄ | ఖౄ | గౄ | ఘౄ | ఙౄ | చౄ | ఛౄ | జౄ | ఝౄ | ఞౄ |
| कॄ | खॄ | गॄ | घॄ | ङॄ | चॄ | छॄ | जॄ | झॄ | ञॄ |
| కౢ | ఖౢ | గౢ | ఘౢ | ఙౢ | చౢ | ఛౢ | జౢ | ఝౢ | ఞౢ |
| कॢ | खॢ | गॢ | घॢ | ङॢ | चॢ | छॢ | जॢ | झॢ | ञॢ |
| కె | ఖె | గె | ఘె | ఙె | చె | ఛె | జె | ఝె | ఞె |
| के | खे | गे | घे | ङे | चे | छे | जे | झे | ञे |
| కై | ఖై | గై | ఘై | ఙై | చై | ఛై | జై | ఝై | ఞై |
| कै | खै | गै | घै | ङै | चै | छै | जै | झै | ञै |
| కో | ఖో | గో | ఘో | ఙో | చో | ఛో | జో | ఝో | ఞో |
| को | खो | गो | घो | ङो | चो | छो | जो | झो | ञो |
| కౌ | ఖౌ | గౌ | ఘౌ | ఙౌ | చౌ | ఛౌ | జౌ | ఝౌ | ఞౌ |
| कौ | खौ | गौ | घौ | ङौ | चौ | छौ | जौ | झौ | ञौ |
| కం | ఖం | గం | ఘం | ఙం | చం | ఛం | జం | ఝం | ఞం |
| कं | खं | गं | घं | ङं | चं | छं | जं | झं | ञं |
| కః | ఖః | గః | ఘః | ఙః | చః | ఛః | జః | ఝః | ఞః |
| कः | खः | गः | घः | ङः | चः | छः | जः | झः | ञः |
| ట | ఠ | డ | ఢ | ణ | టా | ఠా | డా | ఢా | ణా |
| ट | ठ | ड | ढ | ण | टा | ठा | डा | ढा | णा |
| టి | ఠి | డి | ఢి | ణి | టీ | ఠీ | డీ | ఢీ | ణీ |
| टि | ठि | डि | ढि | णि | टी | ठी | डी | ढी | णी |
| టు | ఠు | డు | ఢు | ణు | టూ | ఠూ | డూ | ఢూ | ణూ |
| टु | ठु | डु | ढु | णु | टू | ठू | डू | ढू | णू |
| టృ | ఠృ | డృ | ఢృ | ణృ | టౄ | ఠౄ | డౄ | ఢౄ | ణౄ |
| टृ | ठृ | डृ | ढृ | णृ | टॄ | ठॄ | डॄ | ढॄ | णॄ |
| టౢ | ఠౢ | డౢ | ఢౢ | ణౢ | | | | | |
| टॢ | ठॢ | डॢ | ढॢ | णॢ | | | | | |

(మిగిలిన గుణింతములు వచ్చేసారి)

# దిండు గలీబులు

ఇక్కడ అందంగా వున్న దిండు గలీబులు కనిపిస్తున్నాయి. అలాంటివి కుట్టుకోవాలని మీకు అనిపించవచ్చును. ఆ వూహ వున్న వాళ్ళకి—



**కావలసిన వస్తువులు: 1 మీటరు ముదురు ఆకుపచ్చ, లేత ఎరుపురంగులలో కేస్‌మెంట్ గుడ్డ, ½ మీటరు నీలంరంగు లాన్ గుడ్డ, ¼ మీటరు నలుపురంగు లాన్ గుడ్డ (అప్లిక్ వర్క్ కోసం) నలుపు, నీలం రంగు దారపు బంతులు.**

ముందుగా 17 అంగుళాల పొడవు మరో 17 అంగుళాల వెడల్పుతో గలీబు ముందుభాగం కోసం కేస్‌మెంట్ గుడ్డ కత్తిరించుకోవాలి. ఆ విధంగానే వెనుక భాగానికి 17 అంగుళాల పొడవు, 18 అంగుళాల వెడల్పుతో మరో గుడ్డ పీలిక కత్తిరించుకోవాలి. కేస్‌మెంట్ గుడ్డతోనే 3¾ అంగుళాల పొడవుతోనూ 17 అంగుళాల వెడల్పుతోనూ గలీబు బెల్టు తయారు చేసుకోవాలి.

చిత్రంలో చూపిన డిజైనుని నీలిరంగు లాన్ గుడ్డమీద ట్రేస్ చేసుకోవాలి. ఇలా ట్రేస్ చేసుకున్న డిజైను చుట్టూ ¼ అంగుళం విడిచిపెట్టి ఒక గీత గీసుకుని ఆ గీత చుట్టూ కత్తిరించాలి.

డిజైను గీసుకున్న లాన్ గుడ్డని కేస్‌మెంట్ గుడ్డమీద కదలకుండా అమర్చుకోవాలి. ఇప్పుడిక డిజైనుని ఒక అంగుళం మేర మడిచి గలీబుమీద హెమ్ చేసుకోవాలి. పూర్తిగా డిజైనుని హెమ్మింగ్ చేసుకున్న తరువాత నలుపురంగు లాన్ గుడ్డతో గుండ్రంగా చేసుకున్న ముక్కల్ని తీసుకుని

డిజైనులో చూపినట్లుగా హెమ్ చేయాలి.

ఇక యిప్పుడు బెల్టు కుట్టుకోవాలన్నమాట. 1/2" అంగుళం మేర బెల్టు ఒకవైపు మడిచి కుట్టుకుని, రెండవ వైపుని దిండు గలీబు లోపలి భాగానికి జతచేసి కుట్టుకోవాలి.

ఆ తరువాత గలీబు వెనక భాగంలో ఒకవైపు అంచు కుట్టుకోవాలి. ఇప్పుడు దిండు గలీబు ముందుభాగం, వెనుకభాగం అంచులు రెండూ ఒక దానిపైకి ఒకటి వచ్చేలా అమర్చుకుని రెండు వైపులా కుట్టుకోవాలి. ఇక మిగిలిందల్లా దిండు గలీబు మూడు వైపులా కుట్టుకుని గలీబు ఆకారం



లోకి తెచ్చుకోవడం. గలీబులో దిండు అమర్చేందుకు వీలుగా అంచు వున్న వైపు మాత్రం కుట్టకుండా అలాగే విడిచిపెట్టెయ్యాలి. దాంతో అందమైన దిండు గలీబు తయారైందన్నమాట.

ఇక్కడ మరో డిజైను కూడా యిస్తున్నాము. అయితే ఆ డిజైను ప్రకారం గలీబు కుట్టుకోవడానికి కూడా పైన చెప్పిన విధానం అమలుపరిస్తే చాలు. ఈ డిజైనులలో దిండు గలీబులు తయారు చేసుకునేందుకు వర్ణచిత్రంలో చూపిన రంగులే కాకుండా మీకు నచ్చిన రంగులలో కూడా గుడ్డలు తీసుకోవచ్చును. ఈ డిజైనులు కుట్టుకోవడం కూడా సులభం. పరుపులమీద, సోఫాలమీద కూడా యివి చూడ ముచ్చటగా, శోభాయమానంగా వుంటాయి.





# శివలక్ష్మి సిస్టర్స్

శతాధిక ప్రదర్శనలు యివ్వడమే ఒక విశేషం. అటువంటిది ముగ్గురు అక్క చెల్లెళ్ళు కలిసి – కలిసికట్టుగా రెండు వందల నాట్య ప్రదర్శనలు పైగా యివ్వడమన్నది అపూర్వమైన విషయం. ఆ ఘనత దక్కించుకున్న అపూర్వ సోదరీమణులు విజయవాడ వాస్తవ్యులైన శివలక్ష్మి రామచంద్రన్, శివలలిత, కుమారి శివలత.

వీరు భరత నాట్యాన్ని 'భారత కళాప్రపూర్ణ' నటరాజ రామకృష్ణవద్ద, కూచిపూడి నృత్యాన్ని కీ. శే. వేదాంతం సీతారామశాస్త్రి, జోస్యుల సీతారామశాస్త్రి, భాగవతుల యజ్ఞనారాయణశర్మ వద్ద శిక్షణ పొందారు. జానపద నృత్యాలు పి. పి. ఆనంద్ వద్ద నేర్చుకున్నారు. హైదరాబాద్‌లోని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ నిర్వహించిన అభినయ పాఠశాలలో కూడా శిక్షణ పొందారు.

ఆంధ్రరాష్ట్రంలోనే కాకుండా, మహారాష్ట్ర, తదితర రాష్ట్రాలలో కూడా వీరు అనేక ప్రదర్శనలు యిచ్చి పలువురి ప్రశంసలు పొందారు. బాపట్లలోని ఎన్. జి. ఓ. హోమ్ ప్రారంభోత్సవ సందర్భంలో ఏర్పాటు చేయబడిన వీరి నృత్య ప్రదర్శన తిలకించిన అప్పటి గుంటూరుజిల్లా కలెక్టర్ సతీమణి వీరికి బంగారు పతకాలు బహూకరించారు. వారికి లభించిన యోగ్యతా పత్రాలు, 'మెమెంటో'లు లెక్కలేనన్ని.

'కృష్ణశబ్దము', 'భామాకలాపము', 'రాధాకృష్ణ', 'బాలగోపాల తరంగము' వంటి నృత్యాలలోనూ, జానపద నృత్యాలలోనూ వారు ప్రవేశపెట్టిన నూతన పద్ధతులు, అభినయం సభికులను మంత్రముగ్ధులను చేస్తాయి. 'శిలువ ప్రభావము' అనే వీరి నృత్య నాటిక ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యాయుల సమక్షంలో ప్రదర్శింపబడి పలువురి మన్ననలు పొందింది.

విశేషమేమంటే వీరి కుటుంబంలోని వారందరూ కళాకారులే. శివలక్ష్మి సిస్టర్స్ సోదరులు ప్రసాద్, శ్రీనివాస్ కూడా వీరి నృత్య నాటికలలో పాల్గొంటూ వుంటారు. వీరి తల్లి శ్రీమతి అనసూయమ్మ 'మేకప్', అలంకరణ మొదలైన విషయాలు చూసుకుంటూ వుంటారు. తండ్రిగారైన శ్రీ గద్దం సాంబశివరావు కళాభిమానులు.

శ్రీమతి శివలక్ష్మి బి. ఎస్సి వరకు, కుమారి శివలలిత బి.ఎస్సి, బి. ఇడి. వరకు చదువుకున్నారు. శివలత ప్రస్తుతం బి.కాం విద్యార్థిని. ఈ విధంగా వీరు ముగ్గురూ కూడా విద్యాధికులే కావడం మరో విశేషం!

ఈ అక్కా చెల్లెళ్ళు తాము నేర్చిన విద్యని కేవలం నృత్యప్రదర్శనలు యివ్వడానికే పరిమితం చేయలేదు. ఆ విద్యను నలుగురికీ పంచిపెట్టాలన్న తాపత్రయంతో తమ స్వగృహంలోనే 'కరుణా నికేతన్' పేరిట ఒక శిక్షణాలయాన్ని స్థాపించారు. కరుణా నికేతన్‌లో నృత్య శిక్షణతోపాటు నర్సరీ తరగతులలో కూడా శిక్షణ యిస్తున్నారు. సాయంత్రం ఆరు నుంచి ఎనిమిది గంటల వరకూ ఈ తరగతులు జరుగుతాయి.

ఒకవైపు ఉద్యోగాలు చేస్తూ, మరోవైపు నాట్య శిక్షణ యిస్తూ, వీలైనప్పుడల్లా ప్రదర్శనలు యిస్తూ ఇతోధికంగా కళాసేవ చేస్తున్నారు శివలక్ష్మి, శివలలిత, శివలత.

"మన నృత్య సంప్రదాయాన్ని దాని ఔన్నత్యాన్ని విదేశాలలో ప్రదర్శించి ఖండఖండాంతర కీర్తి నార్జించిపెట్టాలన్నది మా ఆశయం" అంటారు శివలక్ష్మి సిస్టర్స్. □

తాడేపల్లిగూడెం డి. ఆర్. గోయంకా వనితా కళాశాల కామర్స్ క్లబ్ విద్యార్థినులు ఇటీవల భారత దేశపు వాణిజ్య విశేషాలను చూపే ప్రదర్శన ఒకటి నిర్వహించారు. ఈ ప్రదర్శనలోని యంత్ర విభాగం పలువురిని ఆకర్షించింది.





రాజమండ్రిలో రంగస్థల వృత్తి కళాకారుల సదస్సు యిటీవల జరిగింది. ఆ సందర్భంగా కుమారి పానుగంటి పద్మ కూచిపూడి నాట్యప్రదర్శనలు ఇచ్చింది. ఆనాటి ప్రదర్శనను తిలకించిన శ్రీమతి జమునా రమణరావు కుమారి పద్మను అభినందించారు.

# వార్తావని(త)



భిలాయి 'ఆంధ్ర మహిళా మండలి' ఐదవ వార్షికోత్సవాల సందర్భంగా సభ్యురాండ్రు ప్రత్యేక ప్రదర్శనలు యిచ్చారు. వాటిలో 'వివిధ వేషాలంకరణ' పోటీ ఒకటి. ఈ పోటీలో సర్దార్జీ వేషం వేసిన శ్రీమతి సరోజిని ప్రథమ బహుమతిని అందుకున్నారు. ఈ చిత్రంలో కుడివైపు నుంచి ముఖ్య అతిథి డా॥ కాంతకుమారి, అధ్యక్షురాలు శ్రీమతి అచ్యుతకుమారి ఎడమవైపు నుంచి ఉపాధ్యక్షురాలు శ్రీమతి త్రివేణి, కార్యదర్శి శ్రీమతి మోహిళారావు, కార్యవర్గ సభ్యురాలు శ్రీమతి శాంతాదేవి వున్నారు.





తిరుపతి శ్రీ వెంకటేశ్వరా నాట్యకళా పరిషత్ వారు రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన నాటక పోటీలలో కుమారి లక్ష్మీప్రియ ఉత్తమనటి బహుమతి అందుకున్నారు. చిత్తూరు ఆర్ట్ లవర్స్ వారి 'క్రీసీడ' నాటకంలో చక్కటి నటన ప్రదర్శించినందుకు ఆమెకు ఈ బహుమతి లభించింది.

చీరాల మహిళామండలి రజతోత్సవ కార్యక్రమాలు ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యురాలు శ్రీమతి దొడ్డపనేని ఇందిర అధ్యక్షతన జరిగాయి. శ్రీమతి భవనం జయప్రద ముఖ్య అతిథిగా విచ్చేశారు. మహిళా సభ్యులచే సాంస్కృతిక ప్రదర్శనలు జరిగాయి. ఈ చిత్రంలో వందన సమర్పణ చేస్తున్న శ్రీమతి ఎమ్. కల్యాణి, జాగర్లమూడి పద్మావతి, దొడ్డపనేని ఇందిర, ఎస్. ఫ్రేజర్, అధ్యక్షురాలు పోలవరపు అనసూయ, భవనం జయప్రద, కార్యదర్శి గోరంట్ల ఉమ వున్నారు.





ఇటీవల జెమ్‌షెడ్‌పూర్ ఆంధ్ర మహిళా సమితి (తూర్పు మండలం) టెల్కోవారు శ్రీమతి రామమతీ రామకృష్ణ రాసిన 'అత్తగారు-వక్షివాళ్ళు' నాటిక ప్రదర్శించారు. ఈ నాటికకు శ్రీమతి ఎం. ఎస్. కాంతం దర్శకత్వం వహించారు. సమితి అధ్యక్షు రాలు శ్రీమతి సర్పుబాయి ఆధ్వర్యంలో ఈ నాటిక ప్రదర్శించబడింది. ఆనాడు నాటిక తిలకించిన వారిలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, ఆయన సతీమణి వున్నారు. నాటికలో పాల్గొన్న వారికి శ్రీ నాగేశ్వరరావు చేతిమీదుగా బహుమతి ప్రదానం జరిగింది.

హైద్రాబాద్ వెంగళరావు నగర్ కాలనీ ఆదర్శ మహిళా మండలి యిటీవల బోధన్ తాలూకా శ్రీనగర్‌లో బాలికల సెలవు శిబిరం నిర్వహించారు. రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహామండలి సహాయంతో ఏర్పాటైన ఈ శిబిరంలో ముప్పై మంది బాలికలు పాల్గొని సాంస్కృతిక ప్రదర్శనలు యిచ్చారు. మండలి కార్యదర్శి ఎం. మహాలక్ష్మి, అధ్యక్షురాలు వై. లక్ష్మీప్రసన్న, కోశాధికారి ఎం. పార్వతి, సాంస్కృతిక విభాగం నిర్వాహకురాలు ఎ. రమా దేవి నైపుణ్యంతో శిబిరాన్ని నిర్వహించారు.



గత సంచికలో ఇచ్చిన

"చిత్రానికి వ్యాఖ్య" కు వచ్చిన వాటిల్లో బాగున్నదనిపించిన వ్యాఖ్యను పంపిన వారు :

అలపర్తి లక్ష్మీతులసి (నంది వెలుగు)

'ఉపయోగపడే చక్కని బహుమతి'ని పార్సెల్ ద్వారా ఆమెకు పంపివేశాము.

వ్యాఖ్య :

'ముద్దుగుమ్మను చూస్తుంటే ప్రమోదం
ఎద్దు కుమ్మిందంటే ప్రమాదం!'



లోయర్ సీలేరు మోతుగూడెం 'లేడీస్ రిక్రియేషన్ క్లబ్' తమ ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా వనితలకు, పిల్లలకు ఆటల పోటీలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. ఆ సందర్భంగా పిల్లలచే 'ద్రౌపది స్వయంవరం' నాటకం ప్రదర్శింపబడి సభికులను రంజింపజేసింది.

❋

రాయచోటి శ్రీ వాసవీ మహిళా సంఘం ప్రారంభోత్సవం యిటీవల జరిగింది. ఎం. ఎస్. ఆనందమ్మ అధ్యక్షత వహించారు. ఆనాటి సభలో అధ్యక్షురాలుగా కువ్వం రామతిలకమ్మ, ఉపాధ్యక్షురాలుగా మాతి మీనాక్షమ్మ, కార్యదర్శిగా సి. వసంతరెడ్డి కుమారి సహాయ కార్యదర్శిగా డి. జ్యోతి, కోశాధికారిగా కె. లలితమ్మ ప్రమాణ స్వీకారం చేశారు.

# అన్యోన్య దాంపత్యం

— యస్. జ్యోతీనాథ్

ఒక్కసారిగా చెలరేగిన కరతాళ ధ్వనులకు ఉలిక్కిపడ్డట్టయి, చుట్టూ కలయజూసింది సరిత. అందరూ తమ వేపే దృష్టి కేంద్రీకరించి చప్పట్లు కొడ్తున్నారు. 'ఏమిటి' అన్నట్టు భర్తవేపు అయోమయంగా చూసింది. మధుకర్ చిరునవ్వుతో భుజం మీద చెయ్యేశాడు – లేచి పదమన్న అర్థం వచ్చేలా కళ్ళతో సైగ చేస్తూ.

వేదిక మీద మైక్‌లో సెక్రటరీ కాబోలు అంటున్నాడు.

"ఈ 'అన్యోన్య దాంపత్యం' పోటీలో ప్రథమ జంటగా గెలుపొందిన శ్రీ మధుకర్‌గార్నీ శ్రీమతి సరితా మధుకర్ గారినీ మరోసారి సంతోషంగా అభినందిస్తూ వేదిక మీదికి ఆహ్వానిస్తున్నాము. మా కార్యక్రమాన్ని జయప్రదంగా నిర్వహించిన ప్రేక్షకులకూ, న్యాయనిర్ణేతలకూ, పోటీ పెట్టిందే తడవుగా వుత్సాహంగా పాల్గొన్న అనేకమంది యువ దంపతులకూ మా కృతజ్ఞతాంజలులు" ఈసారి చప్పట్లు మరింత హెచ్చు స్థాయిలో విన్పించడం మొదలెట్టాయి.

'అన్యోన్య దాంపత్యం!' అనుకుంది సరిత తనలో తనే నవ్వుకుంటూ. 'హుఁ! ఎంత అందమైన అబద్ధం....'

"రా సరితా! తాత్సారం చేస్తే బావుండదు." మధుకర్ కంఠంలో అసహనం తనకొక్కదానికే అవగతమవుతుంది. తల దించుకుని.... పైటకొంగుని భుజాల మీదుగా లాగి కప్పుకుంటూ మధుకర్ వెనకగా నడిచి వెళ్ళి వేదిక ఎక్కింది సరిత.

కార్య నిర్వాహకులలో ఒకరు ఆ దంపతుల గళసీమల్ని పుష్పమాలలతో అలంకరించారు.

మధుకర్, సరితా చేతులు జోడించి అందరికీ ఓసారి నమస్కారం చేశారు.

"మాకీ అవకాశం కల్పించిన పత్రికా సంపాదకులు రామనాథంగారికీ, సంస్థ సంస్థాపకులు గురుమూర్తిగారికీ, మమ్మల్ని ప్రథమ స్థానంలో నిలిపిన న్యాయనిర్ణేతలకీ, ఆహూతులైన నా తోటి సోదర సోదరీమణులకి నా కృతజ్ఞతలు" అన్నాడు, మధుకర్ చిరునవ్వుతో.

బహుమతి ప్రదానానికి విచ్చేసిన గౌరవ అతిథి ఓ ప్రముఖ విద్యావేత్త.

పోటీ నిర్వహించిన ఓ ప్రముఖ పత్రికా, మరో సాంస్కృతిక సంస్థా ఆయన చేతుల మీదుగా తమ బహుమానాన్ని వారిద్దరికీ అందజేసాయి.

కెమేరాలు క్లిక్‌మన్నాయి అన్ని వేపులనుండీ. ప్రేక్షకులు చూపులు తిప్పుకోలేకపోయారు.

'ఎంత అందమైన విలక్షణమైన జంట!' అనుకోకుండా వుండలేకపోయాయి కొన్ని వందల హృదయాలు. ఆరడుగుల నాలుగంగుళాల సమున్నత విగ్రహం మధుకర్‌ది. కాస్త ఎరుపు తెలుపు కలిసిన పచ్చని ఛాయ. ఆకర్షణీయమైన ముఖంలో ఆ ఆకర్షణకి మేమే మూలమన్నట్టు చూసే కళ్ళూ, ఠీవిగా ఎత్తుగా నిలిచిన ముక్కూ.... ఎప్పుడూ చిరునవ్వు చిందించే పెదవులు.

ఆ వేళ ఫుల్‌సూటులో వున్నాడు మధుకర్.

సరిత గులాబీరంగు బెనారస్ చీర కట్టుకుంది. చీరమీద జరీ బుటాలు లైట్ల కాంతిలో తళుకులీనుతున్నాయి. అతి సాదా అయిన అలంకరణే అయినా, సరితలో దాగిన సౌందర్యానికి అది అడ్డు రావడంలేదు. చల్లని మెల్లని పిల్లవాయువూ, పౌర్ణమినాటి వెన్నెలా, నిర్మలంగా సాగే నదీ జలాలూ, ప్రభాతాన అరవిరిసిన రోజా పుష్పం.... ఇవి ఆమె అందానికి నిర్వచనాలు.

ఆ రాత్రి చిన్న వినోద కార్యక్రమం తర్వాత విందు భోజనం ఏర్పాటు చేశారు.

మధుకర్ నెరిగినవాళ్ళూ స్నేహితులూ ఒక్కొక్కళ్ళే వచ్చి తమ అభినందనలు తెలుపుకుంటున్నారు. మధుకర్ చిరునవ్వుతో కరచాలనం చేస్తున్నాడు. యాంత్రికంగా చేతులు జోడించి నమస్కారాలు చేస్తోందామె. ఆమె మనసు ప్రస్తుతం యిక్కడ లేనేలేదు. పురుషుల ఆరాధనాపూర్వకమైన చూపులుగానీ స్త్రీల ఈర్ష్యాపూరిత వీక్షణాలుగానీ ఏవీ ఆమెని స్పృశించడంలేదు.

'అన్యోన్య దాంపత్యం' అని నవ్వుకుంది ఆమె అంతరాత్మ.

రెండేళ్ళ క్రిందట పెళ్ళినాడు తమ జంటని చూసి పెద్దలేమిటి....పిన్నలేమిటి...స్నేహితులేమిటి బంధువు లేమిటి .... అంతా అదేమాట అన్నారు. పొంగి పోయింది తను. మధుకర్‌ని పెళ్ళాడడం తన అదృష్టం అనుకుంది. ఈ వివాహం తన జీవితంలో నూతన సౌరభాలను వెదజల్లుతుందనుకుంది. 'మీ అమ్మాయి కన్నివిధాల దీటైన అల్లుడిని సంపాదించావ్ విమలమ్మా!' అని అంతా అంటుంటే అమ్మ కళ్ళలో వెలుగులు తనెలా మర్చిపోగలదు?

నాన్న తమని ఆప్యాయంగా చూసుకుని కంట తడిపెట్టిన దృశ్యం తనెలా చెరిపేసుకోగలదు? అత్తగారు తన బుగ్గలు పుణికి, 'మొత్తం మీద మావాడు తగిన పిల్లనే ఎన్నుకున్నాడు.' అని అనేసరికి తన హృదయం పురి విప్పిన నెమలే అయింది.

"మిమ్మల్నిద్దర్నీ చూస్తుంటే ఒకరికోసం మరొకరు పుట్టారేమో అనిపిస్తోంది సరితా!" అంది తన ప్రాణంలో ప్రాణం లాంటి స్నేహితురాలు

వరూధిని, తను మధుకర్ వెంట ఈవూరు వచ్చేసే రోజున. పెళ్ళయిన నెల రోజులు కలలో లాగా గడిచిపోయాయి.

"సరితా! ఏమిటి అలా స్తంభంలా నించుని ఆలోచిస్తున్నావ్? పద. వెళ్దాం" మధుకర్ పిలుపు సరిత నీ లోకంలోకి లాగింది.

మధుకర్! పేరులో మధురిమలు దాచుకున్న మధుకర్ మాటల్లో స్వారస్యం అది!

మౌనంగా వెళ్ళి అతని వెనకగా స్కూటర్ మీద కూర్చుంది సరిత.

ఇంటి కెళ్ళి చీర మార్చుకుంటుం టే, మధుకర్ చేతులు భుజాల మీదుగా వచ్చి చుట్టేశాయి.

"నా కెంత సంతోషంగా వుందో తెలుసా ఇవ్వాళ? నీకో పచ్చలసెట్....అయిదు వేలు కాష్ ఇచ్చారు. ఎన్నాళ్ళనుండో ఫ్రిజ్ కొనుక్కుందా మన్న ఆలోచన వుంది. రేపే వెళ్ళి కొందామను కుంటున్నాను."

మృదువుగా అతని చేతులు తప్పించుకుంటూ వెళ్ళి చీరను బీరువాలో పెట్టి వెనక్కి తిరిగి అంది సరిత. "పోనీ....మన స్కూటరు బాపతు యింకా మూడు వేలకు పైగా తీర్చాల్సింది వుంది గదా.... అది తీర్చండి."

మధుకర్ ముఖంలో రంగులు మారాయి.

"చూద్దాంలే" అన్నాడు మామూలుగా.

రెండేళ్ళ వైవాహిక జీవితంలో సరితకి అతని ఉద్దేశం బాగానే తెలుసు. ఆ 'చూద్దాంలే' అన్న దానికి చేయడనే అర్థం అని.

నెమ్మదిగా వెళ్ళి మంచం మీద వాలిపోయింది. లైటార్పి, ఆమెని తన వేపు తిప్పుకున్నాడు మధుకర్.

*

మర్నాడు పేపర్లో వచ్చింది తమ ఫోటో. సిగ్గుగా అన్పించింది సరితకి. చాలా దగ్గరగా హత్తుకుని నిల్చున్నట్లు తీయించుకున్నారు యిద్దరూ.

మధుకర్ ప్రొద్దున్నే టిఫిన్ తిని డ్యూటీకెళ్ళాడు. ఇక రావడం మధ్యాహ్నం లంచికే.

రాత్రి బాగా ప్రొద్దుపోయి నిద్రపోవడంతో సరితకి ఒళ్ళంతా నెప్పులుగా తగని నీరసంగా వుంది.

ఎలాగో అలా వంట పూర్తిచేసి విశ్రాంతిగా పడుకుంది.

"అక్కా! ఫోనొచ్చింది." ఎదురింట ఉమ వచ్చింది యింతలో.

"ఎవరమ్మా?" లేచి వెళ్తూనే అడిగింది సరిత.

"బావగారేనక్కా!"

"హలో సరితా!" మధుకర్ ఉత్సాహంగా పిలిచాడు అవతలనుండి. "చూడూ...మా ఫ్రెండ్స్ పార్టీపార్టీ అని గోలపెట్టేస్తున్నారు. పరేననక తప్పలేదు. లంచ్‌కి ఏర్పాట్లు చెయ్యి. ముఖ్యమైన వాళ్ళో అయిదారుగురు వస్తారు. ఓకే?"

"లంచ్‌కా?" నీరసంగా అంది సరిత. మధుకర్‌కి నాలుగైదు ఆధరువులు కావాలి స్నేహితుల్ని పిలిస్తే. ఏదో సింపుల్‌గా చేస్తే సరిపెట్టుకోలేదు.

"మరో రోజు వీలవదా? ఇవ్వాళ కాస్త నలతగా...." సరిత మాట పూర్తికానే లేదు—

"ఇవ్వాళ పిలిచాక బావుండదు. ఎలాగో అలాగ చేసెయ్యి." అవతల ఫోను పెట్టిన ధ్వని.

ఆ కంఠంలోని అధికారానికి సరిత ఒళ్లు ఎప్పటి కప్పుడు జలదరిస్తూనే వుంటుంది.

'చెయ్యగలవా?' అన్న అభ్యర్థన అతని నోటి



గుండా ఒక్కనాడైనా వినలేదు తను. చెయ్యి.... చేసెయ్యి ? అన్న ధోరణే అతనిది.

వంట చేయడం తనకి కష్టం కాదు. కాని ముందుగా తను చేయగలదో లేదో అన్న ఆలోచన లేదు మధుకర్‌కి. ఆహ్వానించడం తన ప్రమేయం లేకుండా చేసేసి, ఆ తర్వాత తనని పరుగు లెత్తిస్తాడు. భార్య కూడా ఓ మనిషే....ఆమెకీ మనసుంటుంది. ఒొత్తిగా యంత్రం కాదు అని అతను నేర్చుకున్న చదువు బోధించలేదా ?

బజారు కెళ్ళి కూరలు తెచ్చి మళ్ళీ వంట మొదలెట్టింది సరిత.

లంచ్‌కి ఓ అరడజనుమందిని వెంటపెట్టుకుని వచ్చాడు మధుకర్.

ఛలోక్తులలో, నవ్వులతో భోజనాలు ముగించి వాళ్ళు వెళ్ళేసరికి సరిత ప్రాణం కడబట్టినంత పనయింది. నీరసంగా అన్నం తిని వెళ్ళి పడుకుంది.

మళ్ళీ కాలింగ్ బెల్ ధ్వనికిగాని మెలకువ రాలేదు. లేచి వెళ్ళి తలుపు తీసింది.

“ఏమిటా మొద్దునిద్ర వేళగానివేళ ? అంత అలసిపోయే పనులేం చేస్తున్నావ్ యింట్లో ? డర్టీ అవతారమూ....నువ్వూను....తల పగిలిపోతోంది. కాస్త కాఫీ తగలెయ్యి. నా మొహాన.'' విసుగ్గా అంటూ వచ్చి కుర్చీలో కాళ్ళు బారజాపుకుని కూర్చున్నాడు మధుకర్.

మాట్లాడేందుకు కూడా ఓపికలేనిదానిలా వెళ్ళి ముందుగా కాఫీకి నీళ్ళు పడేసింది సరిత. అవి మరిగే లోపుగా ఆ ప్రక్కనే వున్న వాష్ బేసిన్‌లో గబగబా ముఖం కడుక్కుని పైట చెంగుతో తుడుచుకుంది.

‘అదేమిటి సరితా. అలా వున్నావ్ ? ఒంట్లో బాగాలేదా ?’ అని ఆప్యాయంగా అడగకూడదా మధుకర్....అని ఎన్నోసార్లు అన్పిస్తుంది సరితకి. అలాగని మధుకర్ తనకనారోగ్యంగా వుంటే పూర్తిగా అలక్ష్యం చేస్తాడని కాదు. డాక్టర్ని పిలిచి, మందులు కొనీ నానా హైరానా పడతాడు. కాని అదేదీకాదు తనకి కావల్సింది. బహుశా తనే మధుకర్‌పట్ల సరియైన అవగాహనతో లేదా అంటే- ఏమో. మాటే దురుసుగా... మనసు బాధపడేలా వుంటే....కనపడని అతని మనసులో నవనీతం వుందని ఎలా అనుకోగలదు ?

రెండు కప్పుల్లో కాఫీ కలిపి తీసుకెళ్ళి అతని కెదురుగా కూర్చుంది.

“మధ్యాహ్నం లంచ్ చాలా బాగా కుదిరాయన్నారు సరితా ! భలే పొగిడారు నిన్ను. ‘అన్యోన్య దాంపత్యం’ అన్నది మన విషయంలో నూటికి నూరుపాళ్ళూ నిజంట.'' కాఫీ సిప్ చేస్తూ నవ్వుతూ అన్నాడు మధుకర్.

చిరునవ్వే సమాధానమైంది సరితకి.

‘అది కేవలం రూపం విషయంలోనే.’ అందామె మనసు.

ఎంత అందమైన రూపం మధుకర్‌ది ! కాని కేవలం ఆ రూపంతో సరిపెట్టుకోలేకపోతోంది తను. అతను తనకేవిధమైన లోటూ చెయ్యడు. అడగకముందే లేటెస్ట్ ఫాషను చీరలూ.... కాస్మెటిక్స్ ఏర్పాటు చేస్తాడు. నిజానికి పుట్టింట్లో కన్నా యిక్కడే సుఖంగా వుంది. కాని సుఖానికీ సంతోషానికీ మధ్యనున్న ఓ పలుచని తెర తన మనసుని కలవరపెడ్తోంది.

“ఏమిటా పరధ్యానం ? ఇవ్వాళ ప్రభు డిన్నర్ ఏర్పాటు చేశారు. వెళ్ళాలి.''

మధుకర్ మాటలు విన్పించి, ఖాళీ కప్పుని బల్లమీద పెడ్తూ అడిగింది సరిత. “ఎందుకు ?''

“ఎందుకేమిటి సిల్లీ....మనం పోటీలో ప్రథమ జంటగా గెలిచాం అది గుర్తుందా నీ మొద్దు బుర్రకి ? ఇంకో వారం యిలాగే డిన్నర్లూ పార్టీలూ వుంటాయి....'' పెద్దగా నవ్వాడు మధుకర్.

ఆ రాత్రి డిన్నర్ పార్టీ గ్రాండ్‌గా జరిగింది. మధుకర్, సరితా పార్టీలో సెంట్రల్ ఎట్రాక్షన్ అయ్యారు.

మధుకర్ అన్నట్టే ఆ వారమంతా ఎవరో ఒకళ్లు తమ యిళ్ళకి అహ్వానిస్తూనే వున్నారు. అభినందనలు తెలుపడానికి వచ్చేవాళ్ళు కొంతమంది. సరితకి వూపిరాడని పని ఆ వారమంతా.

*

మధుకర్, సరితల విజయం పాతబడింది కాస్త. సరితకిన్నాళ్ళకి తీరికంటూ దొరికింది. ఫ్రెండ్సూ, చెల్లెళ్ళూ, తలిదండ్రులూ రాసిన వుత్తరాలు చదువుతూ కూర్చుంది. అంతా పేపర్లో చూసి అభినందనలు తెలుపుతూ రాశారు.

“బావగారు భలే హేండ్‌సమ్‌గా వున్నారక్కయ్యా ఫొటోలో. నువ్వేమిటలా ‘సతీ సావిత్రి’ మొహం పెట్టావ్ తీవిగా పెట్టక ?'' అని రాసింది పెద్దచెల్లెలు భారతి.

“నాన్నగారు చాలా ముచ్చట పడ్డారమ్మా మీ ఫొటో చూసి. ఆ సంతోషంలో నన్ను కాస్త హాస్యం చేశారు కూడా....మా పెళ్ళినాడు తన స్నేహితులంతా అన్నారట....కాకి ముక్కుకి దొండపండులా వుందిరా మీ జంట అని. ఇంతకీ కాకి ఎవరు ? దొండపండెవరు ? అని అడిగాను మీ నాన్నగార్ని. ‘అదే అడగడం మరిచిపోయాను.’ అన్నారు. మీ నాన్న సంగతి నీకు తెలిసిందేగా....'' తల్లి రాసిన ఉత్తరం సరితకి నవ్వు తెప్పించింది.

నాన్న ఒక్కనాడు కోపంగా ప్రవర్తించడం తామెరుగరు. పిల్లల్లో పిల్లవాడిగా కలిసిపోయేవారు. ఊహ తెలిశాక అమ్మకీ నాన్నకీ మధ్య మాటా మాటా రావడం చూడలేదు తను. ఫలానాది యిష్టం లేదనిగానీ....యిష్టం అని గానీ అమ్మ నోరు విడిచి చెప్పేది గాదు. అసలా అవకాశమే కలగకుండా మనస్సెరిగి పనులు చేసేవాడు తండ్రి. అభిరుచులూ అభిప్రాయాలూ వేరైనా ఒకరి నొకరు మన్నించుకుంటూండేవారు. ఏభయ్యో పడిలో పడినా, తల్లిపట్ల అనురాగాన్ని సున్నితంగా వ్యక్తపరచే తన తండ్రి కళ్లు తనకి పదే పదే గుర్తు వస్తుంటాయి. ఆ ప్రేమకి సూత్రం బాహ్య ఆకర్షణ మాత్రం కాదు. తండ్రితో పోలిస్తే అమ్మ పెద్ద అందగత్తేమీకాదు. సన్నగా పొట్టిగా సామాన్య రూపురేఖలతో వుండే అమ్మ, భారీగా, చూడగానే అందగాడనిపించే తన తండ్రిని ఏ విధంగా మెప్పించగలిగింది ?

ప్రియమైన సరితా,

ఉత్తరం రాసి పడేస్తేగాని వూరుకోనంటున్న మనస్సుని అదుపులో పెట్టలేక యిన్నాళ్ళకి పలకరిస్తున్నాను. కోపం తెచ్చుకోకు నీ వరూ మీద. ఎంత బావుందో మీ జంట ? వెంటనే నాకు తోచిన దృష్టి తీసేశాను, మీ ఇద్దరికి. ఫొటోలో-మామూలుగా కన్నా బాగా పడ్డావ్. కాస్త ఒళ్ళు కూడా చేసినట్టుంది. ఏమన్నా విశేషమా పిల్లా ? శ్రీ మధుకర్ గారెలా వున్నారు ? పెళ్ళినాడు పందిరంతా ఏకం చేసి పారేసిన యీ వరూధిని గుర్తుందా ఆయనకి ? భలే అదృష్టవంతురాలివి సరితా. అన్నివిధాలా దీటైన భర్త దొరకడం స్త్రీకి వరం సుమా. నా హృదయపూర్వక అభినందనలు స్వీకరించు మరి.

నీ-వరూ.

వరూధిని రాసిన ఉత్తరం మళ్లీ మళ్లీ చదువుకుంది సరిత. తనకీ, వరూకీ ఉత్తర ప్రత్యుత్తరాలు తక్కువే మంచి స్నేహమైనా.

చిన్న వుత్తరమైనా అభిమానమంతా వ్యక్తపరిచింది వరూధిని.

'వరూ! నేనెలా చెప్పనే నా బాధ? చెప్పినా నీకర్థమవుతుందా? కొట్టి పారేస్తావా వుత్తదే అని.' కుర్చీలో వెనక్కి వాలి అనుకొంది సరిత.

కొన్ని నిమిషాల తర్వాత ఏమన్పించిందోగాని లేచి వెళ్ళి కాగితం కలం తెచ్చుకొని రాయడం మొదలెట్టింది.

వరూ డియర్,

నీ ఉత్తరం చూడగానే ఎదురుగా నిల్చుని మాట్లాడినట్లే ఫీలయ్యానంటే నమ్ము. ఏం చేస్తున్నావ్ ఆ కలకత్తా మహానగరంలో? మా వారి గురించి అడిగావ్‌గాని, మీ శ్రీవారి కబుర్లు విన్పించలేదేం?

నీ అభినందనలు స్వీకరిస్తున్నాను. ఏదో సరదాగా ఫొటో పంపారు. గెలుస్తాం అన్న ఆలోచనే లేదు. అంతా తమాషాగా జరిగింది.

నేను అదృష్టవంతురాలని అన్నావ్. నేనూ అలాగే అనుకున్నానే వరూ పెళ్ళినాడు. కాని ఆ భావన ఎంతో కాలం నిలవలేదు నా మనసులో. అది నా బలహీనతే అంటారేమో మరి....ఎందుకో నా మనస్సు విప్పి ఎవరితోనన్నా చెప్పుకోవాలన్పిస్తోంది. దాదాపు పదేళ్ళు మనమిద్దరం ఒకే మనసుగా, ఒకే ప్రాణంగా మసిలాం. నీకన్నా ఎవరున్నారు చెప్పుకునేందుకు?

వైవాహిక జీవితంలో ఆకర్షణకన్నా అతీతమైన భావన ఏదో వుంది అనేదానివి గుర్తుందా? అది నిజమన్పిస్తోంది వరూ!

మధుకర్ అందమైనవారు. చదువుకున్నారు. కాని....కాని....నాకు కావల్సింది అదికాదు వరూ! భర్తకి, భార్యకీ మధ్య ఓ సుహృద్భావం ఓ సదవగాహన. అదే లోపించింది మాలో. నా అలవాట్లనూ, అభిరుచుల్నీ తెగ హేళనచేసేవారు పెళ్ళయిన కొత్తలో. మొదట బాధపడేదాన్ని. తీవ్రంగా ఎదురు తిరిగేదాన్ని. పర్యవసానం తీవ్రమైన వాతావరణం. తర్వాత తర్వాత రాజీపడడం మొదలెట్టాను. కాని ఎన్నాళ్ళు రాజీపడను? జీవితం ప్రతిసారీ నేనే రాజీపడడంతో నిస్సారంగా అన్పిస్తోంది. ఆయనది దురుసైన స్వభావం. మాటలు తీవ్రంగా వస్తాయి. పశ్చాత్తాపపడినట్లు కూడా కన్పించరు. ఏకాంతంగా వున్న సమయాల్లో కూడా ఆయన ప్రవర్తనలో ఆప్యాయత కన్నా అధికారమే కన్పిస్తుంది. చల్లని మాటా, సేదదీర్చే హృదయమూ లేవు ఆయనలో. ఆ అందం వెనుక దేవుడు అంత కాఠిన్యం దాచాడేమిటి?

'అన్యోన్య దాంపత్యం' పోటీలో బహుమతి రావడం తల్చుకుంటుంటే నవ్వు వస్తోంది. పాపం! వాళ్ళు మాత్రం ఏం చేస్తారు? వాళ్ళ కళ్ళకి కన్పించిన దానికి విలువకట్టడం తప్ప! మధుకర్, నేనూ ఒకళ్ళకోసం మరొకళ్ళం పుట్టామేమో అన్నంత యిదిగా కన్పిస్తాం గదూ! మా హృదయాల్లోకి తొంగిచూసేంత శక్తి ఎవరికన్నా వుంటే, వాటి మధ్య గల దూరాలు గోచరిస్తాయి. నిజం వరూ! రెండేళ్ళ బాధ యిది.

'అన్యోన్య దాంపత్యం' బహుమతిని నేనే అందజేయాల్సివస్తే తప్పకుండా మా అమ్మా నాన్నలకి అందజేస్తాను. ఆ అన్యోన్యత 'అనితర సాధ్యమన్పిస్తుంది నాకు.

ఒకళ్ళ అభిప్రాయాలను మరొకరు గౌరవిస్తూ, ఒకళ్ళ అభిరుచుల్ని మరొకరు మన్నిస్తూ, పాలూ నీళ్ళలా, ఆకూ వక్కలా కలిసిపోయే దాంపత్యం నాకీ జన్మలో ప్రాప్తంలేదు వరూ!

నా కడుపులో బాధ విప్పి చెప్పినందుకు ఏమనుకుంటావో మరి? ఉంటాను.

నీ సరిత.

సరిత కళ్ళు ధారగా వర్షిస్తున్నాయి.

ఉత్తరంలో ఒక్కో అక్షరమే ఆ కన్నీటితడికి కరిగిపోతోంది.

'ఎవరికి చెప్పుకున్నా నా బాధ తీరేదికాదు. వాళ్ళకి నా విషయంలో వున్న సదభిప్రాయం పోగొట్టుకోవడం ఎందుకు?' అనుకుంది సరిత, అక్షరాలు దిద్దే ప్రయత్నం మానుకుని. □

## పాఠకులకు:

## "చిత్రానికి కథ"

ఇక్కడ ఒక చిత్రం కనిపిస్తోంది. ఆ చిత్రాన్ని చూసి, మీరు దానికి తగ్గట్టుగా ఏదైనా చిన్న 'కథ' అల్లగలరా? కథలో చమత్కారం వుంటే మరీ మంచిది. ఏమైనా, తావు సైజులో పేజీకి మించి రాయకూడదు. అలా రాసి, ఆ కథల్ని 'చిత్రానికి కథ' అన్న పేరిట మార్చి 7వ తేదీలోగా మాకు చేరేలా పంపాలి. అన్నింటికంటె: బాగున్నదనిపించిన కథ రాసిన వారికి 'ఉపయోగపడే చక్కని బహుమతి' పంపుతాము.

**ఫలితం: ఏప్రిల్ సంచికలో**





ఎన్. సంగీత (అనంతపూర్) పుట్టిన తేదీ 27-3-76 తల్లి పేరు: ఎన్. వసంతకుమారి



బి. పవన్‌కుమార్ (కల్పాక్కం) పుట్టిన తేదీ: 26-3-78 తల్లి పేరు: బి. లక్ష్మి



కె. కాంతి (విశాఖపట్నం) పుట్టిన తేదీ 25-3-77 తల్లి పేరు: మణికుమారి ప్రభాకర్




ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో – ఏడాది పిల్లల గ్రూపులో బి. పవన్ కుమార్; రెండేళ్ళ గ్రూపులో కె. కాంతి, మూడేళ్ళ గ్రూపులో ఎన్. సంగీత 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురితోపాటు, మొత్తం మీద మూడు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. ఏప్రిల్ సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు – వివరాలతోసహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి; ఫొటో వెనక పెన్సిల్‌తో శిశువు పేరు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు) మార్చి 7 వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.

కె. రవిశంకర్ (హైద్రాబాద్) పుట్టిన తేదీ: 7-3-78 తల్లి పేరు: కె. ఉషారాణి



ఎల్. లక్ష్మీనాగ శైలజ (కొల్లూరు) పుట్టిన తేదీ: 18-3-78 తల్లి పేరు: ఎల్. రమాగాయత్రి





Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

# సూపర్ 777

## మురికికి ముప్పు, మెరుపుల తెలుపు







భారతదేశంలో లక్షలాది గృహిణులు మెచ్చిన
సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్.

**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**

